సుమిత్ర నవ్వింది. "ఎంతమాట! అంత పెద్ద పొగడ్తలు భరించలేను నేను—ఏదో నా శక్తికి తగిన కృషి. అంతే." అన్నది ఆమె.

ఆమె నోటవెంబడివచ్చిన మాటలు వాళ్ళు ముగ్గురూ అతి శ్రద్ధగా విన్నారు. "వస్తామండీ—మీ పరిచయభాగ్యం కలిగినందుకు చాల సంతోషం." అన్నారు. వెళ్ళిపోయారు.

సుమిత్ర చిరునవ్వుతో సీతవంక చూచి అడిగింది "నేను డాన్సు చేస్తాను తెలుసా?" అని.

"తెలియకేం? పేపరులో చూస్తూనే వున్నాంకదా!— నేను నేర్చుకుంటానంటే నాన్న ఒప్పుకున్నారు కాదు, అన్నిటితో పాటే అదీ అల్లాగపోయింది."

సుమిత్రముఖాన నవ్వుపోయింది. చటుక్కున సుందర్రావు వంక చూసింది. అతను సీత వంక ఒకసారి చూసి తలతిప్పేసుకున్నాడు—సుమిత్ర చూపుని ఎదుర్కోలేక అతను.

"ఎక్కడికి వెడదాం యింక?" అన్నది సీత.

"సినిమాకి వెడదామా? పబ్లిక్ గార్డెన్సుకి వెడదామా? అల్లా టాంక్ బండీమీద నడుద్దామా?" అన్నది సుమిత్ర.

"వాకింగ్!" అన్నాడు నానీ. సుమిత్రకి నవ్వొచ్చింది. "కాన్వెంటులో కదూ వీడు చదువుతున్నాడు—అందుకే యీ యింగ్లీషు మాటలు. ఏరా? తెలుగు మాట్లాడవా నువ్వు?" అన్నది వాడి బుగ్గ గిల్లి.

"నో అయిల్ స్పీక్ ఇన్ ఇంగ్లిష్." అన్నాడు వాడు. సుమిత్ర పకపక నవ్వి, వాణ్ణి దగ్గరకు తీసుకుంది.—

—ఆ తర్వాత నాలుగురోజులు గడిచాయి.

సుందర్రావుపని పూర్తయింది. సుమిత్ర ఒకరోజు శెలవుపెట్టి తెలిసినవాళ్ళ కారు ఒకటి తీసుకొచ్చి, చూడదగినవన్నీ చూపించింది పిల్లలకి. ఎక్కడికెళ్ళినా ఎవరో ఒకరు సుమిత్రని ఎరిగున్నవాళ్ళు కనుపిస్తూన్నారు. ఏదో వినయంగా ఆమె విద్యని, నాట్యాన్ని పొగుడుతున్నారు. సుందర్రావు చెప్పాడు వాళ్ళకంపెనీ బ్రాంచి మానేజరు కూడా సుమిత్ర చాలా సమర్థురాలైన ఆఫీసరని చెప్పాడని.

ఓ నాడు సినిమాకి వెళ్ళారు అంతా కలిసి. చిట్టి సినిమా ఆరంభం కాగానే నిద్రపోయింది పేచీలేకుండా. సినిమా చూస్తున్నంత సేపూ సీత మనస్సు ఏమీ బాగుండలేదు. ఏమిటో నిరుత్సాహంగావుంది. చిరుచీకట్లో సుమిత్రవంక చూసింది. ఆమె ఆమె కళ్ళల్లో మెరుపు కనిపిస్తోంది. ఆమె కూర్చున్న తీరులోనే ఓ సౌఖ్యంవుంది. ఆమె చూపులో ఒక నిశ్చయం, ప్రతి కదలికలో ఒక చైతన్యం వున్నాయి. ఆమె జీవితంలోని చైతన్యం తొణికిసలాడుతోంది అనుకుంది సీత. తన సంగతేమిటి? దైనందిన కార్యక్రమాలలో ఒక వరవడిలో నడుస్తుంది తన జీవితం. చెరువులో నీరులాగా తన జీవితానికి కదలిక లేదు. సుమిత్ర ఓ సెలయేరు—గలగలలాడుతూ, కొత్తదనాలతో పరవళ్లు త్రొక్కుతూ వురుకులతో పరుగులతో ప్రవహించే సెలయేరు.

సీత కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. ముత్యాల్లాంటి రెండు కన్నీటి బొట్లు బుగ్గలమీదనుంచి క్రిందికి జారాయి. ప్రక్కకి తిరిగి ఆయన్ని చూసింది. చెదిరిపోతూ కనబడింది ఆయన ఆకారం. తనకి యీర్ష్య సుమిత్రని చూస్తే ఎందుకు? తనకి డబ్బువుంది. తనభర్తకి హోదా వుంది.

కానీ—కానీ—తన జీవితంలో శోభలేదు. తనకర్థం కాని విషయాలు, అర్థంచేసుకునే అవకాశంలేని విషయాలు ఎన్నో వున్నాయి. సుమిత్రవున్న ఆ మెట్టుమీదికి, ఆ సంస్కార స్థాయికి ఎక్కడానికి తనకి అర్హత, అవకాశంలేవు—సీతకి యీ ఆలోచనలు ఊపిరి సలపనివ్వలేదు.

తనని బంధించి, పైకి వెళ్ళనివ్వక, ఔన్నత్యాన్ని అందుకునే అవకాశం లేకుండా చేశాయి యీ పెళ్ళి. యీ పిల్లలు, సంసారం. తనలోని విద్యాతృష్ణకి ఉత్సాహానికి వెళ్లమార్గం లేదు. "ఇదే నీ జీవితానికి పరిధి ఈ గిరిలోపలనే ఆనందం పండించుకో" అని విధించబడయింది.

సీతకి పెల్లుబికివచ్చింది దుఃఖం. చటుక్కున లేచి బైటికి వెళ్ళిందామె—అక్కడ నిలవలేకపోయింది. సుందర్రావు లేచి వచ్చాడని తెలుసు. గట్టిగా కళ్ళు వత్తుకుని వెనక్కి తిరిగేసరికి, అతను ఎదురయ్యాడు.

"ఏమండీ—నీరసంగావుండి యిల్లా వచ్చాను. సర్దుకుంది యిప్పుడు." అన్నది ఆమె మెల్లిగా.

ఆ రాత్రి సుమిత్ర త్వరగా నిద్రపోయింది. సీత పాపాయికి కావలసినవన్నీ సర్దుకుని, పడుకునేసరికి పన్నెండయింది.

సుందర్రావు చదువుతున్న పేపరు మడిచి పడేశాడు. "చూడు సీతా!" అన్నాడు.

"చెప్పండి"

"మీ సుమిత్ర పెళ్ళి చేసుకోదా అసలు?" అన్నాడు.

"ఇప్పుడెందుకొచ్చింది ఆ ప్రశ్న మీకు?"

"చేసుకునే ఉద్దేశం వుంటే ఓ సంబంధం చెబుదామని."

"ఎవరేమిటి?" అన్నది సీత కొంచెం సేపాగి.

"మా వేణు"—సీత మాట్లాడలేదు. ఒక పది నిమిషాలైనాక "దాని తరహా వేరు. పెళ్ళి, సంసారం, జంజాటం అంతా అక్కర్లేదు దానికి—హాయిగావుంది. చీకు, చింతా లేకుండా. పైకి వెళుతోంది—కీర్తి తెచ్చుకుంటోంది—దాని కెందుకు పెళ్ళి—బంధనం కాకపోతే." అన్నది.

అంతటితో ఆ సంభాషణ ఆగిపోయింది.

—"రేపు వెళతానండీ మేము." అన్నాడు సుందర్రావు మర్నాడు ప్రొద్దున్న కాఫీలప్పుడు.

"అప్పుడేనా?" అన్నది సుమిత్ర సీతవంక చూసి.

"మరి వెళ్ళొద్దూ? ఇప్పటికే వారమైంది వచ్చి—కంపెనీపని యీ రోజుతో అయిపోతుంది. ఇంకా వుండడమెల్లాగ?" అన్నది సీత.

"మా సీత యిల్లు వాకిలీ చూడకుండా బెంగపెట్టుకుంటుందండీ—పాలవాడు, పనివాళ్ళు ఇంకొంప దోచుకుపడి పోతుంటారని తన వూహ." అన్నాడు సుందర్రావు నవ్వుతూ.

సీత ఆశ్చర్యంగా చూసి నవ్వింది. "సరే! మీరు లేకపోయినా నాకు బెంగలేదు కాని—పాలవాళ్ళ కోసం మాత్రం బెంగే. ఏం?" అంది.

"ఎలుండి రాత్రి నా ప్రోగ్రాం వుంది యిక్కడ. ఉంటారూ? అవలెల్లుండి వెళ్ళిపోదురు గాని" అన్నది సుమిత్ర సందేహిస్తూ.

"మరి చెప్పరేం? తప్పకుండా వుంటామండీ. ఏం సీతా?" అన్నాడు సుందర్రావు హుషారుగా.

"మా సీత ఎల్లాగూ వుంటుంది. అడిగే దేమిటి?"—అన్నది సుమిత్ర.

*  *  *  *

కారు మంచి స్పీడుమీద మెత్తగా జారిపోతోంది రోడ్డుమీద. సుమిత్ర తల్లో మల్లెపూలవాసన గుప్పున వేస్తోంది. చీకట్లో సుమిత్ర ఒంటిమీదున్న ఆభరణాలన్నీ నక్షత్రాలయమానంగా మెరుస్తున్నాయి. రేగిన జుట్టుని సరిచేసుకుంది సుమిత్ర—చేతినున్న గాజులు గలగలమన్నాయి. ఉంగరాలు, గాజులలోని రాళ్ళు తళుక్కున మెరిశాయి.

"సీతా, ఎన్నాళ్ళుగానో అంటున్నావు మా సుమిత్ర డాన్సు చూడాలి, చూడాలని—చూశావుగా! ఎల్లా వుందో చెప్పవేం?" అన్నాడు సుందర్రావు.

"నే చెప్పేదేమిటి? అక్కడి జనమంతా చెప్పారు. బిరుదు యిచ్చి అంతా గౌరవించారు. నా అభిప్రాయ మెందుకు?" అన్నది సీత.

సుమిత్ర తనచేయి సీత భుజంమీద వేసింది. "అలా కాదు. నీ అభిప్రాయమే కావాలి నాకు—అందరూ అనే మాటకేం లే." అన్నది.

సీత మాట్లాడలేదు. కారు యింటికి చేరింది. డ్రైవరు మల్లెపూల దండలు, ఇతర సామానులు తెచ్చి లోపల పెట్టి సలాం చేసి వెళ్ళాడు.

లోపలికి వెడుతూనే, తన గదిలోకి వెళ్ళి డాన్సు డ్రెస్సు విప్పేసి, చీర కట్టుకుని వచ్చింది సుమిత్ర. రేగిన ముంగురులు, ముఖాన రంగు, నల్లగా దిద్దబడిన కళ్ళు, కనుబొమలు, కెంపుల్లా మెరుస్తున్న పెదిమలు—సీత కళ్ళు మరల్చుకోలేనంత అందంగా వుంది సుమిత్ర.

"భోజనం చేదాం పదండి" అన్నది సుమిత్ర. భోజనం చేస్తున్నంతసేపు సుమిత్ర నవ్వినా, చూసినా, యేం చేసినా లాస్యం తొణికిసలాడుతోంది. ఆమె కంఠం గలగలలాడుతూ, చిరుగజ్జెలు మ్రోగించినట్లుగా శ్రావ్యంగా వుంది. అలనాడు లాస్యం చేసిన పార్వతి యిల్లాగే వుండేదికాబోలు అనుకుంది సీత.

"రంగు కడిగేసుకోవాతే, ఏమీ కాదా ముఖం!" అన్నది సీత.

"ఏమౌతుంది? ఏం కాదు—అలవాటులేనివాళ్ళకి తెల్లారేసరికి పీక్కుపోయినట్టు వుంటుంది ముఖం." అన్నది సుమిత్ర.

భోజనాలయ్యాక హాల్లో చాలాసేపు కూర్చున్నారు కబుర్లలో. సుమిత్ర తనకివ్వబడిన బంగారు నటరాజవిగ్రహాన్ని చూస్తూ నిలబడింది చాలాసేపు.

పన్నెండైనాక సుందర్రావు లేచి, "నిద్రొస్తుంది. నీకు నిద్ర రావటంలేదా?" అన్నాడు సీతవంక చూసి.

"మీరు పడుకోండి." అన్నది సీత. అతను వెళ్ళిపోయాడు.

కొన్నిక్షణాలు మౌనంగా గడిచాయి. సుమిత్ర నిట్టూర్చింది. "ఇన్నేళ్ళకి ఇప్పుడు కనిపించావు- ఇంకెప్పటికి కనిపిస్తావో మళ్ళా?"

"మేమే రావాలని ఏమిటే? నువ్వు రాకూడదూ? హాయిగా ఒంటరిదానివి కదా?—సుమిత్రా, ఎన్నైనా చెప్పు. చదువుకున్నవాళ్ళ దారి వేరు, చదువుకోనివాళ్ళ దారి వేరు—డబ్బు హోదా ఎన్నైనా వుండొచ్చుగాక. ఆ తరహా రాదు." హఠాత్తుగా ఆ వేళ పూరితమైంది సీత కంఠం.

"అల్లా అంటావేం సీతా? చదువుకుని నేను బావుకున్న దేమిటి—నీకు తక్కువైం దేమిటి?" అన్నది సుమిత్ర చేతులకి, చెవులకి వున్న వస్తువులు తీస్తూ.

"నీ కర్థంకాదు సుమిత్రా, ఎల్లాగూ తప్పదు అభేదం. అప్పుడు చదువుకోలేదా-అంతే. ఇక ఎప్పుడూ అంతే—నా అంతట నేనిప్పుడు ఏదైనా నేర్చుకుందామన్నా తగిన అవసరాలేదు. అసలు నా అంతంతమాత్రం చదువే చదివారు. ఇక యీ జన్మకి కుదరదు పైకి వెళ్ళటమనేది మాకు—ఈ పెళ్లి. సంసారం. పిల్లలు వీటిల్లోపడి ఏమీ తెలియక, ఏమీ పట్టక అన్యాయమైపోయాను" సీత కంఠం గద్గదికమైంది.

సుమిత్ర దగ్గరగా జరిగింది సీతకి. "చూడు, నేనేదో సాధిస్తున్నానని, ఆ తృప్తిలో వున్నాననీ అనుకుంటున్నావు నువ్వు—నీసంగతి నీకు తెలియడంలేదు సీతా!"

సీత కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "నన్ను ఓదార్చాలని అంటావు-నాక్కూడా మానాన్న చదువు చెప్పించి, ఏ సంగీతమో, ఏదో చెప్పిస్తే నేనుకూడా పైకి వచ్చేదాన్ని కాదూ?"—సుమిత్ర మాట్లాడలేదు.

సీత అన్నది "చిట్టి దీపం వుంటే లేస్తుంది. ఆర్పేయి అది." అని.

సుమిత్ర లేచి ఆర్పేసి వచ్చింది. సీత చేతులు తన చేతుల్లోకి తీసుకుంది. "పైకి రావటమంటే ఏమిటె సీతా? కొంత పేరు, డబ్బు, హోదా కదూ? ఏమిటీ పైకి రావటం. నేనిప్పుడు ఔన్నత్యం పొందానంటావు నువ్వు—నేను సుఖపడుతున్నాననా? వాళ్ళయితే మీరున్నారు, యీ దండలు, విగ్రహం చూడడానికి, నాకు బిరుదు యిచ్చారని సంతోషించడానికి—నాకెవరుంటారు? చీకట్లో, అర్ధరాత్రివేళ తలుపు తెరుచుకుని, ఆ దండలు అలా పడేసి, చెవుల్లో ఆ చప్పట్లు మార్మోగుతోంటే ఒంటరిగా వుండడానికి భయంవేసి, యింట్లోని దీపాలన్నీ వేసుకుని కూర్చుంటాను."...

కొంచెం ఆగి, "వాలుగుసందలమైళ్ళ దూరంలోవున్న అమ్మ, నాన్న నా దగ్గిరే వున్నా నాకు శాంతి నివ్వలేరు సీతా—"

ఆమె చేతులు చల్లగా వున్నాయి, వేళ్ళు ఏమీ తోచనట్టు సీత చేతుల్లో కదులుతున్నాయి.

"తోటిదానివి కాబట్టి నీతో చెప్పుకో గలుగుతున్నాను. నన్ను అపార్థం చేసుకోకు. నువ్వు ఆయనవంక చూసి నవ్వితే, ఆయన నీవేపు యిష్టంగా నవ్వుతోంటే—అప్రయత్నంగా యిది గమనిస్తోంటే అర్థమైంది ఆలోటు ఏమిటో. నీకు తెలీదు నీ జీవితంలో ఎంత సంపూర్ణత్వం వుందో, ఆ పిల్లలకోసం కష్టపడటంలో, ఆయనకోసం శ్రమించటంలో నువ్వు చూపే ఓర్పు చూస్తోంటే—నీ జీవితమే అందుకు అర్పించేస్తున్నావని తోస్తోంటే—నీలో ఔన్నత్యం కనపిస్తుంది. నీలోంచి ఒక ప్రేమపూరిత వాహిని, ఒక తియ్యని వెల్లువలో కొన్నంతని ముంచెత్తివేస్తుం దనిపిస్తుంది... సీతా, నీ కళ్ళల్లో లోతు నీ కర్థం కాదు. అద్దంలో చూసుకుంటే కనబడదు. నీ చిట్టివేపు నువ్వు చూస్తోంటే కనబడుతుంది..."

సీత మెల్లిగా తలెత్తి, సుమిత్ర కళ్ళలోకి చూడ్డానికి ప్రయత్నిస్తోంది. ఏముందో వెతకాలనుకుంది. సుమిత్ర తన అరచేతులు చెంపల కదుముకున్నది.

"నేనేమిటో పైకి వచ్చావంటావు—కానీ నీలాగా పైకి రాలేదు సీతా నేను. నీకు భవిష్యత్తు వుంది. అనంతమైన భవిష్యత్తు వుందనిపిస్తుంది. మూడు జీవితాలు నిన్ను ఆధారం చేసుకుని, నిన్నల్లుకుని వున్నాయి. రెండు జీవితాలు మలచి, వ్యక్తిత్వాలు రూపొందించి—యింక ఎన్నో చేయాల్సిన భవిష్యత్తుంది. నీ జీవితానికి ఒక అర్థం, ఒక పరిపూర్ణత్వం వున్నాయి. నాకు ప్రాణం విసిగిపోతోంది—ఈ హోదా, జీతాలు, గొడవలు-కానీ నేను జీవితంలో ఒకభాగాన్ని చూస్తున్నాను. ఆ భాగం యింక యిక్కడికి అంతంచేసి యింకా ఎన్నో చూడాలి అనిపిస్తుంటుంది నాకు. లేకపోతే ఎన్నో అనుభూతులు, మమతలు, నాకు అర్థం కాకుండా వుండిపోతాయి."......సీత కిదంతా అర్థమౌతోంది, కానీ—ఆమె యిదంతా నిర్ధారణ చేసుకోవా లన్నట్లు సుమిత్ర ముఖంలోకి చూస్తోంది.

"సీతా, నేను స్వేచ్ఛగావున్నానన్నావు—బ్రహ్మాండమైన ఎడారిలో విడిచెస్తే మనిషికి కావలసినంత స్వేచ్ఛ వుంటుంది—అల్లాంటిదే నాదీ. ఆస్వేచ్ఛ భరించటం కష్టం సీతా!......" సుమిత్ర కంఠం వణుకుతోంది. సీతముఖంలోకి వెతుకుతూ, తరచి తరచి చూస్తూన్న కళ్ళు, చీకట్లోకూడా మిలమిలలాడుతూ కనుపిస్తున్నాయి.

లోపల పానీ కదిలినట్లు అలికిడైంది. సీత చిట్టిని భుజాన వేసుకుని లేచింది "వేసంకాలం ఓమూలైనా రాత్రి నీళ్ళు త్రాగించాలి వాడిచేత. దాహం వేస్తోంది పాపం!" అంటూ లోపలికి వెళ్ళింది. ఐదునిముషాల తర్వాత తిరిగివచ్చింది.

ఒక్కక్షణం ఆగి సుమిత్ర నవ్వింది "చూశావా మరి—అదీ నీకవసరం-చూడు, అన్నీ మర్చిపో. పడుకుని నిద్రపో నిశ్చింతంగా. చిట్టి లేస్తుంటుంది నువ్వు పక్కన లేకపోతే...పద. నాకోరికే యింత" అన్నది.

—మర్నాడు రాత్రి రైలు హైదరాబాదు విడిచిపెట్టి మెల్లిగా నడుస్తోంది. కను మరుగయ్యేదాకా సుమిత్రని చూశారు సీత, సుందరరావు. లోపలికొచ్చి తలుపు వేశాడతను.

సీత అతనివంక చూసి నవ్వింది. అతనుకూడా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నావు?" అన్నాడు.

"మీరెందుకు నవ్వారు?" అంది సీత యింకా చిలిపిగా నవ్వుతూ.

"నువ్వు నవ్విన తర్వాత, నేను నవ్వకపోతే, నువ్వు ఏడుస్తావేమోనని—" ప్రక్కనవచ్చి కూర్చున్నాడు,

"ఏడవలేకపోయాను లెద్దురూ!" కిలకిల నవ్వింది సీత.

"చూడండి—మనవేణుకి మీరు చెప్పిన సంబంధం చేద్దాం. ఏం?" అన్నది.

సుందరరావు ముఖంలో ఆశ్చర్యం తొంగిచూచింది. ఎల్లా యీ మనిషిని అర్థంచేసుకోవటం అన్నట్టుగా ప్రశ్నార్థకంకూడా వచ్చింది. మరుక్షణం నవ్వి "అల్లాగే" అన్నాడతను.

# శిశిర వేదన

శ్రీ సి. నారాయణరెడ్డి

సఖీ మాఘమాస సుందరి వేఁగిచూచినది
బరిగత్తులను పదునుపరచు చూపులతోడ.

నా యెదుట శిశిరకాంత నటించిపోయినది
జలతారు మంచు కుచ్చెలలు దుసికిళ్ళాడ.

చిటిలినది నా అధరపుట మొక్కటే కాదు
మెయిముడతలన్ దాగిన యెడంద సైతమ్ము.

ఘంటు వడినది పేద గుండె యొకటే కాదు
పాలరెక్కల భావనా లలిత మూర్తులును.

అసలే వియోగ దగ్ధాకృతిని; అందులో
శిశిరనర్తకి చేల చెరగు గాడ్పులదాడి.

ఇక నేమి మండిపోయెను గుండెపై క్రొత్త
కుంపటుల్ భుగభుగ రగుల్కొల్పి నటులయె.

ఐన ఈ బాధ నా కీనాటిదా కాదు;
ప్రతి ఋతువులో ప్రజ్వలితమైనదే కదా!

ఇదిగో వసంతమని యెదపొంగి లేచితిని
అది పికీ కంఠమం దొదిగి కేరింతలిడె.

గ్రీష్ముని యింటిముంగిట నిల్పి చూచితిని.
కనులు రెండింట దుమ్ముకు గొట్టిపోయె నది.

జలద ఋతువంచు మిన్నుఁ గ్రేవ కేల్సాచ
గ్రుడ్డిజేసి పిడుగులు రాల్చి పోయె నది.

ఓహో శరత్తని మధూహాలను పెంచుకొన
అది చకోరికలకే అంకితమ్మైపోయె.

చివరి కొక చలికాపు చిక్కెనని ఉప్పొంగ
అది జంట కౌగిళ్ళయందే నలిగిపోయె.

మిగిలినది యీ శిశిరమే కదా మరి! ఇదియు
నను దిగంబరునిగా నొనరించ కెటులుండు?

ఇంత కొండంత బాధేతిహాసమ్ము నా
మది దాచి పెనవున్ మల్లికలు పూయింతు.

కొండకోనల నంటుకొను దావాగ్ని కా
దిది; అంతరాల మండెడు బాడబజ్వాల.

ఓ శిశిర విషధర క్రీకుంతలా! చల
న్నీహికాంటాంచలా! మేను పరచితి రమ్ము.

నడిచిపో నా మొండి యొడలిపై; కాదేని
విడిచిపో ఈ పూలపెండ్లి పందిరిని.

# పదేండ్లలో దొరికిన అపూర్వ శాసనాలు

శ్రీ కొల్లూరు హర్షవర్ధన శర్మ

భారత చరిత్ర నిర్మాణమునకు గల ఆధారము లన్నింటిలో నతి ముఖ్యములు, కడు ప్రామాణికములైనవి శాసనములు మాత్రమే. ఉపలబ్ధమైన శాసనాధారములను జక్కగా సమన్వయముచేసి తగిన రీతిని చరిత్ర రచన సాగింపవలెను. గతదశాబ్దములో కేంద్రప్రభుత్వ ఆంధ్ర శాసన పరిశోధనశాఖల కృషి ఫలితముగ మనదేశమున నలుమూలల నూతన శాసనములు బయల్పడినవి. అందు ముఖ్యమైనవి కొన్ని శాసనములను గూర్చి ఈ క్రింద వివరింతును.

ప్రప్రథమమున మనదేశమున శాసనములు చెక్కించి 'భారత శాసన పిత' యని ప్రసిద్ధిగాంచిన మౌర్యవంశజుడగు అశోకుని కాందహారు శాసనము మొదట గమనింపదగినది. 1958 సంవత్సరము ఏప్రిల్ మాసమున కాందహార్ (ఆఫ్ఘనిస్తాన్) వద్ద స్కూలు ప్రధానోపాధ్యాయుడు అబ్దుల్ జే అన్న యనువారిచే దీనిని కనుగొనెను. ఇది గ్రీక్, అర్మెయిక్ భాషలలో గలదు. 'పియోదశిస్' అని యుండుటనుబట్టి వెంటనే ఫ్రెంచి శాసనపరిశోధకులిది అశోకుని శిలాశాసనమని ప్రపంచమంతకు వార్తాపత్రికలద్వార అందజేసిరి. శాసనలిపి అందముగను శుభ్రముగ చెక్కబడినది. భాషలుకూడ స్వచ్ఛముగ నున్నవి. అందలి సారాంశ మిది.

"ప్రియదర్శిరాజు 10 వ రాజ్యవర్షమున దయా, ధర్మగుణ గలవాడై ప్రపంచమునందలి ప్రజలను మిక్కిలి సుఖింప జేయుచుండెను. అధర్మము క్రమముగ నశించుచున్నది. కొద్ది జంతువులు మాత్రమే ఆహారమునకై చంపబడుచున్నవి. జాలరులు వేటగాండ్రును కూడ జీవహింస మానివేసిరి. తల్లిదండ్రులు వృద్ధులయెడ విధేయులై యుండవలెను. ధర్మనిరతులైనవారి కెట్టి శిక్షయు లేదు. ఇట్టి జీవనము మిక్కిలి సుఖమైనది."

అశోకుని ఇతర ప్రాకృత శాసనములవలె నిదియు ధర్మబోధకమే యయినను అక్షరశః అనువాదము మాత్రము కాదు, మరియు నిందు బ్రాహ్మణులు, శ్రమణులు విడిచిపెట్టబడిరి. కారణము ఈ శాసనమెవరికై యుద్దేశింపబడినదో ఆ ప్రాంతమున వారు లేకుండుటయే. చారిత్రకముగ నిది మిక్కిలి ముఖ్యమైనది. అశోకుని శాసన మా ప్రాంతములో దొరకుట ఏమంత అసంభవము కాదు. అలెగ్జాండరుచే పూర్వ మా ప్రాంతమున గ్రీకులకై కొన్ని నివాసములు కల్పింపబడి తరువాత సెల్యూకస్ నికటార్ చే అవి అశోకుని పితామహుడగు చంద్రగుప్తమౌర్యునకిచ్చివేయబడినవి. ఇట్లా ప్రాంతము అశోకునకు పూర్వమునుండియే మౌర్యులపాలనక్రింద నుండెను. అశోకుని శాసనములో యవన, కాంభోజులని పేర్కొనబడినవారీ ప్రాంతమువారే. ఈ ప్రాంతములో తన ఏలుబడిక్రిందిగల యవన, కాంభోజులకై ఈ శాసనము గ్రీకు, అర్మెయిక్ భాషలలో వేయింపబడినది.

కర్నూలుజిల్లా రాజులమందగిరిలోను, వింధ్యప్రదేశ్ ఝాన్సీ వద్ద గుజ్జరాలోనుకూడ అశోకుని మరికొన్ని క్రొత్త శిలాశాసనములు బయల్పడినవి. రాజులమందగిరి శాసనము మౌర్య సామ్రాజ్యపు దక్షిణదిశ సరిహద్దును తెల్పుచున్నది.

శ్రీకాకుళముజిల్లా శాలిహుండమువద్ద చైత్యవిహారములో బ్రాహ్మీలిపిలో చిన్నశాసనముగల శిలాఫలక మొకటి దొరికినది. అందు "సంమరాజ్ఞో అశోకసిరినో"—అని గలదు. మౌర్యవంశజుడగు అశోకుడు కళింగమును జయించిన సంగతి విదితమేగదా. కాని దీని లిపి క్రీ. శ. రెండవ శతాబ్దమునకు చెందినదగుటచే నందు పేర్కొనబడిన దాత మరువాడని సందియము గల్గుచున్నది.

గుంటూరుజిల్లా అమరావతిలోని స్తూపముకదానిని త్రవ్వుచుండగా బ్రాహ్మీలిపిలో ఈ క్రింది శాసనముగల నిలువరాతి ముక్క బయటపడినది "రాజకుమరియా సంమలియా సిరిపేసకో... ఉన్హీసం"—సంమాలి రాజకుమార్తె పరివారికలు దానమిచ్చిన రాతిని తెల్పుచున్నది. ఈ సంమాలి రాజకుమార్తె యెవ్వరో విచారింపదగిన.

మధురా వస్తుప్రదర్శనశాలలో శిథిల విగ్రహమున కొక శాసనము కుషానులిపిలో రెండుపంక్తులలో గలదు. కుడిప్రక్క శాసనాక్షరములు కొన్ని విరిగిపోయినవి. కనుక దీని ద్వితీయ కనిష్కుని పాలన రాజ్యకాలమున బౌద్ధ సన్యాసి యగు ధర్మనంది మహావిహారమునకు చెందిన యొకడు చేసిన ప్రతిష్ఠను దెల్పుచున్నది.

1. "సిద్ధం. మహారాజస్య కనిష్కస్య సం. ౪. హే ౧ ది ౧ ఏతస్య పూర్వాయాం భిక్షోర్ధర్మనందిస్య ధర్మకథికస్య సాంఘ్యవిహారస్య...
2. ప్రతిష్ఠాపయతి........."

కనిష్కుడు క్రీ. శ. 78 లో సింహాసన మధిష్ఠించుటచే నిది క్రీ. శ. 81-82 నాటిది. మధుర వద్ద కుషానచక్రవర్తి యగు వాసుదేవుని 64 వ రాజ్యకాలమున (క్రీ. శ. 142) గుహాసేనుడను వానిచే ఆలయమొకటి నిర్మింపబడి అందు శాక్యముని (బుద్ధుని) విగ్రహము ప్రతిష్ఠింపబడెనని శాసనము గలదు. దీనిని బట్టి హువిష్కునకు నితనికి గల యంతరము నాల్గు సంవత్సరములు మాత్రమే యని తెలియు చున్నది.

గుంటూరుజిల్లా నాగార్జునకొండలోయ అచిరకాలములో కృష్ణానదిజలప్రవాహముచే పూర్తిగ కప్పివేయబడును గాన సాధ్యమైనంతవఱకందలి పురాతనశిథిలములను రక్షింపవలెనని ఐదారు సంవత్సరములనుండి కేంద్రప్రభుత్వ పురాతత్త్వ శాఖవా రధిక వ్యయము నొనర్చి అతిత్వరితముగ పనిచేయుచున్నారు. తత్ఫలితముగ పెక్కు నూతనాంశములు తెలియవచ్చెను. పూర్వ మచ్చట దొరికిన ఆధారములను బట్టి ఇక్ష్వాకురాజుల బౌద్ధమతమును గూర్చియే తెల్పిన

వది. కాని ప్రస్తుతము లభ్యమైన సాక్ష్యములచే వారు అశ్వమేధ, యజ్ఞయాగాది కర్మలనుష్ఠించిన వైదిక మతావలంబకులని నిర్ధారణగా చెప్పగలము. బౌద్ధమతమునకు సంబంధించిన వారి శాసనము లన్నియు ప్రాకృతమునను, వైదిక మతమునకు సంబంధించినవి సంస్కృతమునను గలవు. ఇటీవల దొరికిన మూడు ముఖ్యమైన శాసనములగూర్చి వివరించగలను. నిర్దుష్టమైన చక్కని సంస్కృత శ్లోకములలో ఏహువల చాంతమూలుని ఏకాదశ రాజ్యవత్సరమున నొక శాసనము కలదు. కార్తికేయ భక్తుడు, తలవర శ్రేష్ఠుడు, సేనాపతి అశిక్క పౌత్రుడు, గణి పుత్రుడు నగు ఎలి శ్రీ అనువానిచే చక్కని విశాలమైన శివాలయ మొకటి నిర్మించబడినదని కలదు.

"జేవే యుష్యాతిభక్తి హాజాతవహాతనయే దణ్ణశక్తే కుమారే
పౌత్రస్సేనాపతేయ్యశా స్సమరవిజయినః ఖ్యాతకీర్తే రణిక్కః,
ప్రాసాదంగ్జిప్రుత్రి స్స తలవరవరః కార్తికేయప్రసాదాత్
ఎలిశ్రీ శ్రీవిశాలం శుభమతి రకరోత్సర్వ దేవాధివాసం."

దీనిని రచించిన కవిపేరు తెలియదు. కాని అత డిక్ష్వాకురాజుల ప్రాపున నుండెననుటకు సందియములేదు. మహాంధ్ర దేశమున మూడవ శతాబ్దమున నిటువంటి చక్కని కవిత్వము చెప్పగల కవులుండుట మన మెంతయు గర్వించదగినది.

ఏహువలచాంతమూలుని 16 వ రాజ్యకాలమున మఱియొక శాసనము గలదు. మహారాజ కుమారుడు మహాసేనాపతి యగు హారితిపుత్ర వీరపురుషదత్తుడు శ్రీ పుష్పభద్రస్వామి ఆలయము గట్టించి, ధ్వజస్తంభము నెత్తించి, ఆలయమునకై గ్రామము నొకదానిని దాన మిచ్చెనని యున్నది. వీరపురుషదత్తుని మాతృ పితృ వంశముల మూడు తరములవారిండు పేర్కొనబడిరి. అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధ, బహుసువర్ణకాది యాగములు చేసినట్టియు, స్వభుజబల పరాక్రమ లబ్ధరాజ్యశ్రీకుడైన ఇక్ష్వాక వాసిష్ఠీపుత్రచాంతమూలుని ప్రపౌత్రుడు, సగర దిలీపాంబరీష యుధిష్ఠిర రామాదులతో సరియైన వాసిష్ఠీపుత్ర ఏహువలచాంతమూలుని పుత్రుడుగ చెప్పబడెను. ఏహువల చాంతమూలుని రాణియు వీరపురుషదత్తుని మాత మహాదేవి కుపణశ్రీ పువ్వక దీయ శాఖకు చెందిన మహాతలవర స్కందగోపుని పౌత్రి, మహాతలవర ఖంవహోలుని పుత్రికయని గలదు. మరియు నీమె మాతులుడు ఉత్తర మహాతలవరుడట. ఇట్టి శాసనము బట్టి ఇక్ష్వాక పువ్వకందియులకుగల పరస్పర వివాహ సంబంధము తెలియుచున్నది. వీరపురుషదత్తుడు హారీతిపుత్రుడనుటచే ఈ పువ్వకందీయులు హారీతి గోత్రజులని స్పష్టము. ఈ రెండు శాసనములలో శివాలయములను నిర్మించుట, వానికగ్రహారాదులు దానమిచ్చుటనుబట్టి ఇక్ష్వాకురాజులు శైవమతస్థులని చెప్పుట కవకాశము గలదు.

వీరరుద్ర పురుషదత్తుని ఏకాదశ రాజ్యకాలము నాటి శాసన మొకటి చక్కని శిల్పము చెక్కబడిన కంబమునకు గలదు. శిల్పము కొంచెము చెరగిపోయినది. ఉన్నతపీఠముపై స్త్రీ యొకతె ఆసీనురాలై తన పాదములను దిగువనొక చిన్నపీటపై నుంచియున్నది. ఆమె దక్షిణహస్తమున దర్పణము, పార్శ్వమున పరిచారిక లిద్దరు గలరు. శాసనములో రాణి వర్మభట్టారిక (వంమ్మభటా) ఛాయా స్తంభ మెత్తబడినదని గలదు. సామాన్యముగ నీ ఛాయా స్తంభములు మృతినొందినవారికై కేయించెదరు. కాన పై శిల్పములోని స్త్రీ శాసనములో చెప్పబడిన మృతినొందిన రాణి వర్మభట్టారికయే. ఈమె మహారాజ ఏహువల చాంతమూలుని రాణి, వీరరుద్ర పురుషదత్తుని మాతయని చెప్పబడెను. మరియు నీమె బృహత్ఫలాయన గోత్రజుడగు మహాక్షత్రపుని ఆడుబిడ్డ. పశ్చిమదేశపు మహాక్షత్రప శకరాజులకు ఇక్ష్వాకులకు గల సంబంధ మిదివఱకే మనకు తెలియును. మాతరీపుత్ర వీర పురుషదత్తుని రాణి మహాదేవి రుద్రభట్టారిక ఉజ్జయిని మహారాజ కుమార్తెయని చెప్పబడినది. గుంటూరిజిల్లా పెట్లూరిపాలెములో శకరాజుల నాణెములుగూడ దొరికినవి. నాగార్జున కొండలోని ఇతర సాక్ష్యములనుబట్టి శకమనుష్యు లిక్ష్వాక రాజధానిలో నుండినట్లు తెలియుచున్నది. కాన రాణివర్మ భట్టారిక శకరాజ పుత్రిక యనుటలో సందియము లేదు. ఈమె తండ్రిపేరు తెలియదు. దీనినిబట్టి పశ్చిమదేశపు శకమహారాజులు బృహత్ఫలాయన గోత్రజులని నూతనముగా తెలియవచ్చినది. రుద్రపురుషదత్తుడు వాసిష్ఠీ పుత్రుడునని తెల్పుకొనుటచే నీమె అతని సవతితల్లి కావచ్చును. పై రెండుశాసనములనుబట్టి ఏహువల చాంతమూలునికి ముగ్గురు రాణులు, యిద్దరు కుమారులు గలరని స్పష్టమగుచున్నది.

కొద్ది మాసములక్రిందట దొరకిన నాగార్జున కొండలోని అభీర వసుసేనుని శాసనము ముఖ్యముగా గమనించదగినది. బ్రాహ్మీ లిపిలో సంస్కృతభాషలో చక్కని శిలాఫలకముపై చెక్కబడియున్నది. దీనిలిపి సరిగా ఇక్ష్వాకరాజుల లిపినే పోలియున్నది. మరియు వారి శిథిలములపై గన్పించుటచేత నాకాలమునకే చెందిన దగుటకు నిదర్శనము. వాసిష్ఠీపుత్రుడగు అభీరవసుసేనుని 9 వ రాజ్యకాలమున అష్టభుజస్వామి విగ్రహ మొకటి స్థాపించబడినది. ఆ సందర్భమున మహాగ్రామిక, మహాతలవర, మహాదండనాయక పరిబిదేహాకులజుడు కౌశికగోత్రుడగు శివసేనుడు, సంజయపురయోనరాజులు, అవన్తీశ్వరుడగు శకరుద్రదాముడు, వనవాసక విష్ణురుద్రశివలనంద శాతకర్ణి మున్నగు రాజులు పేర్కొనబడిరి.

1. నమో భగవతో దేవ పరమదేవస్య పురాణపురుషస్య నారాయణస్య రాజ్ఞో వాసిష్ఠీపుత్రస్య అభీరస్య వసుసేనస్య సంవత్సరే 9...

2. మహాగ్రామికేన మహాతలవరేణ మహాదండనాయకేన కౌశిక గోత్రేణ పరిబిదేహానాం శివసేనేన సంజయపురితో యోనరాజభిః.

3. అవన్తికేన శకేన రుద్రదామ్నా వనవాసకస్య విష్ణురుద్రశివలనంద శాతకర్ణినా...అష్టభుజస్వామి.

4. అభ్యుత్య స్థాపితా—

ఇందు పేర్కొనబడిన అభీరవసుసేనుడు స్వతంత్రరాజుగా చెప్పబడుటచేతను దీని లిపి పల్లవుల శాసనలిపికంటె ప్రాచీనమైనదియు సరిగా ఇక్ష్వాకుల శాసనలిపినే పోలియుండుటచేతను, మరియు ఈ శిలాఫలకము అష్టభుజస్వామి విగ్రహము మున్నగు శిథిలములు ఇక్ష్వాక శిథిలములతో కన్పట్టుటనుబట్టియు ఇక్ష్వాకు లాతనిచే జయింపబడిరనుట నిస్సందేహము. నాటినుండి ఇక్ష్వాకు లాభీరునకు సామంతులైరో లేక మరల అతని దండయాత్రానంతరము స్వతంత్రించిరో తెలియదు. ఈ అభీరవసుసేను డెక్కడనుండి దండెత్తివచ్చెనన్నది ప్రశ్న. బొంబాయిరాష్ట్రములోని నాసిక కొండలలో అభీర ఈశ్వర

శివుని శాసన మొకటి కలదు. దానినిబట్టి వారా ప్రాంతమును పాలించుచుండినట్లు తెలియుచున్నది. ఈ ఆభీరవసుసేనుడు బహుశః అవాసిక ప్రాంతమునకు చెందిన ఈశ్వరసేనుని సంతతివాడు కావచ్చును. ఈ శాసనములో వానిని సమకాలికులు బహుశః అతనిచే జయించబడిన రాజులు కొందరు పేర్కొనబడిరి. మొదట మహాగ్రామిక, మహాతలవర మహాదండనాయక శివవిసుడు కలడు. ఇతడు కౌశికగోత్రజుడు, పరిబి దివాకులజుడుగ వర్ణించబడెను. బహుశః ఇతడు ఇక్ష్వాకుల సామంతుడగు ఆంధ్రరాజేమో యనిపించుచున్నది. రెండు: సంజయపుర యవనరాజులు. వీరు కూడ ఇతని మిత్రులని చెప్పుటకు వీలుగాకున్నది. మూడవవాడు అతనీశ్వరుడైన శక రుద్రదాముడు. ఇతడు పశ్చిమదేశపు మహాక్షత్రపస్వామి రుద్రసేనుని తండ్రియగు రెండవ రుద్రదాముడు. ఇంతవరకు కీతని కుమారుని శాసనములను బట్టియే తెలియును గాని నిజముగ నీతడు పాలించినట్లు తెలియదు. ప్రస్తుత శాసనముబట్టి ఇత పెన స్త్రీ నగరము రాజధానిగా పాలించినట్లు ఆభీరవసుసేనుని సమకాలికుడైనట్లు నిర్ధారణ చేయవచ్చును. పశ్చిమదేశపు మహాక్షత్రపులకు ఇక్ష్వాక రాజులకు వివాహ సంబంధములు గలవని పైన వివరించబడినది. నాల్గవవాడు వనవాసక విష్ణురుద్ర శివలానంద శాతకర్ణి. ప్రస్తుతము మైసూరురాష్ట్రములోని బనవాసియే అది. కదంబులకు పూర్వ మిచ్చట శాతకర్ణులు పాలించుచుండిరి. ఈ వనవాసరాజుకు ఇక్ష్వాకులకు కూడ సంబంధము గలదు. ఏహువల శాంతమూలుని పౌత్రి కొడబలిసిరి వనవాసక మహారాజు భార్య. బహుశః ఆభీర వసుసేనుడు ఇక్ష్వాకులపై దండెత్తివచ్చినపుడు తమతమ సంబంధములను పురస్కరించుకొని శక రుద్రదాముడు, వనవాసి శాతకర్ణి మున్నగువా రతని నెదిర్చి యుండవలెను. కాని అతనిధాటి కాగలేక యందఱు నోడిపోయి యుందురు. ఈ ఆభీరుని దిగ్విజయము సముద్రగుప్తుని దక్షిణదేశ దిగ్విజయమును పోలియున్నది.

గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని మంచికల్లువద్ద పల్లవ సింహవర్మ శాసన మొకటి దొరికినది. దీని లిపి పైన చెప్పిన ఇక్ష్వాక, ఆభీరశాసన లిపుల తర్వాతిది. మైదవోలు, హిరహడగల్లి శాసన లిపులకంటె ప్రాచీనమైనది. ఇంతవరకు లభ్యమైన పల్లవ శాసనము లన్నింటిలోను ఇదియే మొదటిదని చెప్పవచ్చును. భారద్వాజకులజుడైన పల్లవ సింహవర్మ ధర్మబల వృద్ధిక్షేమము చేయబడిన శాన్తి స్వస్త్యయనోత్సవసమయమున భగవంతుడైన శివస్వామి తీర్థవాసులకు దుకూలాదిదానములు చేసిన గదు. దీని భాష ప్రాకృతము.

1. "సిద్ధం. భారదాయస గోత్తేన...ధరేణ పల్లవాణం సీహ
2. వంమ్మేణ అప్పణో విజయికే ధంమ్మబల వర్ధనికే సాన్తిసత్థి
3. యాయణం కాతూణ భగవతో సిరి జీవశివసామి పతీథికా
4. నకు ర్తికోపహారకాదికారం"—

మైదవోలు, హిరహడగల్లి తామ్రశాసనములలోని శివస్కందవర్మకంటె నీతడు పూర్వుడు. ఈ రెండు శాసనములలోను శివస్కందవర్మ తన తండ్రిపేరు చెప్పుకొనలేదు కాని ధాన్యకటకము రాజధానిగాగల ఆంధ్రపథమంతయు పల్లవరాజ్యముక్రింద నున్నదని చెప్పబడెను. సరిగా అదేస్థలమున ఈ సింహవర్మ శాసనము దొరకుట, లిపి, భాషకూడ పై రెండు శాసనములకు దగ్గరలో నుండుటబట్టి ఇతడే శివస్కందవర్మ తండ్రి కావచ్చునని ఊహించుటకు అవకాశమున్నది. పల్లవులు తమ శాసనములలో "కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణ నిత్యసన్నద్ధ"—అని చెప్పుకొనుటనుబట్టి ఇక్ష్వాక రాజులు బౌద్ధమతము నాదరించుట చూచి పల్లవసింహవర్మ వైదిక మత పునరుద్ధరణ మను నెపమున ఇక్ష్వాకరాజధానిపై దండెత్తి యుండును. ఆభీర వసుసేనుని దండయాత్రతో ఇక్ష్వాకరాజ్యము కూడ బలహీనమైనది. ఆ సమయమును పల్లవసింహవర్మ సద్వినియోగము చేసికొని ఇక్ష్వాకులను పూర్తిగ రూపుమాపి వారి ఏలుబడి క్రిందగల ఆంధ్రపథమంతను కాంచీపురపల్లవరాజ్యమున చేర్చి యుండును.

శ్రీకాకుళముజిల్లా పెద్దదూగాములో నొక తామ్రశాసనము లభ్యమైనది. ఇందలి లిపి సుమారు 5 వ శతాబ్దమునాటిది. సింహపురము (సింగుపురము) నుండి మహారాజ శత్రుదమనునిచే గిరికలింగ వంమానాగ్రహారమున మూడు గ్రామములు పట్టువ గ్రామవాస్తవ్యులు, తైత్తిరీయ శాఖకు చెందినట్టి కౌండిన్య గోత్రజులైన సర్వశర్మ, విష్ణుశర్మలకు దానమీయబడినది. ఈ శాసనమునుండి మొట్టమొదటిసారిగ సింహపురమునుండి శత్రుదమన మహారాజు పాలించుచుండినట్లు తెలియవచ్చినది. ఈ సింగుపుర మొకప్పుడు మధ్య కళింగమునకంతకు ముఖ్యపట్టణము. ప్రాయికముగ నా కాలమున నీ ప్రాంతమును పాలించిన రాజులందఱు తాము స్వతంత్రులమనియే చెప్పుకొనుచుండిరి. కాని ఈ శాసనములో శత్రుదమనుడు "భట్టారక పాద పరిగృహీతః"—అని వర్ణించబడెను. దీనినిబట్టి అతని సామంతత్వము వెల్లడి యగుచున్నది. ఆ సార్వభౌముని పేరందు పేర్కొనబడలేదు. ఆ కాలమున ఆ ప్రాంతపురాజులకు గుప్తరాజులు సార్వభౌములు. తన సార్వభౌముని పేర్కొనకుండుట, గుప్తరాజ్య కాలములో గాక స్వరాజ్యకాలమున దానము చెల్లుట బట్టి శత్రుదమనుడు క్రమముగ స్వతంత్రించుటకు ప్రయత్నించుచుండెనట్లగపడుచున్నది. సముద్రగుప్తుని అలహాబాదు విజయస్తంభములో ఎరండపల్లి దమనుడొక్కడు ఆ ప్రాంతమునుండి పేర్కొనబడెను. ఎరండపల్లి దమనుడు, సింహపురశత్రుదమనుడు నొక్కరే యనుట కాధారములులేవు. మరియు సింహపురము నాల్గవ శతాబ్దానంతరము ప్రసిద్ధిచెందినది. కావున ఈ శత్రుదమనుడు సుమారు 5 వ శతాబ్ద ప్రాంతమున సింహపురమునుండి పాలించిన వేరొకరాజై యుండును.

గుంటూరుజిల్లానుండి విష్ణుకుండినవంశజుని తామ్రశాసన మొకటి లభ్యమైనది. ఏకాదశాశ్వమేధములు చేసిన మహారాజ మాధవవర్మ సంతతివాడగు విష్ణుకుండిన విక్రమేంద్ర భట్టారకుడు తన 14 వ రాజ్యకాలమున ఆకివాస్తవ్యుడు, ఆపస్తంబసూత్రుడు కౌండిన్యగోత్రజుడైన స్వామి శర్మకు తూష్టి గ్రామమును దానమిచ్చెను. ఈ వంశజుల తామ్రశాసనము లింతవరకు రెండు మాత్రమే దొరికినవి.

నెల్లూరుజిల్లా పొదిలి తాలూకాలోని కురవాయపాలెములో పల్లవ తామ్రశాసన మొకటి గలదు. పల్లవ ప్రథమ పరమేశ్వరవర్మ భూమిరాష్ట్రములో మునుకానది దక్షిణ తీరమున గల కుబుమారు గ్రామమును ఉత్తరాయణ సంక్రాంతి పుణ్యకాలమున ఉర్వ

టూరు గ్రామ వాస్తవ్యుడు, మౌద్గల్యగోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు, వేదవేదాంగవిశారదుడునగు స్వామిశర్మపౌత్రుడు, ద్రోణశర్మ పుత్రుడునగు దేవశర్మకు అగ్రహారముగ నిచ్చెను. దీని కాలము అతని 19 వ రాజ్య వర్షమున పౌష శుద్ధ త్రయోదశి భానువారము. ఇంతవఱ కుపలబ్ధమైన పరమేశ్వరవర్మశాసనములలో కాలమును తెల్పునది యొక్కటియే. ఇందు గల తిథివారములు సరిగా క్రీ. శ. 687 డిశంబరు 22 న సరిపోవును. ఇది అతని 19 వ రాజ్య వర్షముగాన అతడు క్రీ. శ. 669-70 లో సింహాసన మధిష్ఠించి యుండవలెను.

మైసూరురాష్ట్రములోని చిత్రదుర్గజిల్లా గంజగట్టి గ్రామ వాస్తవ్యునివద్ద చాళుక్య అభినవాదిత్యుని తామ్రశాసన మొకటి గలదు. రెండవపులకేశి పౌత్రుడు, ఆదిత్యవర్మ పుత్రుడునగు అభినవాదిత్యుడు భాద్రపద పౌర్ణమినాడు ఉచ్ఛశృంగ విషయము (బళ్లారి జిల్లా ఉచ్చంగిదుర్గ)లోని సెల్కుండ గ్రామమును దేవరాతి కౌశిక గోత్రజుడగు విష్ణుశర్మకు దానమిచ్చెను. క్రీ. శ. 642 లో రెండవ పులకేశి మరణానంతరము చాళుక్యసామ్రాజ్య మరాజకమైనది. అతని పుత్రులెవ్వరికి తమ శత్రువగు పల్లవు నెదిరించ శక్తిసామర్థ్యములు లేక వేర్వేరు రాష్ట్రములనుండి పాలించుచుండిరి. వారిలో జ్యేష్ఠుడగు ఆదిత్యవర్మ కర్నూలు ప్రాంతమును పాలించుచుండెను. ప్రస్తుత శాసనములోని అభినవాదిత్యు డాతని పుత్రుడే. దీనినిబట్టి బళ్లారి, చిత్రదుర్గ జిల్లాలు కూడ అతని ఏలుబడిక్రింద గలవని తెలియుచున్నది. అభినవాదిత్యుని శాసన మింతవఱకు లభ్యమైన దిది యొక్కటియే. దీని కాలము క్రీ. శ. 650 ప్రాంతము. క్రీ. శ. 655 లో విక్రమాదిత్యుడు మరల చాళుక్య సామ్రాజ్యమును స్థాపించుటతో వీరందఱు అనామకులైరి.

ఈ విక్రమాదిత్యుని తామ్రశాసన మొకటి మహబూబ్ నగర జిల్లా ఆలంపూరు సమీపములోని అముదాలపాడులో దొరకినది. మహారాజాధిరాజ పరమేశ్వర విక్రమాదిత్య సత్యాశ్రయ పృథివీవల్లభ మహారాజు తన 5 వ రాజ్యకాలమున (క్రీ. శ. 660) వైశాఖ పౌర్ణమినాడు శివమండలదీక్షా సమయమున వంగూరవాడి విషయములోని ఈ పట్టంకలు అను గ్రామము సుదర్శనాచార్యులకు గురుదక్షిణగా నొసంగెను. ఆ గ్రామమును 27 గురు బ్రాహ్మణులకు పంచియిచ్చెను. విక్రమాదిత్యుని పితృపితామహులందఱు పరమ భాగవతులని, విష్ణ్వాలయములకు దానము లొసంగిరని శాసనములబట్టి తెలియుచుండ ఈతడు శైవాచార్యులవద్ద శివమండలదీక్షను పొంది పరమ మాహేశ్వరుడని వర్ణించబడుట మిక్కిలి ఆశ్చర్యము. విక్రమాదిత్యుని సామంతుడగు శ్రీయాశ్రయ శీలాదిత్యుని నౌసరీ తామ్రశాసనములో నీతడు పరమ మాహేశ్వరుడనియు శ్రీ నాగవర్ధనుని పాదయుగ మర్చించువాడనియు గలదు. ఈతని చేతనే తలమంచి శాసనములో వాసిష్ఠగోత్రుడగు మేఘాచార్యులు వ్యక్తిగ గురువుగా పేర్కొనెను. ఈ రెండు శాసనములు ప్రస్తుత శాసనమునకు తర్వాతవి, మరియు ఈ శాసన ప్రతిగ్రహీతలలో నాగవర్ధన మేఘాచార్యులు కానరారు. కావున సుదర్శనాచార్యుల తర్వాత విక్రమాదిత్యునకు వారు గురువులనిగాని లేదా ఈతని దీక్షాగురువు,

నాగ శిష్యాంగనలని యైన చెప్పవచ్చును. ఈ శివమండల దీక్ష యీ ప్రాంతమున విస్తరిల్లినట్లు కన్పించుచున్నది. అట్లైన వీర శైవము బసవునకు పూర్వము చాలకాలమునుండియే కర్ణాటకమున నుండి ఆనాటి కాలమున విజృంభించి యుండవలెను.

అదే తాలూకా వల్లెపాడులో వినయాదిత్యుని తామ్రశాసనము కూడ లభ్యమైనది. దీని కాలము శకవర్షములు 604 వైశాఖ పౌర్ణమి. అతని రెండవ రాజ్యకాలమని చెప్పబడినది. ఇది క్రీ. శ. 682 ఏప్రిల్ 27 వకు సరిపోవును. ఇది అతని రెండవ రాజ్యవర్షము గాన అతడు క్రీ. శ. 680 లో రాజ్యమునకు వచ్చెనని నిర్ధారణ చేయ్యగలము. స్వామికరాజు కోరికచే మానవస్వామి యను బ్రాహ్మణునకు కృష్ణానది దక్షిణపు టొడ్డునగల పణిసాలు గ్రామము దానమీయబడినది. అనంతపురం, కర్నూలుజిల్లాలలో ఈ చాళుక్యుల శిలాశాసనములు తెలుగుభాషలో గలవి చాల దొరికినవి. వీటి నన్నింటిని చక్కగా పరిష్కరించి ప్రకటించిన ఆంధ్రవాఙ్మయ చరిత్రను మిక్కిలి యుపకరించును.

కర్నూలుజిల్లా సత్యాల నాగేశ్వరస్వామి ఆలయములో ఎనిమిదవ శతాబ్దమునకు చెందిన ప్రాచీన శిలాశాసన మొకటిగలదు. అందు సరియనూరు తక్కేశ్వరునకు మున్నూర్వ మహాజనులచే ఇరువది మత్తరు భూమి దాన మీయబడినదని గలదు. సాంకృత్య గోత్రుడైన నాగచండస్వామి తిప్పన పేరుచే ఆలయము కట్టబడినది. దానికి కపిలమనిమని కూడ పేరు. మాచెర్ల, గురజాలలోని నాగుల శాసనములకంటె నిది ప్రాచీనమగుటచే ఆంధ్రదేశమున ఎనిమిదవ శతాబ్దమునుండి నాగులపూజ గలదనుటకిది యొక తార్కాణము.

కర్నూలుజిల్లా నాయకల్లులో శకవర్షములు 889 ప్రభవ సూర్యగ్రహణము (క్రీ. శ. 967) నాటి అకాలవర్ష పృథివీవల్లభుని శాసనమొకటి దొరకినది. ఈతడు మాల్ఖేడ్ శాఖకు చెందిన రాష్ట్రకూట తృతీయ కృష్ణరాజు. దీనికాలమునుబట్టి ఈతని రాజ్యకాలము మరికొన్ని మాసములు పొడిగించవచ్చును. దీనిలో మహాసామంత నన్ని చళుక్కి రాచమల్లు డొకడు పేర్కొనబడెను. ఈతడు చాళుక్య ప్రభువు కావచ్చును.

రాయచూరుజిల్లా లింగసుగూర్ తాలూకాలోని బన్ని గోళలో శకవర్షములు 947 (క్రీ. శ 1025) నాటి శాసన మొకటి దానిలో త్రైలోక్యమల్ల విజయాదిత్యుడు మోరగనూరు ప్రాంతమును పాలించుచున్నట్లు గలదు. ఆకాలమున పశ్చిమ చాళుక్య రాజులలో విజయాదిత్య నామధారు లెవ్వరును లేరు. మరియు జగదేకమల్ల బిరుదాంచితుడగు రెండవ జయసింహుడా ప్రాంతమునకు సార్వభౌముడు. ఈ సందర్భమున నొక విషయము జ్ఞప్తికి వచ్చుచున్నది. పూర్వ చాళుక్యరాజగు విమలాదిత్యుని పుత్రులు రాజరాజ, విజయాదిత్యులు వేంగి సింహాసనమునకై యొండొరులు పోరాడుచుండిన రోజులవి. రాజరాజు తన మేనమామయగు రాజేంద్రచోళుని, విజయాదిత్యుడు పశ్చిమ చాళుక్య ప్రభువగు జయసింహుని ఆశ్రయించిరి. ముసంగి (మాస్కి)వద్ద చోళ చాళుక్యులకు ఘోరయుద్ధము జరిగినది. జయసింహుడు పూర్తిగ యోడిపోయెను. ఇక విజయాదిత్యునకు వేంగిదేశమున నిలువతావు లేక పశ్చిమ చాళుక్య ప్రభువగు జయసింహుని ప్రాపున మహా మండలేశ్వరుడుగా లింగసుగూర్ ప్రాంతమును పాలించుచుండవచ్చును. అందుకే త్రైలోక్యమల్ల బిరుదమునుగూడ ధరించెనేమో!

విశాఖపట్నము జిల్లా సర్వసిద్ధి తాలూకాలోని మడుతూరు భీమేశ్వరాలయమున నొక శిలాశాసనము గలదు. సెట్టి కొంతమండి చోడేశ్వరాలయమును నిర్మించి అందు చోడేశ్వరుని ప్రతిష్ఠించి ఆ దేవుని అంగరంగభోగములకు కొంతభూమిని దానమిచ్చిరని గలదు. దీని కాలము అనంతవర్మ రాజరాజదేవుని మొదటి రాజ్యపాలన వర్షమగు శక సంవత్సరములు 1119 [illegible] శుద్ధ ఏకాదశి మంగళవారము. అనగా క్రీ. శ. 1197 సెప్టెంబరు 23. ఈతడు తూర్పుగాంగ వంశజులలో అనంతవర్మాభిధేయులలో మూడవవాడు. శ్రీకూర్మములో ఈతని 11 వ రాజ్యకాలమున శకవర్షములు 1129 కుంభ బ. 2 శుక్రవారమునకు సరియగు క్రీ శ. 1207 ఫిబ్రవరి 6 వ మరియొక శాసనముగలదు. ఈ రెండు శాసనములనుబట్టి ఈతడు క్రీ. శ. 1196 సెప్టెంబరు 23, క్రీ. శ. 1197 ఫిబ్రవరి 6 తేదిలమధ్య సింహాసన మధిష్ఠించి యుండవలెనని నిశ్చయించగలము. ఈ తూర్పుగాంగవంశజుల శిలాశాసనములు, అనేక తామ్రశాసనములు గూడ శ్రీకాకుళము జిల్లానుండి బయల్పడినవి కాని వాటి నన్నింటిని తడవుట కిచ్చట తావు చాలదు.

పశ్చిమగోదావరిజిల్లా నర్సాపూరులోని మదనగోపాలస్వామి ఆలయావరణములో నాల్గు చాళుక్యశాసనములు బయల్పడినవి. అందొకటి సర్వలోకాశ్రయ విష్ణువర్ధన వీరభద్రేశ్వర చక్రవర్తి 16 వ రాజ్యకాలమున గలదు. పాలకొల్లు, జుత్తిగ శాసనములబట్టి చాళుక్య వీరభద్రుడొకడు ఇందుశేఖర సదయాంబల పుత్రుడుగను, కాకతి రుద్రాంబ భర్తయని తెలియుచున్నది. పాలకొల్లు శాసనములో అతనికి అన్నమాంబయని వేరొక భార్య యుండినట్లు గలదు. ప్రస్తుత శాసనములోని విష్ణువర్ధన వీరభద్రేశ్వర చక్రవర్తి ఈతడే యగుచో, ఈతడనుము పదిహేను సంవత్సరములు రాజ్యము పాలించినట్లును చెప్పవచ్చును.

నాగార్జునకొండ కెదురుగా కృష్ణానది కావలియొడ్డునగల రామేశ్వరమునద్ద శిథిలములను ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ఆధ్వర్యమున త్రవ్వుచుండగా కొన్ని ఆయక స్తంభములు, వానిపై శాసనములు బయల్పడినవి. ఇవి ఇక్ష్వాకరాజుల శాసనముల తర్వాతివి. చాళుక్య లిపిలో రణవిక్రమ, రణమర్దన, రణమల్లన, గుణభిరణ్ణు మున్నగు బిరుదములు కొన్ని, రేవణమంచి, నందిమంచి, సింగమంచి యను కొందఱి పేర్లు గలవు. పదియవ శతాబ్దమునకు చెందిన గౌడీయ లిపిలో నొక చిన్న శాసనము గలదు. వరేంద్రవిషయాధీశ్వరుడగు ఉగ్గవల శూనురాజ పుత్రుని పేర్కొనుచున్నది. వరేంద్రవిషయ మనగా ఇప్పటియుత్తర బెంగాల్ ప్రాంతము. దీనినిబట్టి పదియవ శతాబ్దములో ఆంధ్రదేశములోని ఏలేశ్వరమునకంతదూరమునుండి తీర్థయాత్రికులు వచ్చుచుండుట గమనించదగినది. అచ్చటనే శివాలయమునకు దగ్గరలో చక్కని రెండు శిలాఫలకములపై సుమారిరువది శాసనములు వేర్వేరు కాలములకు, వేర్వేరు రాజులకు చెందినవి పౌర్వాపర్యక్రమములేక వరుసగా చెక్కబడియున్నవి. అందు కందుకూరి గోకర్ణదేవ చోడమహారాజ, భీమదేవ చోడమహారాజులవి, కాకతి గణపతిదేవ రుద్రదేవులవి, యాదవ సింగనవి, పల్నాటి హైహయవంశజుడైన

అనుగు గామరాజాది, వెలూరి మనుమసిద్ధిరాజాది, ఇంకను నూరి కొంతమంది శాసనములు గలవు. ప్రస్తుత మివి యన్నియు నగునగా ఈ శిలాఫలకములపై వ్రాసియుండుటబట్టి పూర్వమవి వేర్వేరు శిలలపై చెక్కియుండి ఏ ప్రమాదమునకో గురియగు సమయమున బుద్ధిమంతులగు మన పూర్వులు వాటిని నకలుగా ఈ రెండు శిలా ఫలకములపై చెక్కించి భద్రపరచినట్లున్నది. శాసనముల ప్రాముఖ్యమును మన పూర్వులెట్లు గ్రహించి శ్రద్ధవహించుచుండిరో తెలిసికొనుట కిది చక్కని తార్కాణము. ప్రస్తుతకాలమున అట్టి అందమైన శాసన శిలయే గాన్పించిన పరు లెఱుగకుండ గృహనిర్మాణమునకై దానిని వినియోగించి సంతసించెదరు.

పూర్వపు హైదరాబాదు రాజ్యమున రాష్ట్రకూటుల మాన్యఖేటము, చాళుక్యకలచుర్యుల కల్యాణి నగరము, యాదవుల దేవగిరి, కాకతీయుల యోరుగల్లు మున్నగు రాజధానులందు గలిగియున్నవి. మన తెలంగాణా ప్రాంతము శాసనములకు గనియేయని చెప్పవచ్చును. గత సంవత్సరము నూతన శాసనములకై వరంగల్లు ప్రాంతమున పర్యటించుచుండ, చక్కని సంస్కృతకావ్య మొక కొండకు చెక్కబడినది కాన్పించినది. కావ్యమంతయు 62 శార్దూల విక్రీడితములలో సిద్ధదంపతుల చరితము వర్ణించబడియుండెను. చక్కని సాయంసమయమున సరసీప్రాంతమునకు చెలికత్తెలతో వచ్చిన యువతి నొకతెను సిద్ధయువకుడు జూచును. ఇరువురును పరస్పరానురాగము గలవారగుదురు. ఇంతలో బాలుడొకడామెను పిలుచుకొని అంతఃపురమున కేగును. తరువాత విప్రలంభము, సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలు. చెలికత్తె యొకతె అతనికడ కరుదెంచి ఆమె విరహమును దెల్పి అతని నెట్లైనను రహస్యముగ నంతఃపురము చేరుమని ప్రార్థించును. గాఢాంధకారములో నాతడు కోటగోడ నొక త్రాటిచే దాటుచుండగా రాజభటులచే దొంగయని పట్టుకొనబడి కారాగారమునందుంచబడును. చెలికత్తె లీ విషయమంతయు నామె తండ్రియగు కనకాంగదున కెఱింగింప అతని కులగోత్రములు తెలిసి మిక్కిలి సంతసించి వారి వివాహమున కాతడంగీకరించును. తరువాత వివాహము, సంభోగశృంగార వర్ణనములతో కావ్యము ముగియును. కావ్యాంతమున "నరసింహ బుధేశ కృతి"—యనుటను బట్టి దీనికర్త నరసింహుడని తెలియుచున్నది. అదే కొండకు మరియొక ప్రక్క నాగరిలిపిలో వేరొక శాసనముగలదు. అందు "ఇతి రాజగురు విశ్వేశ్వర దుహితృ సూనో నరసింహమహాకవేః కృతౌ"— అనియుండుటచే ఈ రెండు శాసన గ్రంథములకర్త యొక్కడే యనియు నాతడు రాజగురువైన విశ్వేశ్వరపండితుని దౌహిత్రుడనియు స్పష్టమగుచున్నది. రాజగురు విశ్వేశ్వరపండితులు కాకతి గణపతిదేవుని దీక్షాగురువగు సుప్రసిద్ధ విశ్వేశ్వర శంభువే. వరంగలుకోటలోని చిన్నది వాల్లు శాసనములలో నొక నృసింహ లేక నరసింహ కవి పేర్కొనబడెను. వానినిబట్టి ఆతడు కాకతి రుద్ర ప్రతాపరుద్రుని కాలము (క్రీ. శ. 1291–1323) వాడనియు, ఋగ్వేద వ్యాఖ్య, కాకతీయ చరిత్ర, మలయవతియను గద్య కావ్యము, అనేక రూపకములు రచించినట్లు తెలియుచున్నది. కాదంబరి నాటక కర్తయగు నృసింహుడితడు ప్రతాపరుద్రుని కాలమున గలడు. పైన చెప్పిన నృసింహులందఱు నొక్కడే యనియు నాతడు రుద్రప్రతాపరుద్రుని ఆస్థానమున సుప్రసిద్ధ విద్యానాథుని సమకాలికుడనియు నా యభిప్రాయము. ఈతని శైలి చూపుటకు రెండు శ్లోకములు మాత్ర మిచ్చట ఉదాహరించెదను.

సార్ధం చేతనయా సమస్తజగతా మస్తం గతో భానునా
వ్యామోహేన సమం తమాంసి పరితః కాష్ఠాః పదం చక్రిరే,
నామైః కాముకలోచనై స్సహ తత స్తారాగణాః ప్రస్ఫురః
కందర్పోజ్జ్వలదీప ఏష ముదయం యాతః కలానాం నిధిః.

2. తిష్ఠ త్యుత్పలతి ప్రయాతి పునర ప్యాయాతి సంభాషతే
తూష్ణీంభావ ముపైతి పశ్యతి దిశః సమ్మీలయ త్యక్షిణీ,
ఉద్బాష్పీభవ త్యధికం దదాతి చ స్మృతిం విశ్వసతే చేష్టతే
హా కష్టం మన సైవ దారుణ తరం కింకిం నవా కార్యతే.

కథ ఎంత రమణీయముగ నున్నదో ఈతని వర్ణనలు అట్టె గలవు. ఇట్టి కావ్యమును చక్కగా పరిష్కరించి లోకమున కర్పించు భారము ఆంధ్రులమగు మనపై నున్నది.

గుంటూరుజిల్లా కనపర్తి సీతారామస్వామి ఆలయ స్తంభమున కొక శాసనముగలదు. పూర్వము రాయలవారిచే కనపర్తిలో చేయబడిన దానమును మహామండలేశ్వర సంబెట అలగండల నూంకయ దేవచోడమహారాజపుత్రుడు వీర బొబ్బిలి దేవచోడ మహారాజుచే వీరదేవరాయమహారాజు ఆతనిభార్య దేమ అమ్మంగారు, యువరాజు విజయబుక్క రాయలకు పుణ్యముగా పునరుద్ధరించబడినది. దీనికాలము శకవర్షము 1348 పరాభవ మాఘశుద్ధ ఏకాదశి గురువారమునకు సరియగు క్రీ॥ శ॥ 1427 జనవరి 9. చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకా, కర్ణపల్లెలోని శాసన మొకదానిలో శకవర్షములు 1332 (క్రీ॥ శ॥ 1410) నాటి సమ్మటి (సంబెట) వీరబొబ్బిలి దేవ మహారాజు విజయరాయ ఉడయర్ కాలమున పేర్కొనబడెను. దంతేపల్లి తామ్రశాసనమునుబట్టి యీ విజయభూపతి సూర్యవంశోద్భవుడైన మాకభూపాలుని దౌహిత్రుడుగను దేమాంబికా పుత్రుడుగను తెలియుచున్నది ప్రస్తుతశాసనములో చెప్పబడినట్లు ఈతని పూర్తిపేరు విజయబుక్కరాజనియు, దంతేపల్లి తామ్రశాసనములోని మాకభూపాలుడు ఇందులోని నూంకయ దేవచోడ మహారాజు నొక్కరేయనియు స్పష్టము. అతని కుమార్తె దేమాంబిక విజయనగరరాజుల భార్యగుటచే సంబెటప్రభువులకు విజయనగర రాజులకు గల సంబంధము వ్యక్తము.

గోదావరి వరదలలో రాజమహేంద్రవరమువద్ద మాన్యగంటి గజపతులవి రెండు తామ్రశాసనములు బయల్పడినవి. అవి గజపతి కపిలేశ్వరుని పక్షమున ఆప్రాంతమును పాలించుచుండిన రఘుదేవ నరేంద్రునివి. ఆంధ్రదేశమును కొంతకాలము పాలించిన గజపతుల చరిత్రకివి చాల ముఖ్యము. మహాబలపరాక్రమవంతుడు, గంగానది మొదలు శ్రీరంగమువఱకు గల దేశమునకంతకు సార్వభౌముడగు కపిలేశ్వర గజపతి తండ్రి తాత లెవ్వరో తెలియక అతడొక సామాన్యుడగు గొల్లపిల వాడనియు, పూరి జగన్నాథుని కృపవలన నాతనికి రాజయోగము పట్టినదనియు నిక్కడక్కడి పురాణము లింతవఱకు కల్పించబడినవి. ఈ రెండుశాసనములబట్టి ఆతని పితృపితామహులు జాగేశ్వర, కపిలేశ్వరు, వాదగులగు బలరామ, [illegible] నామధేయులందరు మహాబలపరాక్రమవంతులు విజయ ప్రశస్తి [illegible]

డుచు పసువులు గోల్పోయినట్లు తెలియుచున్నది. మరియు ప్రబల శత్రుక్రమములచె గాంగరాజుని త్రోసిపుచ్చి సింహాసనము వశిషించి నట్లు వర్ణించబడెను. ఓరుగల్లు కోటలోగల రఘునాథ నరేంద్రుని శిలాశాసనములో గూడ ఈ వంశవృక్షమే గలదు. ఇందొక తామ్ర శాసనము ఆడువిళ్ళ నరసింహారవిచే చక్కని సంస్కృత శ్లోకములలో గలదు. కపిలేశ్వరుని పుత్రుడగు హంవీరదేవుని యీ తామ్రశాసనము శ్రీకాంత, తిమ్మయార్యులను జంటకవులచే రచించబడినట్లు చెప్పబడెను.

"జీయా దేకైక భాగిభ్యా మహంవీర నృపాజ్ఞయా,
శ్రీకాంత తిమయార్యాభ్యాం రచితం ధర్మశాసనం."

ఆంధ్రదేశమున 15 వ శతాబ్దమునందే జంటకవులు గలరనుట కిది నిదర్శనము కాగలదు.

ఉత్తర హిందూస్థానమున బీహారులోని సుప్రసిద్ధ గయాక్షేత్రమున ఏకశిలానగరపు రాజులవి నాల్గుశాసనములు దొరకినవి. అందు మొదటిది కాకతి ప్రతాపరుద్రుని కాలమునాటిది. అతని గురువగు మల్లికార్జునుని భార్య గౌరియను నామె గయాశ్రాద్ధాదికములు నిర్వర్తించినట్లు గలదు. మల్లికార్జునుడు సుప్రసిద్ధ గోదావరి ప్రాంతమున గల మంత్రకూట నగర (మంథెన) వాస్తవ్యుడుగ చెప్పబడెను. సరిగా మంథెనలోని యొక శాసనములో ఈ మల్లికార్జునుడు, కాకతి మొదటి రుద్రదేవుడు పేర్కొనబడియుండిరి. దీనిని బట్టి కాకతి మొదటి రుద్రునికూడ ప్రతాపరుద్రుడనుటగలదనియు, విశ్వేశ్వర శంభు వెట్లు గణపతి దేవునకు దీక్షాగురువో అట్టే మల్లికార్జునుడు మొదటి రుద్రునకు గురువనియు తెలియుచున్నది. రెండవది హరోసుపళి వీర నారసింహదేవుని పూజారి యొకడు గయావద్ద మఠమును కట్టించి తన ఋణములు తీర్చికొనెనని గలదు. మూడవది విజయనగర శ్రీకృష్ణదేవరాయల తెలుగుశాసనము. అతని ఆస్థానకవీశ్వరుడగు ముక్కు తిమ్మన తన ముద్దులొలుకు పలుకులతో

తిరుమల దేవీ వల్లభ!
కరుణామయ హృదయ! రాజకంఠీరవ! యీ
శ్వర నరసభూపురందర
వరనందన! బాపదప్పరగండాంకా!

అని చక్కని తెలుగుపద్యమును గయలో చెక్కించెను. ప్రసిద్ధమైన ప్రబంధములలోని పద్యము లిట్లు శాసనములలో నుండుట చాల అరుదు. నాల్గవది విజయనగర అచ్యుతరాయలది. తన పితృ, పితామహ, ప్రపితామహులగు నరసింహ, ఈశ్వర, తిమ్మభూపతులను గయాముక్తము సేయుటకు తిమ్మణ్ణ యనువాని పంపెనని గలదు.

శ్రీరంగములోని రంగనాథాలయపు కోట్టు ప్రాకారమునకు తెలుగు శాసనమొకటి గలదు. అందుగల సంస్కృత శ్లోకమున సింగభూపతి ప్రపౌత్రుడు, నాగాధిపుని పౌత్రుడు, మాదనృపతి పుత్రుడునగు శ్రీ వల్లభరాజు (వల్లభ దేవింగారు) చేసిన కొన్ని దానములు వర్ణించబడినవి. ఈతడు దామోదగోత్రజుడనియు, కన్నకంజ, లాటరాయరాహుత మున్నగు బిరుదులుగల్గి గంగాతటమున గాంధారగిరి ప్రాంతమునకు ప్రభువని చెప్పబడెను. ఈతడెవ్వడో ఏదేశస్థుడో కూడ తెలియుటలేదు. రంగనాథాలయమునందే వెండిబంగారపు పల్లకి యొకదానిపై చిన్నశాసనము తెలుగులో చెక్కబడియున్నది. పూర్వము విజయరంగ చొక్కనాథునిచే దానమీయబడి ప్రస్తుతము శిథిలముకాగా శకవర్షములు 1735 శ్రీముఖ కార్తికశుద్ధ ఏకాదశి భృగువారము (క్రీ. శ. 1813 నవంబరు 4)న ఆ జిల్లా కలెక్టరు జార్జి ఫ్రాన్సిస్ ప్రేవర్స్ అనువానిచే అది మరల బాగుచేయబడినది. ఆంగ్లేయులకు హిందూదేవాలయములందును, వారి దానధర్మములందును గల భక్తిశ్రద్ధల కిదియొక తార్కాణము.

స్థాలీపులాక న్యాయమున ఏవో కొన్నిశాసనములు మాత్రమే ఇచ్చట వివరించబడినవి. మన తెలుగు శాసనసంపుటములనుగూర్చి రెండుమాటలు మనవి చేయుట అప్రస్తుతము కాదు. ఇప్పటికి 12 సంవత్సరముల క్రిందట 1948 లో కళాప్రపూర్ణ శ్రీ జయంతి రామయ్య పంతులుగారి ఆధ్వర్యమున తెలుగుశాసన సంపుటమొకటి వెలువడినది. అందు శాసన పరిశోధనశాఖ వారిచేత 1904 నుండి 1928 వరకు సంగ్రహించబడిన తెలుగు శాసనములు మొత్తము 161 గలవు. విజయనగరరాజుల శాసనములుమాత్ర మందు చేర్చబడలేదు. అదే సంవత్సరములోగల విజయనగర రాజుల శాసనములను సుమారు మూడేండ్ల క్రిందట పరిష్కరించి ప్రత్యేకసంపుటముగా సిద్ధము చేసి ఆంధ్రప్రభుత్వమును దానిని ప్రకటించుట కభ్యర్థించగా వారి వద్దనుండి యెట్టి సమాధానములేదు. మద్రాసు, మైసూరు ప్రభుత్వములు వారి వారి తమిళ కన్నడ శాసన సంపుటములను ప్రకటించుట కంగీకరించి అచ్చువేయుచుండెను. గత్యంతరములేక తెలుగు శాసన సంపుటము గూడ మద్రాసుప్రభుత్వమునకే ప్రకటించుట కివ్వబడినది. కాని ఇంకను అది ప్రారంభించబడలేదు. ఆంధ్రదేశ రాజకీయ, సాంఘిక వాఙ్మయ చరిత్ర పూర్తిగ తెలియవలెనన్న గత తెలుగు శాసన సంపుటములు త్వరలో ప్రకటించబడవలయును. ఇతరరాష్ట్రప్రభుత్వములవలె ఆంధ్రప్రభుత్వము తెలుగు శాసన సంపుటములను ప్రకటించవలసినదిగా అభ్యర్థించుచు నాకీ అవకాశము కల్పించిన ఆంధ్రపత్రిక సంపాదకులకు కృతజ్ఞతాపూర్వక వందనములతో దీనిని ముగించుచున్నాము.

"తమసో మా జ్యోతిర్గమయ"

# త్రిశంకుఁడు

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

[ త్రీణి, పితుః కోపః - వసిష్ఠ ధేనోర్వధః - వృథా గోమాంస భక్షణం చేతి శంకుని శంకుతుల్యాని పాపాని యస్య - సః త్రిశంకుః — అని మహాభారతము. ]

"పరదార వ్యవహారము - గుర్వాజ్ఞోల్లంఘనము - నిషిద్ధవస్తు భోజనము" — ఈ మూఁడు శంకులు - అనగా మేకులు - అనఁగా 'దోష'ములు కలిగినందువలన ఆ రాజునకు త్రిశంకుడని పేరు వచ్చినదట. పూర్వ పుణ్యమువలన తుదకీ దోషములనుండి బయటపడి సింహాసనమునకు వచ్చి సర్వ ప్రజారంజనముగ రాజ్యమేలెను. అతని బిడ్డయే మన మెఱిఁగిన హరిశ్చంద్రుడు.

పురుకుత్సుం డను వాని వంగడములోఁ బుట్టెన్ మహా శూరుఁ డొ
క్కరుఁ డవ్వాఁ డరుణుండు నాఁ బరఁగి లోకం బెల్ల నగ్గింప ని
ద్ధర సౌఖ్యంబుగ నేలుచుండెను మహైశ్వర్యంబుతో వాని క
వ్వారు కానేరరు సాటి - వాని గుణముల్ వర్ణింతు రవ్వారిగా.

అతనికి లేక లేక యొక యర్భకుఁ డుద్భవ మొందె - వాఁడె స
ద్గతి యొడఁ గూర్చి శాశ్వత సుఖంబు లొసంగు నటంచుఁ బెద్ద గా
మతిని దలంచి కావఁయు మన్నన లెల్లను సంతసంబు భూ
పతి యొనరించు ముద్దు మురిపంబులు లెన్నఁగ బ్రోదిసేయుచున్.

తనయుం డెంతయు రాణ సెందునని యాతం డంత సత్యవ్రతుం
డని యా బిడ్డకుఁ బేరు వెట్టి సతతం బావంతయున్ లోపమున్
గనరానట్టి విశిష్ట మార్గమున విజ్ఞానంబు సేకూర్చు ధో
రణిలోఁ బెంచునుగాని వాని నుదుటన్ వ్రాఁతల్ పరీక్షింపకే!

అతఁ డొకనాఁడు బ్రాహ్మణ గృహంబున కేఁగి వివాహ వైభవం
బతి ముద మొందఁ జేయు సమయంబునఁ బెండ్లి కొమార్తె కంటికిం
పితముగ నున్నదంచు నవివేకిగ నామెను బట్టి తెచ్చెఁ గు
చ్చితముగఁ గోటలోని కిఁకఁ జింతలవంతలు యయ్యె నయ్యెడన్.

అందఱుఁ గొందలంపడి రయంబున రాజును గాంచి యార్తులై
వందురి విన్నవింప గుణవంతుఁడు కావున నాఁడు వైళమే
నందనుఁ బిల్వఁ బంపి కఠినంబుగ వానిని మందలించె ని
ట్లందఱిలోన - మందుఁడవురా! యిఁక నిన్ను సహించి యుందునా?

నీ వొక దొడ్డబిడ్డవయి నేల సమస్తము నేలఁజాలి యు
చ్చావచ ధర్మకార్యములు సల్పి యశంబు గడింతువంచు నా
భావమునం దలంచితిని పార్థివజన్మము నెత్తలేదె? దు
ష్టా! వృథ నీదు నామ మకటా! నిను సైఁచుట దోసమే గదా!

ఒక నిముసంబుగాని యిట నుండఁగరా దిఁకఁ బొమ్ము నీచ వృ
త్తికి నిటఁ జోటు లేదని మదిం గుఱుతింపుము; చూడరాదు ని

మొకమని తిట్టిపోయెఁగ నపూర్వ పరాభవమొంది యాశఁకున్
డకనుకలై మొదర్చెను బదింబడిగాఁ బడియుండ నుండటన్.

తెవికిఁ గోపముం బొంగి జెప్పనఁ బెద్దలఁ బ్రోవుచేసి శి
ష్టానిహామంబు లేర్పఱుపఁగావలె నన్న - వసిష్ఠుఁడే నయా
ధానము చెప్పఁగాఁదగిన దిక్కుఁ గటంచు నతస్య లందఱున్
బూని వచింప నయ్యెడ నృపుండును మెచ్చి యుపక్రమింపఁగా.

గురువు వసిష్ఠుడే డిట్టి దొక ఘోర దురాగతమంచు నూటిగా
గుఱిఁగొని వింట సాయకముఁ గూర్చిన యట్టులు తీర్పు సెప్ప - భూ
వరుఁ డది విశ్వసించి పొరపాటుగ రాజకుమారుఁ డట్లు తోం
దరఁ బడెనన్న భావము మనంబున లేక విధించె నిట్టులన్.

శ్వపచులు సైత మిన్నఁడును సల్పని దుష్కృతి చేసి నాకు నీ
వపయశ మంటఁగట్టితివిరా! యిఁక నెట్టులు సైఁతు నిన్ను? నీ
విపుడె యరణ్య భూములకు నేఁగి శ్వపాకుఁ తోడఁగూడి నీ
చపుఁ బ్రదుకున్ వెలార్చి చవి, పాపము చచ్చి మెలంగు మచ్చటన్.

అని యా వెంటనె జేఁడు పేరలుకచే నక్కాని గెంటించి వై
చిన దిక్కేమియు లేక భిక్కుముగమై చేష్టాలు తోడ్పాటుగాఁ
జనియెన్ రాకొమరుండరణ్యములకున్; శాపంబుగాఁ దండ్రియే
వనటం గూర్చినఁ బ్రోచువా రెవరు నిర్భాగ్యున్ బరాభూతునన్?

అట్టులు రాకుమారుఁ డనయం బొనరించుటచే నరణ్యముల్
పట్టి ధనుర్ధరుండయి శ్వపాకులె నెయ్యముఁ గూర్చి నిచ్చలున్
జట్టములై తలిర్పఁ దన చూడ్కికిఁ దగ్గ కిరాతవృత్తి చే
పట్టి వసింపఁగాఁ దొడఁగె; బాతక మట్టు లొనర్చు కుండునా?

అరుణుఁడు పిమ్మటన్ దనయుఁ డట్లయిపోవుట కాత్మఁ గుంది మో
క్షాగ తన కోర్కె తీర్పఁగల వారలె లేక సుపుత్త్రిఁ బొందగా
నరిగెఁద పో వనంబులకు; నక్కడ రాజ్యములోన వర్ణ సం
కరమయి ధర్మ విప్లవము గల్గియు వర్షము పోయె బొత్తిగా.

కఱవును దాపరించె నధికారులు సాయము నిన వేని యా
దరమునఁ జేయఁగాఁదగిన దక్షతఁ బూర్తిగఁ గోలుపోయి ర
త్రితఁ బజలెల్ల రాఁకటికిఁ దల్లడమందుచుఁ గూడుగుడ్డలన్
దొరకక బాధ నొంది రొకత్రోవయు తోఁకయు లేక యెల్లడన్.

వరిగా ద్వాదశ వత్సరంబు లిటు వర్షంబన్నదే లేక యం
దఱు తబ్బిబ్బయిపోయి; రట్టి పెనుభూతం బైన క్షామంబు తీ
వరమున్ సైఁపక గాధిజుండు చనియెన్ భార్యాదులన్ వీడి యె
వ్వరికిం జెప్పక యెడకో యతని దౌర్భాగ్యంబు ప్రేరేపఁగా.

బంగోఁడు బిడ్డలుం గలిగి భర్త యహూంతము లేచిపోవ నే
యండయు లేక భార్య, మరియాదకు లోఁగినదాఁటఁ దిండికై
యొందుచుఁ గాఁపురంబు భరియింపఁగ లేక విషణ్ణచిత్తయై
గండములందు మున్గె; మును కర్మము లెట్టివి చేసియుండెనో!

ఆఁకట నెవ్వగం బొగిలి యాత్మజులెల్లరు స్రుక్కిపోలి య
ట్లాఁకలఁ బెట్టుచుండ నడిమానలు మాని గృహస్థధర్మమున్
జేకొనియుండఁగా ధృతివుసెందక కౌశికుభార్య, బిడ్డలన్
సాఁకుట కొక్కమార్గము విచారణచేసి నపూర్వవైఖరిన్.

ఎవనికిఁ జెప్పుకొందు నను నెవ్వరు చూతురు? చీకుచింతలున్
దవులనివారె లేరకట! ధర్మము ప్రోవఁగఁ జాలి గోలు పా
ర్థివుఁడును లేఁడు-దైవము విధించిన యానతి మీఱఁజాలు ప్రా
భవము బలమ్మునుం గలుగువా రెవ రుందురు లోకమం దిఁకన్!

ధర్మ మధర్మమో యొకవిధాన మొనర్పఁగఁ దప్పదిప్పు డీ
కర్మము తీర్పఁగా సుతులఁ గావఁగఁ దోఁచిన మార్గమంతయున్
ధర్మమె కాన నిత్తఱి వ్యథం బడరా దొకబిడ్డ నింటిలో
నర్మిలి వీడి యమ్ముకొనైన భరింతును దక్కువారలన్.

అని యా కౌశికుపత్ని దీనదశచే నల్లాడి యీరీతి నా
మెను నాకర్మము చావురాదె యని మెంతేఁజింతలో స్రుగ్గి మో
యున్న డెందంబును రాయిచేసికొని యయ్యాపత్తుఁ బోకార్చి యు
త్తుని దానే యొకచోటఁ గట్టి నడచెన్ దూరంబుగా నేడకో!

తక్కినబిడ్డ లందఱును దల్లి చెఱంగు గేల లాగుచున్
గుక్కలు వట్టి బిట్టడలి కోయనియార్చుచు విహ్వలింప న
ల్దిక్కుల నెల్లవారలు పదింబదిగాఁ బరికించి నెవ్వగం
బొక్కుచునుండ దారిఁబడి పోవుచునుండెఁ గుటుంబ మంతయున్.

వనటం గూర్చెడి తల్లి-బిడ్డలను ద్రోవంబోవు సత్యవ్రతుం
డును నింపాదిగఁ జూచి, బిడ్డమొక త్రాడుంగట్టఁగా నేల యుం
చును బ్రశ్నించి విచారము దెలుపఁగా-శోకంబు రేకెత్తి య
వస్థాతారతమ్యము వల్కె నిట్టు తనదౌర్భాగ్యంబు వర్ణించుచున్.

ఎల్లరి మెప్పుపొందిన మునీంద్రుఁడు గాధిజుఁడంతవాఁడు నా
వల్లభుఁడయ్యు నిట్టి దురవస్థకుఁ జిక్కితి; బిడ్డ లాఁకటన్
దల్లడ మందఁ జూచియును దాను దపం బొనరింప నేఁగెనీ
పిల్లల దిక్కుమొక్కు కనిపింపక యిల్లును విడివచ్చితిన్.

కాపుర మీఁద లేక కడగండ్లకు నాఁగక ప్రోవ యేదియున్
జూపెడివారు గానక కుసుల్వడు బిడ్డల నోముఁజాల కీ

పాపపుఁజేష్టకుం గడఁగి పైనము గట్టితి చేరి కేని యీ
పాపను విక్రయించి తగుపాటి సహాయము మూటఁగట్టఁగా.

అనవుడు నా నృపాలసుతుఁ డక్కట! యిట్టి యవస్థ యేల? నా
మనవిని శ్రద్ధగా వినుము మానినిరో! యిఁకనుండి బిడ్డఁగన్
బెనుచుటలో దవంతయును భీతిలఁ బోకుము - చాలినంత తిం
డిని గొనివచ్చి యిచ్చెదను నిచ్చలు మీ కని సమాశ్వసించియున్.

వారిని నోడకే, విజనవాసము చేర్చి సుఖంపఁజేయఁగా
భారము మీఁద వైచుకొని పార్థివపుత్త్రుఁడు నిత్య మాదటన్
వారు భుజింపఁగాఁ దగిన వన్యమృగంబులఁ గొట్టి మాంస మ
వ్వారికిఁ దెచ్చియిచ్చు; నిది వాని విధాయకకృత్యమో యనన్.

మునివరు ధర్మపత్ని తనుమోదముగూర్చెడి యీ విధానముం
గని పదిమంది మెచ్చుకొనఁగా నిలుదిగ్గుచు నామె పుత్త్రపో
షణమున శ్రద్ధతీసికొనసాగెను; త్రాటను గట్టఁబడ్డ యా
తనయుఁడు గాలవుండనుచుఁ దద్జ్ఞులు పిల్తురు త్రాడుగట్టుటన్.

అక్కడ ఱేఁడులేని సమయంబునఁ బొంచి వసిష్ఠమౌనియే
చక్కఁగఁ జేరి న్యాయ్యము విచారణ సేయుచు నెల్లవారికిం
జిక్కులు తీర్చు పెత్తనము చేతికిఁ జిక్కియు నాఁడునాఁడు పెం
పెక్కుచు నుంట కొందఱకు నిష్టము కూర్చినదేమి చిత్రమో!

తన యిటువంటి దుర్గతికిఁ దప్పక యాతఁడె మూలమంచు న
మ్మునివరుమీఁద క్రోధమునుబూని యథావిధి రాజపుత్త్రుఁ డుం
డెను జగడాల మాపదల డీకొని; యావల నొక్కనాఁడు కా
ననమున నేమృగంబును గనంబడదయ్యెను గొట్టి చంపఁగా.

అతనికి బెంగపుట్టె తన యాఁకలిమాట యటుంచి, తాన యా
శ్రితగతి చూపెనంచుఁ బరికించియు నమ్మినతల్లి-బిడ్డఁ గ
బ్రతుకఁగఁ జేయుటే తగినపద్ధతిగా నతఁ డెంచి కంటికిం
పితముగఁ గానవచ్చె నొక పెయ్యను బట్టి వధించెఁ దిండికై.

ఎవరికిఁ జూడఁగా నది వసిష్ఠుని ధేనువయంచుఁ దెల్పె, గా
రవమున జూపనేలయని రాజకుమారుఁడు దానిఁ గోసి యు
త్సవమునఁ దాను గొంతదని తక్కినదానిని మూటగట్టి ప
త్త్యవిధిగ వారికిచ్చె; హృదయంబున స్వస్థత చిక్కెనాఁటికిన్.

నాఁడు మఱింత సంబరమునం దిని తల్లియుఁ బిల్లలాప్తుఁడై
వాఁ డొనరించుదానికి నవశ్యపు గౌరవమిచ్చె, దైవ మా
గోడును దీర్చఁగని యనుకూలుఁడుగా సమకూర్చె - గ్రుడ్డిలోఁ
జూడఁగ మెల్లమే లనెడి చొప్పున నెంచియు నుండెఁ; దంతటన్.

తనయూవుం బరిమార్చెనంచు విని యాతం డెంత దుర్మార్గుఁడో
యని సాక్షంబుగ నా వసిష్ఠముని క్రోధావేశముం బూని యా
తః వెన్వెంటనె పిల్వఁబంపి యవురా! దౌరాత్మ్య మీగతిఁ జూ
పిన నిన్నేమని యందు మిట్టి పెనుఁబాపిం జూతుమే యెన్నఁడేన్!

నీ చరితంబు నింద్య మవినీతుఁడ! నాఁడొక బ్రాహ్మణాంగనం
దోఁచితి వాపయిన్ బరమ ధూర్తుఁడవై జగదేకవంద్యు ధ
ర్మాచరణవ్రతున్ జనకునట్లు లవజ్ఞ యొనర్చి తిప్పుడీ
నీచతఁ జూపినాఁడ విఁక నిన్నొక మానవుఁడన్నఁ జెల్లునే?

ఇఁకనో! శపింతుఁ గాచుకొను మిట్టివి తప్పులు మూఁడు చేసి యా
యదపున నుండవైతివి సుమా! యిఁక నీవు త్రిశంకునామము
య్యాదమునఁ బొంది రాక్షసుఁడవై పదిమందికి భీతిపుట్టఁగా
మెసలుము పొమ్ము-నావు డది మేలని కీడని యాడఁ డతఁడున్.

కదలెఁ బిశాచరూపమును గైకొని యాతఁడు-వానికర్మ మి
ట్టిదియని వ్రాసిపెట్టెను గడింది విధాత; విషణ్ణచిత్తుఁడై
యెదయును దోఁపకే యొక మునీశ్వరు నాశ్రయభూమిఁ జేరి యు
ద్యానయముకోన మాతనికి నూడిగముం బచరించు నిచ్చలున్.

అతఁడు ననుగ్రహించి పరమార్థము కూర్చెడి మంత్రమిచ్చి స
ద్గతి కనుకూలమైన సహకారము చూపఁగ నాతఁ డొక్క స
ద్వ్రతమును దీక్షగా నెఱసి రాక్షసరూపము నాఁడు నాఁటి క
ద్భుతముగ మార్పుసెంది ముదముం బెనుపొంది మెలంగ నయ్యెడన్.

పదపడి బ్రాహ్మణోత్తముల పజ్జకుఁ జేరి నమస్కరించి యి
య్యాదమున నాకు మీర లొక యక్కఱ దీర్పఁగ వేడికొందు న
మ్మాదమున హోమకార్యము - నపూర్వవిధంబునఁ జేయఁబూని య
య్యాది నెఱవేర్ప మీరె కల రంచుఁ దలంచియు నిట్లు వచ్చితిన్.

అనవుడు వారు వాని కథయంతయుఁ బుట్టువుఁదొట్టి నెట్టనన్
విని యవురా! యిదేమి యవివేకము చూపెదు? హోమకార్యముల్
పనుపడ నేయఁగాఁ దగిన భాగ్యము నీ కెవ రిచ్చిరోయి! గా
మ్మని బెదరించి పైగ వెతుకాడిక వెండియుఁ బల్కి రిట్టులన్.

కులగురుఁ డా వసిష్ఠమునికుంజరుఁడే శపియింప నీకుఁ గా
వా సినదాని నీయఁగ నెవా రెవరుందురు భూమియందు? ని
ష్ఫామిఁక నీ ప్రయత్నము; శుభం బొనరింపఁగ సర్వభావమే
కలుగను నీకు-రక్కసివిగావున బాత్రిగ నైఁప మిత్రతన్.

అని కడుమాఱె యుద్ధవడి నాతని నెట్టన నెట్టివైవ జీ
వన మిఁక దుర్భరంబగుటఁ బ్రాణము లేటి కటంచు సాహసం

బుడుఁ గొని యాతఁ డొక్కెడఁ బొందిక కట్టెలు పేర్చి యగ్నియుం
జొనిపి హరీయటంచు నటఁ జొచ్చియుఁ జావఁదలంచె - నంతలో.

మనమున నేదొ తోఁచి యనుమానముతో క్షణకాల మట్టె ని
ర్జనవనమందు నుండ నరునం బాడఁగూర్చు సువార్త యాకనం
బున వినవాయె నిట్టు—లిది పోలదు రాజకుమార! రేపె వ
చ్చును శుభవార్త! యందనుక సుస్థిరచిత్తుఁడవై మెలంగుమీ!

నా విని వాఁడు పంతనమునన్ మరణోద్యమ మెల్ల మాని పో
సి విరమించి నేఁడు గమనింతును - రిక్తకు రిక్తమైనచో
నావలఁ జావరాదె యని యత్తఱి నిబ్బర మావహిల్ల స్వే
చ్ఛావిధిఁ గాలముంగడుపసాగెఁ; బదంపడి పట్టణంబులో.

కలఁతలు పుట్టి ప్రెగ్గడ లెకాయెకిఁ బోయి నృపాలు ప్రేమ దో
యిలి గుదియించి భక్తి గురియించుచు సర్వము విన్నవించి నా
వాఁడు తనజీవితం బిటులు వ్యర్థముకావుట కాత్మ రోసియున్
బలికిను వారితో నిఁక ముభావముసూపుట చెల్ల దియ్యెడన్.

పోమ్మనినంతఁ గిమ్మనక పోయి వనమ్మున నొంటిగా విచా
రమ్మునఁ గాలముం గడుపు రాజకుమారుని జీవితమ్ము వ్య
ర్థమ్మయిపోయెఁ; బైగ - నపరాధము కల్గినదాని కల్గి శా
పమ్ము వహిస్తుఁ డిచ్చె; నిది పాపము పున్నెము చర్చ యేటికిన్?

తెలియక చేసినేయని మదిం గుఱుతింపక కన్నబిడ్డకే
యిలమట గూర్చి యీ యడవులం దిటు లాకులలంబు మేయఁగా
వాఁ పెఁగదా! యిఁకేల? పరివారముతోఁ జని మీర లాతని
గొలిచియుఁ దెండు రాజ్యమునకున్ బ్రభు నాతనిఁ జేసి పోయెదన్.

అది విని చిత్తమందు వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి మంత్రు ల
య్యాదవున సంబరంపడి ప్రయాణము చేసి యరణ్యసీమ నా
పదల ముఖింగి రాచసిరిఁ బాసిన రాజకుమారుఁ జేరి య
య్యాది వినిపించి తండ్రికడ కవ్వడె వానిని దెచ్చి చూపినన్.

అపురసుంచు బిట్టడలి యాదటఁ గౌఁగిట వాని గ్రుచ్చి చిం
తల తనశాస్త్రమ్ము త్రోసుముఖు దాంతిని భూమను వాని గూర్చి స
ద్భావము సూపి, నాఁడు పొరపాటుగ సత్యమెఱుంగలేక మే
ధావిని గెంటివైచియు వృథా యొనరించితి నింతకాలమునన్.

అని విలపించి సిగ్గోసి మా ధరణీశుఁడు స్వస్థచిత్తుఁడై
గొనకొని సింహపీఠమునకున్ శుభవేళఁ గుమారుఁ జేర్చి ని
మ్మనమున నిబ్బరంపడి క్రమంబుగ సర్వము రాజనీతి మా
లిని కుపదేశమిచ్చి బహుధా పరిశీలన చేసి యిమ్ముగన్.

# భావము, సంఘటన: ఏది ముందు?

శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

మహావేగంతో పరుగెత్తుకొని పోయే యీ విశ్వం క్షణక్షణానికీ అనంతకాలంతో పాటు మారుతూనే వుంటోంది; క్షణక్షణానికీ ఘటనా పరంపరల్ని కలిగిస్తూనే వుంటోంది. ఒక్క విశ్వమే కాదు ఈ పని చేస్తున్నది. విశ్వంలో వున్న సర్వస్వం కూడ యేవో ఘటనల్ని కలుగజేస్తూనే వున్నాయి. గడియారం ఒక్కొక్క సెకండుకు ఒక్కొక్క ప్రత్యేక స్థితిని చూపిస్తూ కాలాన్ని కొలుస్తూనే సంఘటనల్ని లెక్కిస్తూనే వుంటోంది. చీమల్ల దగ్గర్నుంచీ సింహం వరకూ, బిచ్చగాడి దగ్గర్నుంచీ భూమిపతి [illegible] వరకూ అంతా సర్వసాధారణంగా యేవో ఘటనలకి కారణమవుతూనే వుంటారు. ఈ ఘటనల సంఖ్యకు అంతూ పొంతూ లేదు.

ప్రతి సంఘటనకీ యెవరో ఒకరు కారకులుంటారు: మనుష్యులు కావచ్చు, మానులు కావచ్చు, పశువులు కావచ్చు, పక్షులు కావచ్చు. అలాగే ఆ ఘటనల ఫలితాన్ని యెవరో ఒకరు అనుభవిస్తూ వుంటారు. ఒక్కొక్క సంఘటన కొందరికి సుఖం కొందరికి కష్టం కొందరికి జుగుప్స కలిగిస్తుంటుంది కూడాను. ఆ ఘటనల్ని కలిగించేది ఒక వేళ యెవరో మనిషే అయినా అతను సుఖం, కష్టం లాంటి అనుభూతుల్ని ఇతర్లలో కలిగించాలని అనుకోనుకూడ అనుకోకపోయి వుండవచ్చు, అయినా ఆ పర్యవసానం వుంటూనే వుంటుంది.

జరిగిన ప్రతిపనీ ఘటనే అవవచ్చు. చెట్టుమీద నుంచి పండు క్రిందపడిందనుకోండాం. అదొక ఘటన. దీనివల్ల ఆ పండు ఏరుకొన్న పసివాడికి ఆనందం; రేపువచ్చి [illegible] తోటమాలికి మనఃక్లేశం; దానివల్ల న్యూటను వంటి గొప్పశాస్త్రజ్ఞునికి మహోద్బోధ కలిగితే అప్పుడు ఆ సంఘటనను గురించి సర్వకాలమూ జ్ఞాపకముంచుకొంటాము.

ఒక ఘటనకూ, యింకో ఘటనకూ యేదో సంబంధం వుందనే మాట వాస్తవమే. కాని యీ రెంటికీ మధ్య సంబంధం కలిపిన తంతువు యేమిటని ప్రశ్నిస్తే, శరీరతత్వశాస్త్రజ్ఞులు, మనస్తత్వశాస్త్రజ్ఞులు పోటీపడి భిన్నమైన సమాధానాలు ఏకరువుపెట్టి మనకు విప్పిచెప్పటానికి ప్రయత్నిస్తారు.

శరీరశాస్త్రప్రకారం మస్తిష్కంలో మెదడనే పదార్థం వుంటుంది. బహుశః మెత్తగా బూడిదరంగుతో, ప్రతి చిన్న విషయానికి పులకిస్తూ, కంపిస్తూ నేవుంటుంది. దీన్ని శస్త్రపరీక్ష చేసి పరిశీలించవచ్చు. ఈ మెదడు శరీరంలో కలిగిన ప్రతి మార్పుని కాని విశేషాన్ని కాని తనలో నమోదు చేసి వుంచగలదు. ఒక సంఘటన లేక ఒక సంగతి కన్ను, ముక్కు, చెవి లాంటి జ్ఞానేంద్రియాల ద్వారా యీ మెదడుకు తెలియజేయబడితే దానివల్ల కలిగిన ఫలితాలతో సహా మెదడులో ఆ ఘటన రచించబడుతుందని శాస్త్రజ్ఞుల కథనం.

పందొమ్మిదో శతాబ్దంలో ఈ శరీర శాస్త్రజ్ఞులు మన కర్థమవుతున్న "మనస్సు" అనేదేది శరీరంలో లేదనే అనుకుంటూ వుండేది. వీరు చెప్పే మెదడనే పదార్థం పైన చెప్పినట్లు తన శరీరంలో జరిగిన విశేషాల్ని జాబితా చేసి దానిపై జరిగిన ప్రతిక్రియతో సహా భద్రపెట్టి దస్తరం తయారు చేస్తుందికాని మన మనుకొనే "మనస్సు"లా యుక్తాయుక్త వివేచన శక్తిని కనపరచలేదు. ఐతే యీ సకల సంఘటనలు మనుష్యులకెలా అనుభవాన్ని కలిగించి వుపయోగిస్తున్నాయి? ఈ విషయం చెప్పటానికి డార్విన్ కూడ సాహసించలేదు. అతని సిద్ధాంతం ప్రకారం ఒకరకపు జీవుల్నుంచి మరొకరకపు జీవులు తయారు కావటానికి కారణం వాటి చుట్టూవున్న వాతావరణంలోని మార్పులే—వాతావరణంలో మార్పు, శరీరాల్లో మార్పు—అన్నీ భౌతికమైన కారణాలే. అనుభవం అనే చైతన్యం కూడ కారణమని కర్మ సిద్ధాంతం చెప్పినవాడు మనువు. ఇక ప్రాణం అనేది యేమిటి? ఈ చైతన్యానికి మూలం యేమిటి అంటే, అది పదార్థమే; శరీరంలో యే గుండెలోనో యే మోకాలిలోనో ఇంకో చోటో వుండి వుంటుంది; తెలుసుకోలేక పోతున్నామని పదార్థ విజ్ఞానులు అంటారు.

ఇలా యీ శాస్త్రజ్ఞులు చెప్తుంటే సంఘటనవల్ల భావం పుడుతోందనీ అలా పుట్టినభావం [illegible] సంఘటనలకు తంతువుగ పని చేసే ఘటనా పరంపరలకు దోహదాన్ని కలిగిస్తుందని అనిపిస్తుంది.

భావం అంటే మూలంగా సంకల్పమని కాని అనవచ్చు. ఈ భావం సహజంగా సంఘటనలవల్లనే పుట్టేటట్లయితే అది రాతిలో పుట్టదేం? [illegible] జరిగే వేలాది సంఘటనలు రాతిలో యేమాత్రం చైతన్యాన్ని పుట్టించ గలుగుతున్నాయి? చెట్లల్లో మొక్కల్లో యేమాత్రం భావాన్ని కలిగింపజేయ కలుగుతున్నాయి? అనే ప్రశ్న వచ్చింది. దానికి జగదీశచంద్రబోసు సమాధానమిచ్చాడు. టన్నులకు టన్నుల బరువుల్ని ఆకాశంలోకి మోసుకుపోయి తలకాయలాడిస్తున్న చెట్లకి పైకి బరువునెత్తగలిగిన శక్తి వుందనేమాట మరచిపోవద్దన్నాడు. వృక్షజాలంలో కూడ భావం, రసం వగైరాలు వున్నాయి. లీలామాత్రంగా ప్రయోగాల ద్వారా చూపిస్తాను. చూపెండన్నాడు. ఆ మాటకు వస్తే, అసలు జడపదార్థాలయిన రాళ్లల్లో కూడ భావం వుండే వుండొచ్చునేమో! ఆ భావాల్ని మనకు తెలియజేసుకొనే అంతగా వాటికి వీలు లేక పోయి వుండవచ్చు అని కూడ అనిపిస్తుంది. ఇలా అనిపించి అనిపించి సంఘటనలే భావాల్ని కలిగిస్తున్నాయనే భావం నిజమనిపిస్తుంటుంది కూడాను.

ఐతే భరతఖండంలోని ఋషులలా అనలేదు. వారి దృష్టిలో భావమే ఘటనకు అంకురం. అఖిలప్రపంచమంతా యిలా తయారు కాకుండా వున్నప్పుడు అదంతా అంధకారబంధురమై అణిగి మణిగి

లాగామై నిద్రపోతూ ఏమీ పదార్థానుసేనీ కనపడకుండా, కనీసం గాలి కైనా కొరకుండా ఈథరు (ether) లేని చట్టి ఆకాశమల్లే వుండి పోయినప్పుడు సంఘటనకాని ఘర్షణకాని యేమీ లేవు. ఎతే అప్పుడు భావమనేదిమాత్రం ప్రత్యేకంగా వున్నదా అంటే అది సుప్తమై ఆ అంధకారంలో కలిసిపోయివుంది. అంటే అంతపదార్థమున్నూ (Matter) యీ విశేషశక్తి మొదలైన చైతన్యమున్నూ (life) అన్నీ యేకమై ఒకటై పోయినయి. ఆ పరిస్థితి అలా వున్న సమయంలో సృష్టికి ముందు పుప్రకమించిం దెవరంటే, సంకల్పమని ఆ ఋషు లన్నారు. ఇది యెలాగ? సంకల్పం వేరు, మరొకటి వేరుగానున్నప్పుడు ఎవరన్నా వచ్చి 'సంకల్పమే ముందు సృష్టిక ప్రారంభించింది నేను చూశా"నని చెప్పితే ఆ మాటలు నమ్మ అవు నవుకోవచ్చు. కాని అన్నీ కలిసిపోయిన ఒకటే పరిస్థితి వుండగా సృష్టికి మొదలుపెట్టింది "భావమె"ననటంలో ఔచిత్యమేమిటని శంక.

సృష్టియెలా అయిందీ అనే విషయంమను విలా చెప్పారు. "అసలు మొదటి అంధకారమయిన పరిస్థితే యిప్పుడు మనంవున్న పరిస్థితి గామారింది" అన్నారు. ఇదే అది అన్నారు. అయితే అప్పటి పరిస్థితికి బ్రహ్మయని హిరణ్యగర్భుడని పేరుపెట్టారు. Law of Indistructiability of the matter అనే ఇంగ్లీషు పదాలను వాడిన మీదట అతిసన్న అర్థం చెప్పినట్లయితే బాగా తెలిసేది. అలా అర్థం చెప్పటానికి యూరపులో "డాల్టన్" అనే మనువు పుట్టాల్సొచ్చింది. "అలా అంధకారంగావున్న పరిసితిలో—బహుశ చైతన్యశక్తి మేల్కొన్నది కాబోలు—ప్రాణం పోసుకున్నట్లుగా అయింది, తడిపి ఆరబెట్టిన శెనగగింజల్లె. అప్పటి ఆ పరిస్థితికి మనువు యేపేరు పెట్టినా అది ఒక పరిస్థితే గాని మనిషి గాని మనిషిలాటివాడు గాని కాదు. ఇంతవరకూ అయోమయంగావున్న ఆ స్థితి తనను తను అర్థం చేసుకున్నట్లు, ఆ అయోమయాన్ని వదలివేయాలన్నట్లు, ఏదో తెలివితేటలు ప్రయోగించగలిగినట్లు, మార్పుకలుగుతున్నట్లు అనిపించింది. ఎవరికలా అనిపించిందంటే, ఆ పరిసితికే; కాదంటే దాన్ని యిప్పుడు వూహించే మనకు. అలా తెలివితేటలు సారించిన ఆ స్థితి తానేం చెయ్యాలంటే అది చేయగలననే ధీమాకూడా కల్గింప జేసుకొన్నది. చైతన్యం, అహంకారం రెండూ అక్కడ కరుడు గట్టి నిల్చినవి. ఆస్థితిలో కొన్నిచోట్ల సుఖం, తృప్తి, శాంతి, హాయి కలిగివున్నట్లు, ఇంకోచోట ప్రేమ, ఆశ, యేమిటో తెలుసు కోవాలన్న ఆసక్తి అన్నీ వున్నట్లు, మరోచోట మత్తు, నిద్ర, నిస్త్రాణ మొదలైనవన్నీ వున్నట్లు తోచింది. వీటిని సత్త్వరజస్తమో గుణాలంటాడు మనువు. ఇవన్నీ తనలో యిలా వున్నాయన్న విషయం ఆ స్థితికి తెలియటం మొదలెట్టింది కూడాను. అంటే మనస్సనేది దానికి ఒకటి వుందన్నమాట.

ఆ మనస్సుతో అప్పుడు ఆస్థితి శబ్దాన్ని వూహించింది—స్పర్శనూహించింది—రూపాన్నూహించింది. ఇలా యివన్నీ వూహిస్తూండగానే ఆకాశం, గాలి, మంట, నీరు, భూమి అన్నీ ఆయా

తప్పారు. ఈ స్థితి. రాజకీయవేత్తల్లో కొత్తభావాన్ని రేకెత్తించింది.

ఏకను మొదలైన ఆలోచనాపరులు తీవ్రంగా తమ మేధలో నుంచి నిష్పాక్షికమైన ఆలోచనలు వర్షించటం మొదలెట్టారు. మతం వేరు, మతకార్యాలు వేరు అన్నారు. రాజకీయాలు వేరు మతమాత్రాలు వేరు అన్నారు. ఈ మతప్రవక్తలు చేసే పనులకు సహించలేక ఇంచుమించు అన్ని రాజ్యాల్లోని ప్రజలూ యీ మేధావుల బోధల్ని వింటూ పైకి అనలేక లోపల దాచుకోలేక పిసుక్కు చస్తున్నారు. భావం యెలా ప్రజాబాహుళ్యంలో మొలకెత్తి సంఘటనలకు దారితీస్తుందో పరీక్షగా చూస్తేగాని దానికర్థం తెలీదు. అయితే యీ మాత్రపు భావాలకే చింతకాయలు రాలాయని దానివల్ల మాత్రమే యూరపులో పునరుజ్జీవనం వచ్చిందని అనటల్లేదు. చిత్రకారుల దగ్గర్నుంచి మతసంబంధమైన చిత్రాల్ని వదిలేసి, ప్రపంచంలో జరిగే సామాన్యమైన ఘట్టాలు రచించటం మొదలెట్టారు. ఆ నాటి ప్రపంచంలో విజ్ఞానమెలా వృద్ధి అవుతోందో తెలియజేశారు. కోపెర్నికస్ భూమికూడా ఒక గ్రహమని కనిపెట్టాడు. కెప్లర్ గ్రహగమనాలకి లెక్కలు కట్టాడు. గెలీలియో అద్దాలయంత్రంతో ఆకాశంలో స్వర్గం చూపించాడు. అచ్చుయంత్రం కాశీ అన్నపూర్ణలా, అద్భుతమైన ఆలోచనాపరులకు అన్నమై నిలచింది. కోకొల్లలుగా పుస్తకాలు ముద్రింపబడ్డాయి. మహామహులకు మాత్రమే అంకిత విజ్ఞానం సామాన్యమానవులకి సునాయాసంగా దక్కింది. దిక్సూచియంత్రం కనిపెట్టబడింది. తీరాన్ని పట్టుకొని పాకే పడవలు, ఓడలు నడిసముద్రంలోకి వెళ్ళగలిగినయి. కొలంబసు వెళ్ళివెళ్ళి ప్రపంచపు కొత్త భూభాగాన్ని కనిపెట్టాడు. పోర్చుగీసులు ఇండియాకువచ్చి వ్యాపారంచేసి అంతూ పొంతూ లేని ధనం, మణివస్తువులు సంపాయించారు. ఇక యీ మతప్రవక్తలు చేసే దురాగాలు వర్ణించి నిరసించటానికి కావలసినంత అవకాశం జనానికి దొరికింది. అంతే దాంతో మతంతో సక్తమైనట్టి మఠపెళ్ళి ఒక్కసారి లేచి బోర్లపడ్డట్టు క్రైస్తవమతం తల్లకిందులయింది. ఊడకి, ఉబ్బి, వార్లి. పెటించిన భావాలు ఏవిధంగా "ప్రొటెస్టంటు" నే క్రొత్తమతాన్ని తెప్పించిపెట్టాయో చూడండి.

మార్టిన్ లూథర్ ఈ కొత్తమతాన్ని పెద్ద జెనూల్లను తయారుచేసి అన్ని దేశాలకు మళ్ళీ ప్రచారానికి పంపాడు. ఈ సర్వతోముఖమైన చైతన్యంతో యూరోపులో మధ్యయుగం దాటిపోయి నవయుగం వచ్చింది. ఈ చైతన్యం ఆవిర్భవించటమనే సంఘటనకు కారణం మతస్థుల దౌష్ట్యభూయిష్టమైన సంఘటన అనవచ్చు. లేకను పూస అనవచ్చు. గెలిలియో తెలివి, కోపర్నిన్ పరిశ్రమ, ఇరాస్మస్ తీవ్రభావాలు అన్నీ కారణమే అనవచ్చు. భావాలూ సంఘటనలూ అన్నీ కలగలిపి ఈమార్పు తెచ్చినయి.

ఫ్రెంచివిప్లవం అనే సంఘటనకూడా చెప్పదగినమైన సంఘటన. అప్పుడు ఫ్రాన్సురాజ్యంలో ఒకరుకరులు వచ్చి లక్షలాది తలకాయలు దొర్లినయి. ఈ సంఘటనకుముందు ఎంత గూఢమైన ప్రచారాలు జరిగాయో, మనసులోపల ఎన్ని స్వయంపాకాలు ఉడికాయో, ఎలాంటి భావతరంగాలు పగిలి పడ్డాయో ఒక్కసారి చరిత్రతిరగేసి చూస్తే తెలుస్తుంది. విప్లవానికిపూర్వం అధికారంలోవున్న కొద్దిమందికే అనేకవసతులు వుండేవి. మిగతావాళ్ళు పన్నులుకడుతూ శ్రమచేస్తూ బాధలుపడుతూ తక్కువవాళ్ళుగా చూడబడుతూ కొడమాపుల్లో పస్తు కొరికేవాళ్ళు. కేమనింగ్ గోజుల్లోలాగా గొప్పవారి విందుల్లో పారేసిన పదార్థాలు ముక్కలుమాత్రమే తింటుంటే ఎండిన పెంపులు చప్పరిస్తూ, పొడుగాటి బల్లేలు భూస్వాముల కుండెల్లోంచి దూసుకుపోతున్న టూహీంచి గుటకలు మింగేవాళ్ళు. ఇవి ఘటనలరూపాల్లో వ్రాసుకున్నా ఇవన్నీ వాళ్ళ బుర్రల్లోని భావపరంపరలని మరవద్దు. ఈ భావాలకు రూపం కల్పించింది రూసో, వాల్టేరు రచనలు మనుష్యులందరికి సమానహక్కులుండాలని సమానత్వాన్ని రాజ్యపాలకులు పాటించాలనీ వాళ్ళు చెప్పిన సిద్ధాంతాలు యీ బాధితుల బుర్రల్లో పీఠం వేసుకున్నయి. అవే ఫ్రెంచి విప్లవానికి కారణమయినయి జరిగిన సంఘటన తలకాయలు దొర్లటం. ప్రజానీకంలో ప్రజ్వలించిన భయం ఒక్కటే దానిబరువైన ఫలితం, ఈ ఫ్రెంచి విప్లవానికి కారణం రూసో వాల్టేరుల సత్యమా? లేకపోతే అప్పటి ఘనులు సామాన్యులు అనే వ్యత్యాసమా?......

1760-1850 మధ్య యూరపులో పారిశ్రామిక విప్లవం వచ్చింది. ఇది ఒకే సంఘటనకాదు. అనేక సంఘటనలు. బ్రిటిషువారికి భారతదేశం మొదలైన వలసరాజ్యాలలో విస్తృతంగా ముడిపదార్థాలు దొరకటం జరిగింది. ఇదొక సంఘటన. అవి యెలా వుపయోగించాలా అనుకున్నారు. ఇది భావం. ఇంగ్లండుకు తీసుకుపోయారు. ఇదింకో సంఘటన. వాటిని వుపయోగించేందుకు కుటీర పరిశ్రమలు చాలక పెద్దపెద్ద యంత్రాలు కనిపెట్టారు అవి తయారుచేసే సరుకు వస్తువులు తిరిగి కాలనీలకుపంపి చాలా ప్రియమైన ధరలకు అమ్మేవాళ్ళు. ఇది లాభసాటిగా అవుపడ్డది. దీన్ని పురస్కరించుకొని ఒక కొత్త శాస్త్రము రేగింది - కొత్తభావం - ఇది రాబోయే రాజకీయ ఆర్థికరంగాలలో పునాదిగా యేర్పడింది, దీని ఆంతర్యమేమిటంటే ఎవడి మట్టుకువాడు స్వలాభాన్ని చూసుకొని వ్యాపార వ్యవహారాలు నడుపుకోవచ్చు వచ్చేలాభాలన్నీ ఎంతవరకు పుచ్చుకోగలిగితే అంతవరకు పుచ్చుకోవచ్చు (Laissez faire policy)-ధనం పెట్టుబడి పెట్టటం - యంత్రాలతో పని చేయించుకోవటం – వచ్చిన లాభాలు అనుభవించటం. ఇలా యెందుకు ఒప్పుకున్నారంటే యంత్రాలు నిర్మించటానికి తగిన పెట్టుబడి పెట్టవలసివచ్చింది. ఆ యంత్రాగారల్లో కూలీలు లేక కార్మికులచేత పని చేయించుకోటానికి పెట్టుబడి కావలసివచ్చింది. ఇంగ్లండులో వుండే రాజ్యవ్యవస్థ యీ మిలుల్ని నడిపే బాధ్యత నెత్తినేసుకోలేదు. మిల్లులు నడపటం తప్పదాయెను. ఈ పెట్టుబడి అనే దాని విలువ విపరీతంగా విజృంభించింది. యంత్రాలు నడపటానికి పెట్టుబడిదారీ విధానం తప్పితే మరేదీ లేదనే పరిస్థితికి ప్రాముఖ్యం వచ్చింది. అంతే. దాంతో యంత్రాగారాలు పోటీలుపడి లేచినయి. పత్తిరాటాలుపోయి బ్రహ్మాండమైన పనిముట్లొచ్చినయి. వందదారాలొక్కసారి వడికి తయారు చేసే యంత్రం వచ్చింది. ఇనుము బొగ్గు కనిపెట్టబడి బరువు యంత్రాలు తయారు కాబడ్డాయి. అటుమీదనుంచి విద్యుచ్ఛక్తి నుపయోగించి యంత్రాలు నడపటం మొదలవచ్చింది. ఈ యంత్రాలు తక్కువ వస్తువులన్నిటిని తక్కువ చోటకు తీసుకుపోయేందుకు కావలసిన రవాణా సౌకర్యాలు కనిపెట్టబడ్డాయి.

ఈ పారిశ్రామిక విప్లవం వస్తున్న కాలంలోనే వ్యక్తిగతమైన స్వలాభాలు చూసుకోటానికి ప్రతి ఒక్కరికీ హక్కున్నట్టు జనబాహుళ్యంలో యెన్నబడుతూ ఈ భావమే పెట్టుబడిదారీ విధానానికి దోహదమై వుందని పైన చూశాం. ఇంకా యీ విప్లవపు ఫలితం చిలవలు పలవలు వేసింది. ఆ మాటకొస్తే యీ విప్లవ ఫలితాన్ని తెలుసుకోవటమే ఒక విద్యావ్యాసంగమనవచ్చు. వ్యవసాయదార్లు భూములు, గ్రామాలు వదలి పట్నాలకు వెళ్ళి యంత్రాగారాల్లో పనిచేసి డబ్బు సంపాయించటం మొదలెట్టారు. గ్రామాలు నశించిపోయి పట్నాల్లో పదిమంది ఒకచోట కలిసి, తమ సాధకబాధ

పడకుండా. స్వయంవరమంటే ఏకారి సంతర్పణ కాదు. ఆ
వచ్చినవాళ్లలో నీ కెవరు తగినవాళ్ణ్ణి నువ్వు ఎన్నుకోవాలి. ఇటు
చూడు—ఈ క్షత్రియ వంశాలకు చెందిన అనేక మహారాజులు
పంపిన బహుమతులివిగో. ఇందులో మహోత్కృష్ట
దొక్కటే వున్నాడు. చూడు యీ చీరలు—కళ్ళు మిణిగి
పోతున్నాయి. పొద్దు పొడుపు వేళల్లో, సంధ్యాకాంతుల్లో,
బంగారు ఛాయ ధరించిన దంతపు మేఘముక్కల్లాగ ఎంత మెత్తన.
దేవతలకి కూడా, యింత మృదువైన వస్త్రాలు దొరుక
తాయని నేననుకోను!

కాశ్య: నిజమే అక్కా. పువ్వుల్లా మెత్తగా మేఘాలను మించిన
చీరలు. కాని నాకు మాత్రం అక్కర్లేదు.

గంగ: ఆ మహారాజు పంపినదే యీ రత్నాలతో చెక్కిన ధగధగ
లాడిపోయే కిరీటం. ఈ కిరీటంలో ముందుకు వ్రేలాడుతూన్న
బ్రహ్మాండమైనంత రత్నం నీవు ధరించినప్పుడు నీనుదుట
బాలమీశోభ లాలు పోస్తుంది. ఆ రాజుని నీవు వరిస్తే ఆయ
నకి రెండు చందమామల శోభ దక్కుతుంది. నీ ముఖమే
చందమామ, నీ ఫాలంమీద ఆ రత్నపు కాంతికి విస్తుపడి
అందాలమామ ఆకాశంమీదికి రాదులే. ఇంతకూ ఎవరికి
కావాలి అంతదూరంగా వున్న కౌముదీ భూషణుడు!

కాశ్య: అక్కా, యీ కిరీటంలో పొదివిన ఆ మహారత్నం ఏమి
సూచిస్తుందో నీకు తెలుసునా? కర్కశత్వాన్ని సూచిస్తు
న్నది. కర్కశత్వంలో కాంతి — క్రూరహృదయంలో
ప్రేమ వుంటుందంటే ఏం ప్రయోజనం? మార్దవంగల మనస్సు
నాకు కావాలిగాని, అమూల్యమైన రాళ్ళూ రప్పలూ నా
కక్కర్లేదు.

గంగ: ఈ ప్రపంచంలో వున్న సిరి అంతా వచ్చి, నీ వంటి రత్నాల
నెపమై వెలుగుతావం టే వద్దనేవారుంటారా? వినాశకాలే
విపరీతబుద్ధిః అన్నారు అందుకే.

కాశ్య: ఏది వినాశమో, ఏది అవినాశమో, మీరంతా నిర్ణయించిన
పడికట్టురాళ్ళతో తూచుకొని, నా జీవితం పాడుచేసుకోడం
నాకిష్టంలేదు. కాలంలో మారుతూ వస్తున్న ఎవరి వ్యక్తి
త్వాన్ని బట్టి వారు ఆలోచించి, నిర్ణయించుకోడం మంచిది.
కాని—యింతకూ చంచలచిత్తవు నీకేం తెలుస్తుందిలే యిది.

గంగ: ఆహాహా—యిదుగో చూడు. గరుడపచ్చలు తాపి, అంచుల ఆణి
ముత్యాలతో ఎళాలుగకటిన, బంగారుపుపళ్ళెరంలో చంద్ర
వంకను మించిన కైజారును కానుకగా పంపెను ఒక మహా
వీరుడు. అతుల తేజోనిధి, రణరంగమార్తాండుడు. సేనాధిపతు
లలో తలమానికం వంటివాడు. సంపదలకు మురిసి సౌందర్యానికి
దాసిపడి రాణులై రాజిల్లాలని స్త్రీ కుండకపోవచ్చు. కాని
అధిక బలశాలి! క్షత్రతేజమై ప్రపంచమై మెరయు వీరుని
వరింపని కన్యక లుంటారా ఎక్కడైనా?—కాశ్యపి,
ఏమంటావ్?

కాశ్య: కస్సుడే పన్నీరులాగ, వాళ్ళకో నా ఎరుకగా
వున్నట్లూ, ఎందుకిలా అనుకుంటూ వక్కా! సైనికుల్ని,
సైన్యాధిపతుల్ని కూడా తెలుసు. ఆ మొక రకమైన దుస్తులు
ధరించి అవ్యమైనదుస్తులు ధరించిన వారంతా తమను క్రతు

అక్కర్లేదు. కాలం పరిపక్వమైంది. ఒక రకమైన ప్రతిజ్ఞామే—

గంగ: చాలమ్మా. నీతో వాదించి ప్రయోజనం లేదు. స్వయంవరానికి వేళ అవుతోంది. వచ్చినవాళ్ళు నలుగురే అయినా నీవు వరించినా వరించకపోయినా జరగవలసిన కార్యక్రమం జరిగి తీరాలి కదా. వెళ్ళు. అలంకరించుకో......అం......నాకు తెలుసు—నువ్వెందుకలంకరించుకుంటావ్—పోనీ, ఆలోచించుకో—వ్యవధి చాలదు.

తెర

## రెండవ రంగం

(స్వయంవర మంటపంమీద, రాజు, సైన్యాధిపతి, వ్యాపారస్తుడు, అర్చకుడు సుఖాసీనులై ఉంటున్నారు)

గంగ: ఈ వచ్చిన మహనీయులని, మేము వేదికమీదకి రావడం కొంచెం ఆలస్యమైనందులకు క్షమాపణ వేడుకుంటున్నాను. స్వయంవర పత్రికలో మేము ముందే ప్రకటించాము. బహూకృతులు పంపినవారందరిలో మహోత్కృష్టమైనవి పంపిన వారినే మేమెంచి, వారికే ఆహ్వానాలు పంపుతామని, వారే స్వయంవరానికి వచ్చేందుకు, అర్హులని. అందుకే మీ నలుగురికే ఆహ్వానాలు పంపడం జరిగింది. మీరు దయచేయడమైంది. కాశ్యపి. వీరు ఉత్తమ క్షత్రియ సంజాతులు, రాజాధిరాజులు. అఖండ తేజోశాలులు.

రాజు: ఈ అఖండ దిగ్విజయాన్నంతా జయించి పరిపాలన ధురంధరుడనన్న పేరెన్నికగన్న నా రాజ్యాన్ని, నన్నూ మాని ఎవరు మోహించరు! నా రాజ్యంలో నా కీర్తిని చూసి వెన్నెల సిగ్గుపడుతుంది. సూర్యుని తేజస్సు నా కరవాల తేజస్సుకు బరాబరులిస్తుంది. పక్షులు వాటి కలరవాల్లో నా పేరే ఉచ్చరిస్తూంటాయి. గాలి నా సౌందర్య గాథలన్నీ మంతనం ఆడుతూ వుంటుంది. నన్ను వరించినవారిలో ఏ ఒక్కరో, పట్టపురాణి అవుతారు! నీవు నన్ను వరిస్తే నిన్ను పట్టపురాణిని చేయుటమేకాక, ఇంతవరకూ ఏ రాజూ సాహసించని చేయలేనిపని, గౌరవం నిను చేయదలచుకున్నాను. నిన్ను నా రాజ్యానికి మంత్రిగా కూడా చేస్తాను. అప్పుడు రాత్రింబవళ్ళు మనిద్దరికీ వియోగముండదు.

గంగ: కాశ్యపి, స్త్రీకింతకంటె గౌరవమేముంటుంది! ఆడది ఆడదికాక, మగవానికి చేదోడు వాదోడే కాక, పురుషునికి పై చేయి సుమా, అని మంత్రిగా నిన్ను నియమింప నెంచిన యీ మహారాజు స్త్రీజాతిని ఎంత ఉన్నతంగా చూస్తున్నాడో కనుపించలేదా నీకు! వీరిని వరిస్తే స్త్రీజాతికి మహోపకారం చేసినదానవవుతావు. మాట్లాడవేం... సరే, నీ మౌనానికి అర్థం నాకు తెలుసునులే. ఎవరి భుజస్కంధాలమీద రాజులూ రాజ్యాలూ కూడా ఆధారపడి ఉంటాయో ఎనలేని క్షాత్రతేజం ప్రతాపాగ్నియై శత్రు సమూహాన్ని భస్మీపటలం చేయగలదో అట్టివీరె అతుల తేజోనిధి సైన్యాధిపతి.

సై. పతి: పిరికిపందలైన వారిలో ధైర్యం రేకెత్తించి ఆహవరంగంలో ప్రాణాలను ఆహుతి చేయాలిగా ధీరులుగా చెయ్యడం నాకు తెలుసును కాని. రమణీయమైన రాగాల హృదయంలో ప్రేమ రగుల్కొలుపడం బాగా తెలిసిన వాణ్ణి గాదు. శత్రుసేనలమధ్య ఆహవరంగంలో వ్యూహాలు నిర్మించి విజయాన్ని సాధించగలను కాని, మనోహరమైన రమణీయమణుల హృదయస్పందనం గ్రహించి, స్వయంవరాలతో జయం సంపాదించడం తెలీదు. ఈ రాజులూ, మహారాజులూ మామీద ఆధారపడి వుంటారు. రాజులూ, రాజ్యాలూ పోయి ఏనాడో అయింది. పరిపాలన సైనికాధిపత్యం హస్తగతమైంది. వారి అధికారాన్ని తోసిరాజని, సైనిక పరిపాలన తీసుకొచ్చాం. మా పరిపాలన కడు భయంకరం. తిరుగులేనిది. నామాటే శాసనము. ప్రజలు పిపీలికలు. ఎదురుచెప్పి ఎవ్వరూ బ్రతికి మనలేరు. నన్ను వరిస్తే నిన్నే రాణిని సైన్యాధికారిణిని చేసి నేను నీకింద సైనికుడనై తిరుగుతాను. నీ పూలమాలకోసం నా కంఠం కళకంఠమై ఎదురుచూస్తున్నది.

గంగ: ఈ లోకంలో తేజస్సూ, క్షాత్రతేజం కలుసుకోవడం కడు అపురూపం. మీరిద్దరూ ఒకరినొకరు వరించుకుంటే వజ్రాలు తాపిన డాలు, పదును తేరిన కత్తి పాణిగ్రహణం చేసినట్లు వుంటుంది. శత్రుకోటిని చవిచూచిన వీరఖడ్గానికి తేనె పూత పూసినట్లుంటుంది. కఠినమైన కరవాలానికి పరిమళాలు విరజిమ్మే పుష్పాలమర్చి, పుష్పాలతో చేసిన ఒరలా వుంటుంది. కఠినాతి కఠినం, మృదులాతి మృదులం, కలుసుకుంటే, సౌమ్యత జనిస్తుంది. మారుమాటాడక వీరిని వరించి సుఖపడు. ఏం ముఖం దాచుకున్నావు? సరేలే. చెల్లె, గేమగాని చేయించగలవా నీచేత నా వల్ల? నేనెంత మోజుపడితే ప్రయోజనం వుంది! ఈ భూవలయంలో యీయన వ్యాపారసంస్థలని దళంగాని, పట్టణాలుగాని లేవు. ప్రపంచానికంతటికీ ధనవంతుడని పేరెన్నికగన్నవాడు. రాజులకన్నా సైన్యాధికారులకన్నా యీయనకున్న సిరి ప్రబల బలవంతురాలు. ఈనాడు ప్రపంచంలో అది చేయలేని పని లేదు. సమస్త మానవులూ దీనిని సేకరించుకోవడం, నిలుపుకోవడమే జీవిత పరమావధిగా తలుస్తున్నారు. యీయనను వరించి ఎనలేని సౌఖ్యాన్ని గౌరవాన్ని సంపాదించు.

వ్యాపారి: మాబోటివారికి ఎంత ధనమున్నా గణనకు రాదు. ఎందుకంటే, అనాదినుంచి రాజులే ధనాఢ్యులని, లోకానికి ఒక గుడ్డి నమ్మకం. ఈ భూవలయాన్ని యేలిన రాజునైనా, వేలంవేస్తే సులువుగా కొనేయగలను. నా దగ్గర అప్పు తీసుకోని రాజులూ, ప్రభుత్వాలూ మచ్చుకైనా లేరు. మానుంచి ప్రజలకి ఎంతో సౌఖ్యం జరుగుతున్నది. ప్రతివారికి కావలసినవి, అక్కర్లేనివి, పరదేశాల్లో వున్నవి తీసుకొచ్చి, ప్రజల సౌఖ్యానికే పాటుపడుతున్నాం మేము. అయినా అన్నివర్గాల వారికీ మేమంటే కంటగింపు. ఎవరివృత్తి వారు చేసి, ధనమార్జించటం లేదూ! ఆరీతిగానే, మా వృత్తి మేం చేసి, మానుంచే తెలివితేటల్ని వినియోగించి, ధనాన్ని ఆర్జిస్తున్నాం. మమ్మల్ని మా ధనాన్ని చూసి, సహించక, అన్ని వర్గాలవారూ కూడా, మమ్మల్ని నిందిస్తారు. నిందించిన కొద్దీ సిరి

పట్టులచేసి కుటుంబరావు కుటుంబము నుద్ధరించి, నిలువఁబెట్టుట యను మహోదాత్త విషయము ప్రసిద్ధమైన యాశయముగ గలది యీ నాటకము. స్వభార్యను స్వీకరింపుమని యెంతమంది నయమునను, భయమునను జెప్పినను వినక, తిరస్కరించి, యన్యసుందరియను భ్రాంతితో నామెను వెంటాడి, యామెకొంగు తగిలిన బంగారమని యంగలార్చి యామెకొఱకు దాస్య మొనర్చిన కుటుంబరావును తిలకించిన వారికి చిఱునవ్వు పుట్టకుండ నెట్లుండగలదు. ఈ కథలో నాదినుండి చివరవరకు నీ హాస్యరస విషయము ప్రధానమై యంతర్వాహినిగా సాగుచుండును. ఇందలి హాస్యము వికృతాకార వాక్చేష్టలవలన జనించినది కాదు. ఆలంకారికులు సెలవిచ్చినట్లు. వాక్చమత్కారములఁ గూడ నా హాస్యము పుట్టలేదు. చిత్ర విచిత్ర సంఘటన లిందంతకుఁ బూర్వమే లేవు నవ్వు దెప్పించుటకు. మిశ్రభాషాప్రయోగమున నొక్కచోట మాత్రము హాస్యము గల్గినను, ప్రధాన హాస్య విషయమున నీ సాధన ముపయోగింపఁ బడ లేదు. ఇట్టి యిందలి హాస్యము చమత్కార కథా కల్పనా చాతుర్యమున ప్రాణము పోసికొనినది.

ప్రతాపరుద్రీయ నాటకమునకును వ్యామోహా నాటకమునకుఁ గొన్ని సామ్యములును, గొన్ని భేదములును గూడఁ గలవు. ప్రతాపరుద్రీయ నాటకమున రాజ్యభ్రష్టుఁడగు ప్రతాపరుద్ర మహారాజు నుద్ధరించుట మహోదారాశయము గాఁగా, వ్యామోహా నాటకమున కుటుంబభ్రష్టము గానున్న సుశీలా కుటుంబరావుల నుద్ధరించుట యను నవి పవిత్ర దారాశయమైనది. ప్రతాపరుద్రీయమున యుగంధర మంత్రి ప్రజ్ఞా విశేషము కాంక్షిత ఫలము సాధింపఁబడఁగా, వ్యామోహమున విద్యావంతురాలగు మిస్ పారిజాతము యొక్క బుద్ధివిశేషమువలన వాంఛిత ఫలప్రాప్తి సిద్ధించినది. ప్రతాపరుద్రీయమున సాధకుఁడగు మంత్రి యుగంధరుడు తన కార్యసాధనకొఱకు చివరకు వేషాంతరమున పిచ్చివాడుగ నటింపగా, వ్యామోహామున సాధకురాలగు మిస్ పారిజాతము, తన నానా రూప వేషములను నాయికయగు సుశీలకొసంగియు, చివరకు తురకబాబు వేషమును నటించెను. ప్రతాపరుద్రీయమున కార్యసాధన మహ్మదీయ రాజధాని ఢిల్లీ పట్టణమున జరుగగ, వ్యామోహామున కార్యసాధనము తమిళదేశమగు మద్రాసు పట్టణమున జరుగును. ప్రతాపరుద్రీయమున తెలుగు తురక పదములు మిశ్రితములై హాస్యము త్పాదింపఁగ, వ్యామోహామున తెలుగు తమిళపద మిశ్రమము హాస్యమును ఘటించినది. ప్రతాపరుద్రీయమున చాకలివానికి రాజా వేషము వేయింపగ, వ్యామోహామున పాచకస్త్రీకి విద్యావతి వేషము వేయింపఁబడినది. ఇంత సంబంధమున్న ని నాటకముల కర్తలు మాత్రము సంబంధము లేనివారగుదురా! తాతా మనుమల సంబంధము — పేరును నొకటే. వేదం వెంకటరాయ శాస్త్రిగార్లు.

ఇందలి కథ ప్రస్తుత కాలమునకు సంబంధించినది. పల్లెటూరిలో పుట్టి విద్యావిహీనయై నాగరకతాశూన్యయను మిషతో, చిన్నతనమున మేనమామకూతురగు సుశీల యను బాలికను పెండ్లి చేసికొనిన కుటుంబరావను యువకుఁడు బి. ఏ. ప్యాసయిన తర్వాత నామెను చేకొనక, చదువుకొనిన నారియొక యువతిని పెండ్లి చేసికొందునని యూహించిన విషయమును దెలిసికొని, బి. ఏ. ప్యాసయిన యామె (నాయిక) స్నేహితురాలగు పారిజాతమను నొక యువతి. యాతని పిచ్చికి దగిన చికిత్స చేయఁదలఁచి సుశీలకు తెలుసు తెలుసు ఫాషనులు చేయించి, నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్పించి, తన పేరామెకు మార్చి పెట్టి కుటుంబరావు పోయిన క్లబ్బుకే పంపించి, యాతనికి సుశీలయొక నూతన విద్యావతియను భ్రాంతి గల్గించి, నామెను ప్రేమింపఁజేసి, చివర కామెను రహస్యముగా నతఁడు లేవదీసికొనిపోయి చెన్నపట్టణములో రిజిష్టరు మ్యారేజి చేసుకొని సుఖముగా నుండఁజేయుట యిందలి కథ. ఈ తంత్రాంగములో పారిజాతమునకు సూర్యారావను కుటుంబరావు మిత్రుఁడు కూడ సాయపడును. (ఇది 15 రంగములుగల్గిన 80 పుటలుగల 1/8 క్రౌను సైజులో ప్రేటు పైప్మరు టైపులో ముద్రింపఁబడిన చిన్న గ్రంథము. కాని యిందలి దృశ్యకావ్యశిల్పమును, హాస్యమును దీని నొక గొప్ప గ్రంథముగాఁ జేసినవి.) ఇందు నాటకాంశములను పంచ సంధులు చక్కగ కుదిరినవి. కథ స్వకపోలకల్పితమయ్యు నెక్కడను కుంటుపడలేదు. ఇందలి సమస్యా పరిష్కారము సహజ క్లిష్టమైనదైనను నిందలి వాక్యములును, సంభాషణలును పూర్వాపర వ్యాఘాతములుగాక చక్కగ యౌచిత్యముతోఁ గూర్పఁబడి గ్రంథకర్త ప్రతిభానైపుణ్యములు వేనోళ్ల చాటుచున్నవనుటకు సందేహము లేదు.

ఇందు 13 వ రంగమును, 18 వ దృశ్యమును పరమ ముఖ్యములైనవి. మిగిలినవన్నియు కథానిర్వహణకు మాత్రము పనికి వచ్చునవియే. 15, 17 దృశ్యములు రెండును తమిళ తెలుగు భాషా మిశ్రమము వలనఁ గూర్పఁబడిన హాస్య రంగములు. ఇందలి 13 వ రంగమున గర్భసంధియు 18 వ రంగమున నవమర్శ నిర్వహణ సంధులును నిర్వహింపఁబడినవి. ఇందు రెండవ రంగమున సుశీల తండ్రి సుబ్బయ్యగారి మిత్రుఁడగు రామయ్య కుటుంబరావును సుశీలను గ్రహింపుమని ప్రార్థించి విఫలుడగుట ముఖసంధిగా నిలచినది. ఏడవ రంగమున పారిజాతము సుశీలకు తన వేషమును వేయించి క్లబ్బుకు పంపి కుటుంబరావును మోహింపఁజేయుట ప్రతిముఖ సంధి యగును. అవమర్శసంధి చివర యద్భుతరసము, యథార్థమంతయు బయలుపడుటవలన నాయకుఁడగు కుటుంబరావు మూలమున ప్రతిపాదింపఁబడెను.

ఇందులో 13 వ దృశ్యములో నాటక చమత్కార శిల్పమును, సంగమాలమున గొప్ప హాస్యమంతర్వాహినిగా సాగుచుండ నిర్వహింపఁబడినవి. పారిజాత సూర్యారావుల ప్రయత్న మూలమున సుశీలా కుటుంబరావులు పార్కులో నొక చెట్టుక్రిందఁ గూర్చొని, పారిజాతమును భ్రాంతితో నామెతోఁ కుటుంబరావు ప్రణయ సంభాషణమును గావించుటయు, సుశీలను నిందించుటయు జరుగును. ఇందు చక్కని పతాకస్థానము (Dramatic Irony) లు దొర్లి యుత్తమ నాటక శిల్పముగా రూపొంది, కథా పరిణామమునకు చక్కగ తోడ్పడినవి.

కుటుంబరావు ప్రత్యక్షముగా సుశీల ప్రక్కనే కూర్చుండి మాట్లాడుచు "ఆ అమ్మాయిని (సుశీలని) ఇక ఎంతమాత్రం దగ్గర చేర్చుకోలేదు. ఆ వీధినే వెళ్ళను! అటు కన్నెత్తి చూడను" అని సుశీలతో చెప్పుచుండగా, సుశీల కేకొక చూచె, ప్రే

కుల కొంత నవ్వుపుట్టించును. సుశీల కుటుంబరావుతో "సుశీల ఫేస్ గా ఉందండి. నాలాగే ఉంటుంది చాలావరకు. దూరంలో నుంచి చూస్తే నేనేనని అనుకుంటుంటారు వాళ్ళు నాన్న మీద పోతే" (పుట 47) అని పలుకుటమూలమున చాలా చమత్కరింపబడినది. చిట్టచివరకు రామస్వామి కుటుంబరావుతో 'నా మేనకోడలు సుశీలయే' యని చెప్పినపుడు కుటుంబరావు మాటలు జ్ఞాపకము చేసికొని "ఆం, అన్నాను కాదూ, వాళ్ళిద్దరూ ఇంచుమించు ఒకేలా గుంటారని" (పుట 76) అని సమాధానపర్చుకొనినాడు. ఈ సన్నివేశ మొక 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' (Comedy of Errors) వలె తయారైనది. విజయవిలాసములో తాపసవేషములో నున్న అర్జునుడు ద్వారకలో సుభద్రతో మాట్లాడుచుండ నామె యాతని నర్జును నెక్కడ కంటిరని యడుగగా నతడు

"ఏమని చెప్పవచ్చు నొకయించుక భేదము లేక యాయనే
మేమయి యున్నవారలము సుమీ, వికచాంబుజపత్రలోచనా."
(విజయ II, 16[illegible].)

అను రీతి సన్నివేశము తయారైనది ఈ నాటకమున. సుశీల పైమాటలను బట్టి, ఆమాటలు విన్నతర్వాతగూడ కుటుంబరావు తనభార్యను గూర్చి సుశీలతో నే "నాకు నమ్మకంలేదు. మీరెక్కడ, అదెక్కడండీ! నా స్త్రీమకి కొంతేరం. ఈ ఎడ్యుకేషను, ఈ పాలిషు, స్టైలు, ఆ రెడ్డి, ఎన్లైటెన్మెంటు వస్తాయా? అకడమిక్ క్వాలిఫికేషన్, ఎక్స్పీరియన్స్ వీటితో సమానమా?" (పుట 47) అని యనుట వినుటంతెగా రసజ్ఞుడైనను నవ్వాపుకొనలేక యీ సన్నివేశ సంఘావవిధానమునకు ముగ్ధుడైపోవును. ఇదియే యీ నాటకమందలి యుత్తమమైన హాస్యమును గల్పించు కారణము. ఈ సన్నివేశమందలి సంభాషణము బహుజాగ్రత్తగా నిర్వహింపబడినది. సుశీల ప్రత్యక్షముగా తనభర్తను తన్ను పరిత్యజించు విషయమై యడుగదలచు కానిన సందేహనివారణ ప్రశ్నలన్నియు నడుగుటకు మంచి యవకాశము గల్గినది. కాని పరస్త్రీని తనభర్త ప్రేమించినాడని తెలిసికొనినపుడు సామాన్యముగా స్త్రీలందరు పొందు నసూయా ద్వేషములుగాని, భర్తలు దూషింపదలచు నుద్రేకముగాని పొందక, బహుజాగ్రత్తగా నెమ్మదిగ నుండి యాతని పూర్వపు భార్యయగు సుశీలపై దయాదాక్షిణ్యములు గల దానివలె ప్రవర్తించి యాతని మెప్పునుగూడ సంపాదించుకొనును. ఈ జాలి నన్నుగూర్చియనే యంట యొంతయు నుచితముగనే యుండును. అల్పభేదము సాదృశ్యమున నున్నను, ఈ సన్నివేశము భాసకృత స్వప్నవాసవదత్త నాటకమందు, తలనిండ ముసుగు పెట్టుకొని పరుండిన వత్సరాజును శిరోవేదనభారము నుపశమించు పద్మావతి యను భ్రాంతితో, నాతని శయ్యపై పరుండిన వాసవదత్త, రాజాకు చరింతలను విను సన్నివేశముతోడను, ఉత్తరరామచరిత్రమునందలి ఛాయాంకమున శ్రీరాముడు సీతకై పడు పరివేదనమును సీత చాటునుండి విను సన్నివేశముతోడను పోల్చదగినది. ఆ రెండు నాటకములందు పూర్వభార్యపై నాయకుల కభిమాన ముండగ, నీ వ్యామోహ నాటకమున పూర్వభార్యపై తిరస్కారము జూపును నాయకుడు. ఇంతే భేదము. ఈ మూడు నాటకములందుగూడ నాయకులకు యథార్థము దెలియక పోయినను నాయికలు మాత్రము ప్రత్యక్షముగా ప్రక్కనే యుండ నాయకుని యవస్థను చూచుచుందురు. ఇదియే వానిలోగల సాదృశ్యము. ఈ వ్యామోహ నాటకమున పూర్వభార్యయే దాగుట వగయు విచిత్రముగ నుండును. అట్లయ్యు నాటకతంత్రము చెడగొట్టకుండ ప్రథమభార్యను పరిత్యజించి కుటుంబరావు తన్ను వివాహమాడ దలచుట యధర్మమని సుకుమారముగా యాతనితో వాదించుచు, "తాను కుటుంబరావును వివాహమాడుట తన స్నేహితురాలైన కార్యము చేయుటయే యగునియు, నట్టి యధర్మము నతనిచే జేసికొనకుండ జేసినతర్వాత తిరిగి ఆమెముఖము మెల్లగ చూడగలననియు, చదువుకొనిన యాడవాళ్ళందరు నిలాగ చెయ్యగలరను నిందపాలు కానా" యనియు, సుశీల కుటుంబరావుతో వాదించి, యాతని గౌరవాదరములను సంపాదింపగల్గును. ఇందుచే నీ సన్నివేశము బహు ప్రసన్నమును, చమత్కారముగను, రసవంతముగను, హాస్యరసకరముగ నుండి, హాస్యపోషణముగూడ నాటకీయముగ నిర్వహింపబడినది. ఈ నాటకములో విశేష మిది. చూడండి కుటుంబరావు సుశీలతో నేమనుచున్నాడో:

కుటుంబరావు: 'నీవు నే ననుకొన్నదానికంటె కూడా చాల ఉత్తమురాలివి. నీలో ఇన్ని సుగుణాలున్నవని గ్రహింపలేక పోయినాను. నీ మాటలు వినేకొద్దీ నాకు నీమీద గౌరవం ఎక్కువవుతూ వుంది. నీవంటి సుగుణరత్నాన్ని సంపాదించుకోవడానికి నేను ఏ పాపమున్నా చేస్తాను. ఎంత అధర్మమున్నా చేస్తాను. నా భార్యతో నాకు స్నేహమే లేదు. పరిచయమే లేదు. నీ వెంత చెప్పినా అటువైపు నామనస్సు తిరగదు. నీవే నా దేవతవు. ఏమైనా సరే. నా ప్రార్థన కాలితో త్రోసివేస్తావా?... నీలో తప్పులేదు, నాదే తప్పు... నాకుమాత్రం నీవు కావాలి." అను మాటలు ప్రేక్షకులు ఒకచెవితో విని హాస్యమును, మరియొక చెవితో విని జాలియు పొందుదురు. సుశీలకూడ నాతనిమాటలు విని, ఒకవైపునుండి కోపహాస్యములును, మరియొకవైపునుండ లజ్జయు పొందగలదు. ఇదియే ఈ నాటకమున ముఖ్యమైన చమత్కారము. సుశీలగూడ లోలోపల నవ్వుకొనక యుండలేదు, ప్రేక్షకులవలె. మరియొకవైపు జాలియు పొందకుండ యుండలేదు. హైందవ యుత్తరరామచరిత్ర, స్వప్నవాసవదత్తలోని సన్నివేశములలో నాయకుని కొరకే నాయికలు జాలిపొందలేదా అనే యొక్కటెను. కాని ఇక్కడ కథలో నొక విశేషము. పై రెండు నాటకములలో నాయిక చనిపోయినదని నాయకుని భ్రాంతి. వ్యామోహ నాటకములో పూర్వభార్య వేరని భ్రాంతి. కుటుంబరావునకు పూర్వపు భార్యయు, ప్రస్తుతము ప్రేమించుభార్యయు నొకతెయగుటచే పై నుదాహరించిన కుటుంబరావు వాక్యములకు రెండువిధములైన భావములు ప్రేక్షకులకును. నాయికకును గల్గుటకవకాశము గలిగె ఈ నాటకమున. ఇదియే ఇందలి ముఖ్యచమత్కారము. ఇదే యీ నాటకమున నుత్తమమైన హాస్యమును పుట్టించుటకు ప్రధానకారణమైనది. పై కుటుంబరావు వాక్యములే నాటకమున పతాకస్థానములు (Dramatic irony)గా పరిణమించి విగళితవేద్యాంతరత్వమును గల్గించుచున్నవి ప్రేక్షకులకు. చివరకు సుశీలకు కుటుంబరావుతో "మీరు చెయ్యడం అధర్మమని మీరే ఒప్పుకొంటున్నారు. కాబట్టి తమ అధర్మాన్ని ఒప్పుకోవడమే సగం మార్గానికి రావడం.

మీ భార్య మీ వద్దకు వచ్చి మీరు ఆవిడను గ్రహించే పక్షంలో నేను మార్గం చూస్తాను. నా స్నేహితురాలి కోసం త్యాగం చేస్తున్నాను. మీ రిద్దరు ఒకటి కావటానికోసమే నేను మిమ్మల్ని వివాహం చేసుకొంటాను. మీరు ఒక కుటుంబం అయిన తరువాత మీ నిమిత్తం పారిజాతం మిమ్మల్ని వదలి ఆశ్రమస్వీకారం చేస్తుంది." అను మాటలలో ఎంతైనా వ్యంగ్యమున్నది. పై వాక్యములలో "మీ రిద్దరు ఒకటి కావటానికి......" అనుటకు బదులుగా "మీ మిద్దరము ఒకటి కావటానికోసమే నేను మిమ్మల్ని వివాహం చేసుకొంటాను." అని వ్యంగ్యార్థము ప్రేక్షకులకు స్ఫురించి మరల నవ్వకుండ నుండలేరు. ఈ విధముగా ప్రసన్నముగా, ప్రశాంతముగా కుటుంబరావుతో నిద్దరి భార్యలకు సంధి (రాజీ) కుదిరింది. ఇదియే యీ నాటకములోని గొప్ప చమత్కారము. మఱియొక విషయము. కుటుంబరావు మాటలవలన గలుగు ద్వివిధభావములు సుశీలకు స్ఫురించినట్లుగా, సుశీల వాక్యములలో గల వ్యంగ్యము కుటుంబరావుకు దోచదు. ఏలన కుటుంబరావు పూర్వపు భార్యయు, ప్రస్తుతపు ప్రేయసియు నొకతేయను తంత్రాంగము సుశీలకును ప్రేక్షకులకును దెలిసినట్లుగా కుటుంబరావునకు దెలియకపోవుటే. ఇదుచేతనే 18వ దృశ్యమున చివరకు కుటుంబరావు తబ్బిబ్బుపడిపోవును. అక్కడకు (Comedy of Errors) వలెను, కళాపూర్ణోదయమందలి నిజరంభా మాయారంభలవలెను, మరియొక సన్నివేశము జరుగును. కాని కళాపూర్ణోదయమునను, షేక్స్పియరు రచించిన కామెడి ఆఫ్ ఎర్రర్స్‌లోను మాయారంభ సత్యరంభలిద్దరును, రూపసాదృశ్యముగల సోదరు లిరువురు నుండిరి. కాని వ్యామోహ నాటకమున నా విధమైన కలత, చీకాకు పడనక్కర లేకుండ, నిద్దరు నాయికలు నొకరియందే సంపర్భపడుదురు. ఇందుచేతనే యీ నాటకము స్వప్నవాసవదత్త ఉత్తరరామచరిత్ర లందలి చమత్కారమును, కళాపూర్ణోదయము కామెడీ ఆఫ్ ఎర్రర్స్ లందలి చమత్కారము నుపయోగించి, వానియందుగల మాయలను, చికాకు కలతలు నిందులేకుండ ప్రసన్నముగ భాసించినవి. ఇది మరియొక విశేషము.

ఈ నాటకము చివరరంగము ప్రారంభమున రామయ్య మద్రాసు చింతాద్రిపేటలో నున్న సుశీలా కుటుంబరావుల యింటికు వచ్చుటతో నాటకకథ నిర్వహణముఖమును పెట్టి అంత్యముందయోగముగా నడిచినదుచు వచ్చినది. సంవర్భానుకూలముగా, సర్వము నెరిగిన రామయ్యగూడ కుటుంబరావుతో "నువ్వు ప్రబుద్ధుడివి గనక పెండ్లాండా అల్లమహాబలం వెంకట్రావుగారి కూతుర పారిజాతాన్ని లేవదీసికొని చక్కా వచ్చావు." అని పరిహాసపూర్వకముగా ఎత్తిపొడుస్తాడు. ఇది యెంతయు చమత్కారముగా విరసములో సరసము సాగినదైనది. అంతటితో చాలక రామయ్య "అల్లాడి పోతున్నాడు వెంకట్రావు. పాపం పెద్దవాడు. మింగా లేదు, కన్నూ లేదు. నాతోనే వచ్చాడు. హోటల్లో ఉన్నాడు. సాయంత్రం పిలుచుకొస్తానుగా ఇక్కడికి." అని దబాయించి కుటుంబరావును భయపెట్టి, తన్ను పూర్వ మేడిపించినందుకు కసి తీర్చుకొనుటలో యనువల్లతిని నేడిపించును. చెన్నపట్టణములో కుటుంబరావును కలుసుకొనుటకు గొంగదారిగా చేసిన యీ యుపక్రమణ. హాస్యములో హాస్యముగా నున్నది. కుటుంబరావును లొంగదీసుకొని వచ్చుటకిది యొక పై యెత్తు. అంత కుటుంబరావు సుశీల యుపదేశించినరీతిగా "నేను నా సొంత భార్యతో కాపురము చేస్తున్నానుగాని, ఎవరినిగాని వాళ్ళ యిష్టంలేకుండా, బలాత్కారంగా లేవదీసికొని రాలేదు. భగవత్ప్రీతిగా నేను ప్రేమించిన కన్యను వివాహమాడి సుఖజీవనం జరుపుతున్నాను. నాలో ఏ దోషమున్నూ లేదు. ఐతే సివిల్ రెజిస్ట్రేషను మ్యారేజి చేసుకున్నాము." అని వాంఛికముగా చెప్పిన జవాబులో పతాకస్థానము (Dramatic Irony) ధ్వనించుచున్నది. తర్వాత మ్యారేజి సర్టిఫికేటులో 'సుశీల' యని యుండుటను చూచి 'మా సుశీలేనా' అని లోపలికిపోయి యామెను చూచి పలకరించి కుటుంబరావుకు విస్మయము గలిగించును. ఇక్కడ యద్భుతరసమునకు తావునోసకినది. రామయ్య యేమియు నెరగనివానివలె "నేను ఈ మధ్య సుబయ్యాగారింటికి వెళ్ళలేదు. వెళ్ళింటే ఈ అమ్మాయి అక్కడ నాకు కనిపించి ఉండదు. నిజం తెలిసేది. అంచేతే గావును సుబ్బయ్య ఖంగారేమీ లేకుండా హాయిగా ఉన్నాడు. లేకపోతే కబురంపి ఉండేవాడు" అని అబద్ధమునుగూడ నిజమువలె మాటాడినాడు. ఇదంతా చూచి కుటుంబరావుకు విస్మయముతో రామయ్యకు మతిపోయిందని చెప్పసాగినాడు. యథార్థముగ కొతనికే మతిభ్రాంతి గల్గినది. తర్వాత వెంటనే పారిజాతము కుటుంబరావింటికి వచ్చి సుశీల తన స్నేహితురాలని చెప్పగా నతడు బిత్తరపోయి, "వాటీజ్ దిస్. నేను నిద్రపోతున్నానా, మేలుకొన్నానా? పారిజాతం కాదు సుశీల అంటాడు రామయ్య. ఈ మెవరో వచ్చి తానే మిస్. పారిజాతం. బి. ఎ. అని అంటుంది. వీళ్ళ మాటల ధోరణిచూస్తే అలాగే ఉంది. రెజిస్ట్రారాఫీసులోను, తన పేరు సుశీల నే యిచ్చింది. నన్నే మన్నా వెళాకోళం పట్టిస్తున్నదా, లేకపోతే ఇద్దరి పేర్లూ ఒకటేనా." అని కుటుంబరావాశ్చర్యపడును. ఈ యద్భుతరసమువనర్గసంధిలో చక్కగ కుదిరిపోయినది హాస్యనాటకలక్షణముగా సమన్వయింపబడినది. మరియు, కుటుంబరావు "ఇదేమిటో, ఇదంతా నా కేమి అర్థం కావడంలేదు" అంటాడు. అందులకు రామయ్య "అవున్నవుగా, నాకు మతిపోయింది, చిత్తచాంచల్యం, అని ఇందాకా అదే, ఆ బాపతే" అని మాట ఒప్పగించును. ఇంతలో సుబ్బయ్య వచ్చి యాశ్చర్యరసమును పూర్తిచేయును. అప్పుడు పారిజాతము సుబ్బయ్యతో "నేనిక్కడనే మద్రాసులో ఉన్నాను మామయ్యా, నా జాబులు మా నాన్నకి రెండుమూడు చేరలేదు. అంచేత ఖంగారు పడ్డట్టున్నారు." అని సమర్థించి జవాబు చెప్పును. అప్పుడు కుటుంబరావు తనలో "ఈ విడ మిస్. పారిజాతం. నేనిన్నాళ్ళు పారిజాత మనుకుంటూవచ్చిన నా భార్య సుశీలే" అనుకొని (Comedy of Errors) లాగాను, కళాపూర్ణోదయములో మాయారంభా, సత్యరంభల స్థితివలెను భావిస్తాడు. కాని యిక్కడ యొక్కటే రూపములో నిద్దరు వ్యక్తులు లేరు కాని, యొకటే వ్యక్తి రెండుపేర్లతో వ్యవహరించినది. అందులో నొకపేరు గలవ్యక్తి మరియొకరుగూడ నుండుటచే నిద్దరు వ్యక్తులు గూడ తయారైనారనే చెప్పవచ్చును. ఇది యీ నాటక

మందలి శిల్పచాతుర్యము. తర్వాత కుటుంబరావు ప్రకాశముగా, "అయ్యా, రామయ్యగారూ, ఇదంతా ఏమిటండీ. నాకేమీ అర్థం కావటం లేదు. మీరంతా మాట్లాడుకొని వచ్చి నా యింట్లో గల్లంతు చేస్తున్నారు. వాస్తవం చెప్తారా, లేదా?" అని ప్రశ్నముగా నడుగును. ఉక్కిరిబిక్కిరియగును. అప్పుడు రామయ్య "నీకు కావలసిన వస్తువు నీద ఉంది ...... అసలు వస్తువు నే పేరు మార్చి అమ్మే వర్తకుల్లాగ, నీ గృహలక్ష్మినే నీకు చూపించాము. నీకు పూర్తిగా నచ్చింది. పరిగ్రహించావు ...... ఏ పేరుతో వ్యవహరిస్తే నేమి" అని సమాధాన పరచినాడు. అంగులకు కుటుంబరావు సంతోషముతో "అదా సంగతి. ఫలమేమో ఉత్తమమేకాని, నేను మాత్రం పట్టె అపాత్రుణ్ణి. చేతులో వెన్న బెట్టుకొని నేతికి ముష్టి కెళ్ళాను" అని యనును.

ఇట్లే కళాపూర్ణోదయమున మణికంధరుని ప్రేమించిన కలభాషిణి శారదాశాప భయంబున నాతని పొందలేక, నలకూబరుని కొఱకు దాను నా యారంభ రూపమును పొంది, మాయానలకూబర వేషమున నున్న మణికంధరునే పొంది, చివరకు సత్యమును గుర్తించి,

శాపభయంబున నెఱుఁగఁగ
నీ పైకోరిక మరల్చి ధనపతి సుతు నే
పాపపువేళను జూచితి
నోపయి సొబగేను నతి కనుంగొనకుతిగాన్.
ఆ యుత్తీ తెఱయుఁ జెని ని
న్నే యేఁ బొందితిఁ దుదన్ వనిన్ మన భాగ్య
శ్రీ యేమని చెప్పుదు బహు
కోయినఁబూఁబొన్నునఁబను బోలికయయ్యెన్.

అనెను స్థితికి కుటుంబరావు కూడా వచ్చినాఁడు. చివరకు కుటుంబరావు నీతిపాఠముగా "వస్తుతత్త్వం తెలియక లోకంలో నాలాంటి మూర్ఖులు ఎందరు మోసపోతున్నారో, అందరికీ నీలాంటి సుశీల దొరకదు. రొట్టెవిరిగి నేతిలో పడింది" అని యనును.

కొంచె మెక్కువ తక్కువగా నిటి పన్నిదేశము నె షేక్స్పియరు దిన వింటర్సు టేల్ (Winters Tale) అను నాటకమున నాయకుఁడగు రాజు తన భార్యయగు హర్మియోని దోషారోపణము చేసి యరణ్యములలోఁ దిగవిడువ మంత్రికి నాజ్ఞాపించి, కొన్ని సంవత్సరములైన పిదప సత్యమెరిగి యామెకొరకై పశ్చాత్తాపమును జెంది విలపించును. సాధార్థమునకు మంత్రి యామె నరణ్యములో వదలక రహస్యముగా తన యొద్దనే కాపాడు చుండి, రాజు పశ్చాత్తాపమును విలాపమును గ్రహించి, జాలిచెంది రాణి ప్రతిమయను పేరితో నామెను నిశ్చలముగా నిలవఁబెట్టి రాజునకుఁ జూపి, యామె ప్రతిమను తాకవద్దని చెప్పి, రాజును కొంతసేపు వ్యాకులపెట్టి చివరకు వారిద్దరను గలుపును. ఇందు కూడ కొంత చమత్కారము చేయఁబడినది.

వ్యామోహ నాటకమునఁ బైనఁ జూపిన చమత్కారము తక్కని హాస్యమునకు నిదర్శనము ఇందు ముఖ్యరకమునకుఁ జెందిన హాస్యము గూడ ప్రతిపాదింపఁబడినది. రైలుసేవను వద్ద తమాష గాలీల సంకరభాషతోఁ జరిగిన సంభాషణ మొకటి. రెండవది కుటుంబరావు గృహము ముందు వేలను నౌకరు రామయ్యను పరిహాసము చేయు 17వ దృశ్యము.

రామయ్య : కుటుంబరావుగారుండడం ఇక్కడే నా!

వేలు : ఇక్కడె అట్టాంటివాళ్ళు ఒకరూ లేరండి.

రాము : ఈ ఇంట్లో ఆంధ్రులున్నారని ఆ అయ్యగారన్నారే. అల్లా ఆ కాఫీహోటలాయన.

వేలు : అది యేమి పితలాటమో, ఇక్కడంతా తెలుగు వాళ్ళుదా, ఆంధ్రవాళ్ళు లేదండి.

రాము : ఏమిటోయి ఆంధ్రులు వేరూ, తెలుగువాళ్ళు వేరూనా?..............అయితే ఈ యింట్లో ఎవరున్నారు. మొగళ్ళుంటే కాస్త పిలూ.

వేలు : మొగవాళ్ళా? నీకు కావలె. నేను మొగవాడుదా. బాగా చూడుమీ...... ఒకరు లేరు సామి. అంతా బయటపోయి ఉండారు. నేను కావలి ఉండాను.

రాము : కావలి ఉండావా! బిచ్చగుంటలేవా? అయ్యర్లు సాధారణంగా అబద్దాలాడరే.

వేలు : సర్దా, తెల్లవారితే ఆ అయ్యరు అబద్దాలు తప్పితే ఇంకోటి చెప్పదిలేదు. ఆయన ఒళ్ళంతా అబద్దాలండి...... అరె పోయ్యా నువ్వు నన్ను ఎగతాళి చేస్తావు. అదుగో తిరిగి చూడు నీవెనకాల నవ్వుతాడు.

ఈ సంభాషణలో తగు రీతి హాస్యమున్నది. కాని, "కావలి ఉండావా! బిచ్చగుంటలేవా" అని హాస్యము చేయుటూనఁట మాత్రము తప్పుగా నున్నది. ఇక్కడె నవ్వుపుటంగు. వేలు చేసే హాస్యమే మేలుగా నున్నది రాముడు చేసిన హాస్యము కంటె. 4వ దృశ్యములో కుటుంబరావు సూర్యారావుతో సుశీలను గూర్చి "ఆ పిల్ల ఇప్పటికి సూర్యాలోకనం చెయ్యలేదని రామయ్యే అన్నాడు." అని చెప్పగా సూర్యారావు "దానికి సూర్యాలోకనం ఉందో లేదో కాని, నీకు మాత్రం దాని అలోకనం దానికి మాత్రం నీ లోకమేనని విన్నాను" అనును. ఇందులో "ఆలోకన" "లోక" శబ్దాలమీద చమత్కరింపఁబడినది. ఈ హాస్యము బలవంతముగాఁ గూర్పఁబడినట్లున్నను కొంతవఱకు ఫరవాలేదు.

పానుగంటి లక్ష్మీనరసింహముగారి కంఠాభరణ నాటకము హాస్యరసమయముగనే యున్నది. కాని దానిలోఁ గొన్ని యసందర్భములు, తికమకలు, వెక్కిరింపులు నున్నవి. వ్యామోహ నాటకమున నట్టివి లేక సరసముగా సరళముగా సంఘటన లున్నవి. దీనిలో నున్న భాష యాంగ్లాంధ్రమిశ్రమముగా నుండుట కళంకముగా దోఁచును. ఈ నాటకములో ముఖ్యమైన విషయము మాంగ్లభాషా పరిచయ వ్యామోహమే కనుక యది యుండుట యుచితమే యగును సందర్భమును బట్టి. కాని కన్యాశుల్కమునందు వలె నాంధ్రాంగ్లశబ్ద సాంకర్యముచే హాస్యరసమును ప్రతిపాదింప బూనుకొనలేదీ నాటకకర్త. ఇందుచే నది సహింపఁదగినదే. సూర్యారావును, రామయ్యయుపారి జాతిము పన్నిన తంత్రములో వారివాక్యములు హాస్యరస ప్రతిపాదకములేయైనవి. ఇవి కుటుంబరావునకు విస్మయము గల్గించి, యద్భుతరసమును పోషించునవైనవి కూడ. ఈ నాటకము మోదాంతనాటక (Comedy) మనఁదగును గాని ప్రహసన (Farce) మనఁగూడదు. ఆంధ్ర నాటక కళాపరిషత్తువారు సాంఘిక నాటకము కావలెనని కలల ఫలితమని దీనిని చెప్పవచ్చును.

ఇదే మనికి కామని—
కాముని కోలాహలము;
ఇదే ఉనికి కోమల
జంతరంగాళిరవము;
ఈ మధుమాసమ్మె—యెద ఎ
సందుల నెల విందు;
వంపు చెలియ మధురాధర
రాగ రేఖ కందు;
ఇదే ఋతువు మదీయ గాన
హృది పొంగించేదీ;
ఇదే ఋతువు పికస్వామి
ఎద కదలించేదీ!

చాతకం :

నీల విలయకాల మిప్పుడే తొలగెనా ?
చల్లతనముపోయి—ఉల్లమార్చు ?
ఇది వసంత ఋతువు ఏగుదెంచెను పోలు.
నాదు హృదికి సమరనాద మగుచు!
చటుల సీహార హార సంచయము క్రేల—
గగన గళసీమలో తారకాళి వెలసె—
జలద మాలిక లలవోక చదల కదల—
వెతల పోకార్చు నవతటిల్లతలు మెరసి!
దేహ మడలించుకొనను నందేహ వార్థి
గళము వికసించబోదు మంగళము రాదు;
శ్రావ సమూహములు రేగె; ధాత్రి రగిలె—
పికగళమ్ముల కాహళుల్ పెచ్చురేగె!
విలయ మిదియె, నృత్యవిన్యాస మిద్దియే—
చలన మణచు క్రూరసమయ మిదియె!
కొండగుహాంతరాల కొనప్రాణములైన
నిల్పుకొందు సృష్టినియతి కలిగి !!

పికస్వామి :

మన బ్రతుకుల కిది హోలీ !
మన తలపుల కిది మోళీ !!
వలపుల తొలకరి పాటలు...
చెలిమి మిటారపు తోటలు;
కోరిక తలిరాకు విందు—నేడే నాకు;
భారములు తొలంగు హాయి నేడే నీకు !

మరంద మవిరళ ధారా—
స్నపిత స్వాదు విహారీ !
రావె సఖీ—మధుపాయీ;
వాసంత సురభిళము తేవె!
రావె సఖీ—మధుపాయీ!
మత్తస్వాంత చకోరీ !!

వికచ గళద్గళ సన్నాదమ్ముల—
ప్రకట మధుక్వణ విన్యాసమ్ముల—
నను పాలించవె మనోహారీ!
విగళిత గళ మధుంహారీ!
విచలిత హృదుల మనోజ మనస్వీ;
ప్రసరిత కోమల గాన సరస్వతి!
కొసరి కొసరి కోరిక సత్తావులు—
విసరి విసరి వినిపించిన నవ్వులు;
ఎలమావులు చివురించిన గుసగుస
లేనాగా ప్రియులారా రావే!
మన తలపుల కిదె మోళీ!
మన బ్రతుకుల కిదె హోలీ!!

ప్రసవమంజరి :

మధుర మధుర మరందాల—నిషజే జేజే!
విధుల విషాదాలగాద్ను—లెపుడూ రావే!
మసృణ మధుఝరీ—రావె!
విసృత శుభకరీ—తేవె!
రావె, రావె — మధుకరీ!
తేవె, తేవె — శుభకరీ!
వలపుల తొందరల మనసు—దోబూచులాడెనో?
తలపుల ఒత్తిడితో మెరుమై రేయము మరగెనో?
కొండగాలి ఈదురులో—దురుసుతనం హెచ్చెనే!
చేడియ మోదుగనీడల—రాగరసము పంచెనే!
రావె, రావె — ప్రియంకరీ!
తేవె, తేవె-శుభంకరీ!!

మధువ్రతం :

చల్లని తెల్ల వెన్నెల సోకెను ప్రణయారాధ మై-
పల్లవపాణులు హారతులిచ్చిరి ప్రసవస్తబకములన్!
మత్తువాసనల నెగజిమ్మినదే రాధామాధ్వికము-
కుత్తుకనిండా తేనె పోసినది కోమలి ఝుంబనము;

చలిత సరోవర తరంగములు ముద్దిడెను పంకజములు—
మలయ పవన విచుల చెంగలించెను మృగమద పంకములు;
కలనాదమ్ముల ఎలనాగలతో తోట మొకలె పులకించెన్.
విలసంతిల క్రొవ్విరులమరిపములు తరిమెను సురభిళముల్.

గులాబీ :

దక్షిణపుగాలి తో తెంచి తగుల ధృతుల
చిక్కు విడదీసి ముస్తాబు చేయుచుండె;
కాని యిపుడేల నా హృదయాన భీతి
క్రమ్ముకొనుచుండె పెనుపిపాదమ్ము భతి!
ఎవరో గుసగుస లేవో
ముసిమినలెన్ తోచి, ముగ్ధమోహన కాంతుల్
విదళించుచున్న రీతిగ
చెదరెను భవితవ్య ధులు చేతన కాంక్షల్!
అదె మనోహరమార్దవ హాసరేఖ,
అదియె హేమంత కామినీ హృదయసీమ;
అదియె మృగశీర్ష సౌమ్యసంపద కవాట
హాటకమ్మది శృంగార నాటకమ్ము!

కవి :

మారలు నవవసంత మదే —
అగుపడెం చెరి!
తగాలు విగులు కన్ను లెత్తి—
మరులు గొల్పెనే!
ఓహో రండు పథికులార—
అహో రండు భ్రమరములార
రహో వనాంతర సీమల
సుహాసములు చేకొండు!
క్రతమ్ముద వీడి పిలిచె
పికి వివ్వనములు!
సుధాకరుడు నవోత్పలిని
కపోలముల గీరెన్!
లోకము నవ్యాలోకవ
రసకావ్యమ్మాయెన్!
తరుణీ హృదయోద్యానము
కగ్గా పుతమాయెన్.
తేరలు, అచ్చరలు—పుడమికి
పరువు లెత్తినారో?
నగలు విరహాలాపాలు—కడ
తేర్చి నవ్వినారో!
సకల జగజ్జీవులార—
వికల హృదయ మేల, లెండు!
అదే మదను డవతరించె
నోహో విరులార రండు!

పలిత ప్రతి :

చిరతరానంద సుఖమయ స్నేహవీచి
శిశిరమే నాకు హృదయ వాంఛిత ముచితము!
మాఘ ఫాల్గుణ మాస సంజనితహాస
మృగల శృంగార తల్పమ్ము మిథునములకు!,
నాకు ముక్తి నొసగి, చేకూర్చె సౌఖ్యమ్ము
బాధలేని బ్రతుకు బాట లొసగి;
నావ రీతి జీవనానంద యాత్రలో
మనసు వెలుగ జేయు మమత తేఁది!

మయూరి :

వసంత విలాస హేలీ—
హసంత వికాస వల్లీ!
హసన్ముఖాల కోకిలీ—
సన్మరీచి రింఛోలీ!
పులకిత హృదయ విభావరీ—
చలత్ చలిత మానసభ్రమరీ!
రండు, రండు—శారి, కీర!
తెండు విలసిత సుమాళిన్.
విధుగ విలాసము వలగు లెండు!
మధుమాస వికాస సురాళిన్.

మాకందం :

ఇదె వసంత మిదే సుఖాంత
విపుల హాస సుమసమ్!
ఇదే స్వప్న మిదే స్వర్గ
సుఖాస్వాద సమరమ్!
ఇదె వసంత మిదె స్వాగంగ
క్వణిత హాస రాగమ్;
ఇదె ప్రమోద మిదె వినోద
మిదె మరంద నాట్యమ్!
ఇదె గోకుల బృందావన
మిదే ప్రణయ రాజ్యమ్!

ఇదె రాధాకథూళి హృద
యోత్సవ నవ తేజమ్!
ఇదె రసాల మిదె సుమాళ
మిదె మరంద సారమ్;
ఇదె మయూర మిదె చకోర
మిదె ధరణి లాస్యమ్!

మాధవి :

వికాసిత వసంత తరుణ యామినీ —
చుంబిత పుంకిత రాగ తరంగిణి!
విపుల పరిమళ భాస తటిన్స్మ్రణి —
శుభ్ర విహాయస వీథీ విహారిణి!
నేటి రేయి రావోయీ, సఖా—మధుకరా!
రాగరసము చిందితి నోయీ—శుభంకరా!
తోట విడిది క్రీనీడలో కైసేసితిరా —
పాటల గంధిని యొయ్యారము దాచితిరా!

రాగలత :

ఈ మునిమాపున —
నా కనుపాపల —
ముసురుకొను నెన్నో రూపములు;
పాయని తలపుల —
తీయని గొంతులు —
ముసురుకొను నెన్నో కోరికలు;
తీయని మాపుల —
ఏవో రూపులు —
పూవుల తీవల ఊరికలు;
పాటల పాయలు —
తోటల మాయలు —
మునగకొను నెన్నో చోద్యములు;
ఉత్సుక గుండెల —
హత్తిన మాటలు —
ఈమునిమాపుల మునరుకొనెన్;
ఈ మునిమాపున —
ఆమని రాగము —
మూగెను నీరవ శకలముగా;
తామర కొలనుల —
మూగిన హంసలు —
రేగిన భావ పరంపరలు;
పూసిన కొమ్మల—
పూవుల చిమ్ముచు—
ఊగెను కోర్కెల కిరణములు;
కిరణాప్లుతముగ—
అరుణోదయములు—
సురుచిర హాస మయూఖములు;
తలిరు జొంపములు—
వలపు తొందరలు—
తెలిసి హాసముల బరపెన్;
ఈ మునిమాపుల—
ఆమని తూపుల—
తారానివహము తోచెన్:
ఈ మునిమాపున—
జీవన యామిని—
కనుసైగ లెన్నో చూపెన్;
ఈ మునిమాపున—
నా మని వాకిట—
మదన మనోహర స్పందనముల్!

రసాలం :

మదన విక్రాంతోత్సవ స్ఫూ
ర్జితములైనవి భూరుహాల్;
తోచె లోకము సర్వమున
ఘనవిజయ భేరీ నాదముల్;
కుసుమ లాస్యచ్ఛురణ చారణ
ప్రణయ లంపటా రక్తికల్;
వనములే—కవనములుగా
సుమ శరుని భవనములై;
కోమలీ జనకపోల ద్యుతి
సిందూర రాగ పరాగమై;
మృదు మృదంగ ధ్వనుల గతులకు,
కాహళుల కలనాద కళలకు,
దుందుభీ పటహాది ధ్వాన శ్రీ
కలస్వన మంజు నిక్వాణ గానమై;
అశాంత మధుర తరంగమై...
విశ్రాంత లలిత లవంగమై...

అశోకం :

ఉల్లములు సంఫుల్లమై, లో
కమ్ము లానందామృతములై
జీవములై సంజీవ కౌతుక
భావనా సమ్మోద తుందిల
సాంద్ర సౌరభమై; రుచి
రాసవాంజలులై; మనోరుచి
హార రసిత మంజరులై;
అభయ ముద్రాకలితమై;
కుసుమోత్సవోజ్జ్వలమై; శో
భారమమై! సౌందర్యమై!

చంపకం :

మధుర మధుకరనికర
గాన ఝరులకు సొగయు —
పవనపోన్మిషిత ప్రసూనాళి నాట్యమై!
స్రవిత మకరంద రస శీకర విలాసమై;
ప్రవిమల స్నిగ్ధతర
ప్రణయ స్వరూపమై;
ఘోషవతి కలనాద మానసామృతమాయె!
నా బ్రతుకు పరిమళించినది నీ దయవలన —
వేడుకొందును మదన దేవా!...నీ కీర్తి
పాడుకొందును వసంతాన!...రాగరస
వార్ధుల తేలియాడెద సంతసాన!!

మధువ్రతం :

క్షణక్షణ ప్రవర్ధితము —
సుఖస్ఫూర్తి శుభప్రదము —
ఉద్యాన వనాంతరాత్మ
చిత్రవర్ణ శోభితమ్ము!
తరుణ తరణి కిరణ నివహ
కదుష్ణ పరిచుంబితమ్ము;
సరోరుహ ద్యుతి హారమ్ము;
ఇంద్ర చాప యష్టి భతి
సముద్విగ్న మానసమ్ము —
పులకిత నవమాలికా
లతా కుడుంగము పోలెను;
పుష్పరజమె దుమారమై
ముకుళిత వకుళముల చేరె;
పల్లవ ప్రవాళాధర
కవ్ర కామిని నవ్యాన
కలిత చర్చరీ ధ్వానము —
జలధరాసదృశమాయె!
ఆర్ద్రీకృత గిరి సానువు
లందు చేరి మార్దవమున —
పటవాస చూర్ణ పంకమాయె!

విరహిణి :

చుక్కలు రాలిన కన్నీరా? మది
క్రొక్కడి దీ యిరు లత్తగువు?
ఆశల మోపిన ఆకసమా? ఇం
కేల దురాగత మ్రాకశయము?
భూజము లెత్తిన ధ్వజమ్ములా?
మనసిజ చాప నిబద్ధములా?
లలిత శుభ్ర పద రుచిరములా? నన
లేల హృదయముల చీల్చెదవి?
కోటుల పాటల పొదరిండ్లా? ఇం
దీటుల మ్రోతలె వినిపించెన్!
పుప్పొడి రేపిన దుమారమా? ఇం
కేల విమ్రదవ కులికెదవి?

కవి :

ఈ మదన సంరంభ మీ మహోత్సవము,
ఇటులనే యిటులనే సాగించుకొనుము;
ఈ పురాజగతి కభయము లీయవోయి—
ఈ వసుంధరకు మంగళము కూర్చుము దేవ!
విధురాంధతమః పటలి దూరీకృతముల్ బొనర్చి
మరల మరల నాగృహాంగణద్వారము తెరవనిమ్ము!
బాధా సంక్షుభిత కఠిన మహాయుధ స్వరూపాల
వ్యర్థ మొనరించి సుఖ శాంతు లిమ్ము వసంతమా.
విగత మోహ నాశా! నవజగతీ సంకాశా!
దరహసితాశా! మదనా! ఉన్నతుడా! శ్రీకరుడా!
చైతన్య వశంకరుడా! సౌందర్య స్వరూపుడా!
రారమ్ము దేవా! ఈ వసుమతి పాలింపుమోయి!!

భరతవాక్యం :

భ్రాంతిలోకనమ్ము వమ్ము-శాంతి మనోహరి సుమ్ము
నేడె లెమ్ము, నేడె లెమ్ము-కాంతి రేఖ కనుము, గనుము
ఇదె జీవన మహానంద సుఖసంపద చేకొనుమా!
ఈ వసంత మహోత్సవమె చిర శాంతి ప్రసాదనము.

# నవభారత రాజ్యాంగం: స్థూలపరిశీలన

శ్రీ చిత్తజల్లు వరహాలరావు

స్వాతంత్ర్య సముపార్జనానంతరం భారతదేశం సాధించిన ఘన విజయాలలో ఒకటి భారత రాజ్యాంగచట్ట నిర్మాణం. భారత రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు ప్రథమసమావేశం 1946 డిసెంబరు 9 వ తేదీన జరిగింది. 1949 నవంబరు 26 వ తేదీతో రాజ్యాంగ రచన పూర్తి చేయబడింది. ఈ రచనలో అత్యంత ప్రధానమైన పాత్ర నిర్వహించిన వ్యక్తి, స్వర్గీయ డాక్టరు అంబేడ్కరు. మన రాజ్యాంగం 1950, జనవరి 26 వ తేదీన అమల్లోకి వచ్చింది. 1947 ఆగస్టు 15 వ తేదీ, 1950 జనవరి 26 వ తేదీ యివి రెండూ, స్వతంత్ర భారత చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగిన చారిత్రాత్మక ప్రాధాన్యంగల దినాలు.

భారతదేశ పరిస్థితులకున్నూ, ప్రజల తత్వానికిన్నీ, తగినట్లుగా ప్రపంచమందలి ప్రజాస్వామ్య రాజ్యాంగాలలోని ప్రధాన విశేషాలను స్వీకరించి మన రాజ్యాంగ నిపుణులు నవభారత రాజ్యాంగాన్ని రచన చేశారు. ప్రధానంగా ఈ రాజ్యాంగ రచనకు తోడ్పడినవి— అమెరికన్, బ్రిటిష్ ఐరిష్ రాజ్యాంగాలు, అమెరికన్ రాజ్యాంగంలోని పౌరస్వత్వ హక్కులకు చెందినభాగం; బ్రిటన్‌లోని పార్లమెంటరీ ప్రభుత్వపద్ధతీ, బ్రిటిష్ ప్రభుత్వంచే మనదేశంలో ప్రవేశపెట్టబడిన 1935 చట్టం; మన రాజ్యాంగ రచనకు కొంతవరకు దోహదం చేశాయని చెప్పవచ్చు.

స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రం, న్యాయం, మన సర్వతంత్ర స్వతంత్ర ప్రజాతంత్ర రిపబ్లిక్‌కు మూల స్తంభాలని, రాజ్యాంగమంటుంది. ప్రస్తావన (ప్రియాంబుల్) ద్వారా విశదమవుతోంది. ఇండియన్ యూనియన్‌లోని పౌరులందరిలో, యిష్టపూర్వకంగానూ చట్టబద్ధంగానూ ఎన్నికలలో ప్రకటించిన అభిప్రాయం మీద ఆధారపడిన ప్రజారాజ్యంగా భారతదేశం రూపొందాలన్నది మన రాజ్యాంగానికి ప్రధాన ప్రాతిపదిక.

రాజకీయ చైతన్యం, విషయ పరిజ్ఞానంగల వివేకులగు ప్రజల అభిప్రాయంమీదనే ప్రజాతంత్ర విజయం ప్రధానంగా ఆధారపడి వుంటుంది. ఒక దేశంలోని ప్రజలను, వారి సంస్థలను, పాలక పాలితుల చపలచిత్తవృత్తులచేగాక చట్టబద్ధంగా పరిపాలింపవలెనన్న, ఆ ప్రజలు తమ ప్రభుత్వ కార్యకలాపాలను, నిర్వహించేందుకు ఒక ప్రాథమిక చట్టాన్ని అమల్లోకి తీసికొని రావాలి. రాజ్యాంగ చట్టానికి విధేయులై దాన్ని గౌరవించి, దాన్ని నియమ నిబంధనలను శిరసావహించుటే, ఆ దేశ పౌరులు నిర్వర్తించవలసిన పవిత్ర విధ్యుక్తధర్మం. ఇదే పౌరునికీ రాజ్యాంగ చట్టానికీ వుండే నిరంతర ముఖ బాదరాయణ సంబంధం.

పురాతన గ్రీకుదేశ చరిత్రలో, ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త అగు సోక్రటీసు రాజ్యాంగచట్టం ప్రకారం, నాటి ముష్కర ప్రభుత్వం విధించిన మరణశిక్షను స్వాగతపూర్వకంగా అనుభవించేందుకైనా సిద్ధపడ్డాడు గాని, ప్రాణరక్షణకై మోసంచేసి కారాగృహం నుండి పలాయనం చేయటానికిమాత్రం విముఖత్వం చూపించాడు. దీన్నిబట్టి ఆ మహావ్యక్తి రాజ్యాంగ మూలసూత్రోల్లంఘనం ఎంతటి హీనకృత్యంగాని నేరంగా పరిగణించాడో స్పష్టం. ఒక దేశ రాజ్యాంగంలో అన్యాయ శాసనాలుంటే, అవి ప్రజల శాంతియుత పురోగతికి ప్రతిబంధకమై యడుగడుగునా అడ్డుతగులుతాయి. అట్టి శాసనాలను చట్టబద్ధమగు ఆందోళన ద్వారానే మార్పించాలి. ఇలాంటి రాజ్యాంగబద్ధమగు పోరాటాన్ని చేసిన వ్యక్తులు బ్రిటిష్ చరిత్రలో కోకొల్లలుగా కన్పిస్తారు. రాజాజాన్ నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగానే, మాగ్నాకార్టాఅను పేరిట స్వాతంత్ర్య ప్రదానపత్రాన్ని బ్రిటిష్‌ప్రజలు సాధించారు; అక్రమ ఒకటైన పన్ను విధింపుకు వ్యతిరేకంగా జాన్ హాంప్డన్; నిర్హేతుకంగా వ్యక్తిని అరెస్టుచేసే జనరల్ వారెంటుకు వ్యతిరేకంగా జాన్‌విల్కీస్; ఐరిష్ కేథలిక్కుల రాజకీయ విమోచనకు పాటుపడ్డ డేనియల్ ఓకానెల్; బానిసల విముక్తిని సాధించిన అబ్రహాంలింకన్ చరిత్రలో అమరులు.

ఏ ప్రజాస్వామ్య ప్రభుత్వానికైనా, రాజ్యాంగం ప్రాథమిక చట్టం. (Fundamental Law.) ఒక రాజ్యముయొక్క ప్రభుత్వాన్ని పరిపాలించే ప్రాథమికశాసనాల సముదాయాన్ని రాజ్యాంగమని వ్యవహరించవచ్చు. (A constitution is a collection of fundamental rules and regulations according to which a state is to be governed.)

ప్రపంచంలోని రాజ్యాంగాలను రెండుభాగాలుగా విభజింపవచ్చు.

1. లిఖితపూర్వక రాజ్యాంగాలు; లిఖితపూర్వకం కాని రాజ్యాంగాలు.

2 రిజిడ్ రాజ్యాంగాలు; ఫ్లెక్సిబిల్ రాజ్యాంగాలు.

3. యూనిటరీ రాజ్యాంగాలు. ఫెడరల్ రాజ్యాంగాలు.

4. పార్లమెంటరీ ప్రభుత్వపద్ధతి అమల్లోవుండే రాజ్యాంగాలు; ప్రెసిడెన్షియల్ ప్రభుత్వపద్ధతి అమల్లోవుండే రాజ్యాంగాలు.

ప్రపంచంలో బ్రిటిష్ రాజ్యాంగమొక్కటే "వ్రాయబడని" రాజ్యాంగం. అలా అన్నంతమాత్రాన, బ్రిటిష్‌ప్రజలకు రాజ్యాంగ మూలసూత్రాలే లేవని అనడంగానీ; అలా అవగాహం చేసికోవడం గాని శుద్ధతప్పు. అప్పుడప్పుడు పార్లమెంటులోనూ, బ్రిటిష్‌రాజుల చేత ఆమోదింపబడిన, మహాస్వాతంత్ర్య ప్రదానపత్రం (Magna carta 1215); హక్కులపత్రం; (The Petition of Rights-1628); హెబియస్ కార్పస్ చట్టం; (The habeas corhus Act-

1679); ఆంగ్లజాతి స్వాతంత్ర్యానికి మాగ్నకార్టా పిదప అంతటి ప్రధానమైనదైన బిల్ ఆఫ్ రైట్స్-1689; అర్ధశతాబ్దం పైగా, (1721-1763 వరకూ) ఎన్నో అంతరాయాలను, ఉపద్రవాలనూ ఎదుర్కొని అభివృద్ధిచేయబడిన కేబినెట్ ప్రభుత్వపద్ధతి; జాన్ విల్ కీస్‌ను జనరల్ వారెంటుద్వారా అరెస్టు చేసినప్పుడు అలాంటి వారెంటు వ్యక్తిస్వాతంత్ర్యానికి విరుద్ధమని కోర్టు ఇచ్చిన తీర్పు; 1832 పార్లమెంటు ప్రాతినిధ్యానికి సంబంధించిన ప్రథమ సంస్కరణల చట్టం; రహస్యపుబాలెట్ చట్టం; ఇత్యాదిచట్టాలు, ఆనవాయితీలు, సంప్రదాయాలు, ఇవన్నీ కలిసి బ్రిటిష్ రాజ్యాంగం రూపం దాల్చుతూ, వాటిద్వారా నేటి ఆంగ్లప్రభుత్వం పరిపాలింపబడు తున్నదని మనం గుర్తించాలి.

బ్రిటిష్ రాజ్యాంగమొక్కటే లిఖితపూర్వకంగాని రాజ్యాంగం. మిగతా అమెరికన్, స్విస్, కెనెడియన్, ఐరిష్, సోవియట్, ఫ్రెంచి, ఆస్ట్రేలియన్ యిత్యాది రాజ్యాంగాలు లిఖితపూర్వకాలు. సవరణను ప్రతిపాదించి ఆమోదించుటకు ఏ రాజ్యాంగంలో మిక్కిలి కష్టసాధ్యమో, అలాంటి వానిని రిజిడ్ రాజ్యాంగమనీ; సవరణలు ప్రతిపాదించి సులభసాధ్యంగా ఆమోదించుటకు వీలున్న దానిని ఫ్లెక్సిబిల్ రాజ్యాంగమనీ అంటారు, అమెరికన్ రాజ్యాంగం రిజిడ్; బ్రిటిష్ స్విస్, భారతరాజ్యాంగాలు ఫ్లెక్సిబిల్. రాజ్యపరిపాలనాధికారం, కేంద్ర రాష్ట్రప్రభుత్వాలమధ్య ఏ రాజ్యాంగం ప్రకారం పంపకమై విభజింపబడునో, అట్టిదాన్ని ఫెడరల్ రాజ్యాంగమనీ, రాజ్యాధికారమంతా ఒకే ఒక కేంద్రప్రభుత్వం హస్తాల్లో వుంటే, అలాంటి దానిని యూనిటరీ రాజ్యాంగమనీ అంటారు. అమెరికా, సోవియట్ రష్యా, స్విట్జర్లాండ్, కెనడా, ఆస్ట్రేలియా యిత్యాది దేశాలలో ఫెడరల్ రాజ్యాంగంపద్ధతి అమల్లో వుంది. బ్రిటన్, ఫ్రాన్సు, ఇండియా వంటి దేశాల్లో యూనిటరీ రాజ్యాంగం అమల్లో వుంది. అయితే, కొంతమంది రాజ్యాంగనిపుణులు, మన రాజ్యాంగాన్ని, ఫెడరల్ రాజ్యాంగమనిఅంటారు. ఈవిషయంలో భేదాభిప్రాయాలున్నాయి.

నవభారత రాజ్యాంగం లిఖితపూర్వకమైనది; సవరణలు ప్రతిపాదించి ఆమోదింపజేయుటకు సులభసాధ్యమైనది; రాజ్యాంగం ప్రకారం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికార పంపిణీ జరిగినప్పటికీ, మన రాజ్యానికి (State) ఇండియన్ యూనియన్ అను నామకరణం చేయుటంవల్ల, మనది తప్పకుండా యూనిటరీ రాజ్యాంగమే. మన రాజ్యాంగంలో ప్రతిపాదింపబడిన రాష్ట్రీయ స్వయం పరిపాలనాధికారం ఛాయామాత్రమే. దేశానికి సంబంధించిన సర్వాధికారం కేంద్రప్రభుత్వంలో కేంద్రీకృతమై వుండడమే, దీనికి కారణం.

## ప్రస్తావన

నవభారత రాజ్యాంగ చట్టం, ప్రస్తావనతో ప్రారంభించబడింది. ఈ ప్రస్తావన రాజ్యాంగనిర్మాతల భావాలనూ, వాంఛలను, సాధించదలచిన లక్ష్యాలను స్పష్టపరుస్తోంది. "భారత ప్రజలము మేము, ఇండియాను సర్వతంత్ర స్వతంత్ర ప్రజాతంత్ర రిపబ్లిక్‌గా నెలకొల్పుటకూ, పౌరులందరికి ఆర్థిక, సాంఘిక, రాజకీయ, న్యాయాన్ని; భావ, భావప్రకటన, విశ్వాస, మత స్వాతంత్ర్యాలనూ; సమానమగు అవకాశ ప్రతిపత్తులను చేకూర్చుటకునూ; పౌరులందరిలోనూ వ్యక్తిగౌరవాన్ని, జాతి ఐక్యతను అభివృద్ధి చేయునటి సౌభ్రాత్రాన్ని పెంపొందించుటకు తీర్మానించుకొని, 1949 నవంబరు 26-వ తేదీన మా రాజ్యాంగ పరిషత్తులో ఇందుమూలంగా ఈ రాజ్యాంగాన్ని ఆమోదించి శాసనం చేసి స్వీకరించాం." ఈ ప్రస్తావన రాజ్యాంగములోని నాలుగు ప్రధాన లక్ష్యాలను వివరించుతోంది.

1. అంతర్గత, బహిర్గత స్వాతంత్ర్యములను కలిగిన సర్వతంత్ర స్వతంత్ర రాజ్యమై, ఇండియన్ యూనియన్ ఉండాలి. (Sovereign)

2. దేశమందు ప్రజాతంత్ర ప్రభుత్వం నెలకొల్పబడాలి.

3. వంశ పారంపర్యంగా వచ్చే రాచరికం గాక, ప్రజలచే లేక ప్రజాప్రతినిధులచే ఎన్నుకోబడ్డ వ్యక్తియే భారత రిపబ్లికునకు అధిపతిగా వుండాలి.

4. వ్యక్తి గౌరవాన్ని, జాతి ఐక్యమును పటిష్ఠం చేసేందుకు వ్యక్తులమధ్య సౌభ్రాత్రాన్ని నెలకొల్పాలని, రాజ్యాంగము నిర్దేశించింది.

## పౌరస్వత్వం

భారత రాజ్యాంగంలో అత్యంత ప్రధానమైన భాగాలలో ప్రాథమిక హక్కులకు (Fundamental Rights) సంబంధించిన భాగం ఒకటి. తన హక్కులను కూర్చి వివరించబడిన యీ భాగంపై ప్రతి పౌరుడు నిరుపమానమగు శ్రద్ధాసక్తులను కేంద్రీకరించాలి. రాజ్యానికి (State), వ్యక్తికి మధ్యనుండే సంబంధబాంధవ్యం; ప్రభుత్వాధికార వ్యక్తిస్వేచ్ఛల సమన్వయం; ఇత్యాది విషయాలు అత్యంత ప్రధానమైనవి. ప్రభుత్వం ఏ పౌరుని విషయంలోనూ జాతి, కుల, మత, లింగభేద, జన్మస్థానాలు కారణంగా, లేక వాటిలో దేని కారణంగానైనా, యెలాంటి వివక్షతను చూపకూడదని, రాజ్యాంగమందలి 15-వ సూత్రం స్పష్టపరుస్తోంది. వాక్, సభా, మత, ప్రార్థనా, అంతఃకరణ, పత్రికా స్వాతంత్ర్యాలను పౌరులకు రాజ్యాంగం గ్యారంటీ చేసింది. అయితే, ఈ హక్కులను రాజ్యభద్రతకు భంగం వాటిల్లనంతవరకే, పౌరులు కలిగివుంటారు. ప్రభుత్వాధికారానికీ, స్వేచ్ఛకీ మధ్య, నిరంతరం ఘర్షణవుంటూ వుంటుంది. ప్రభుత్వం ఆపోలీసు, రక్షణబలాలద్వారా అత్యంత విశాలము, శక్తివంతమగు అధికారాన్ని చెలాయిస్తుంది గాబట్టి, అలాంటి అధికారంబారినుండి వ్యక్తి స్వేచ్ఛని రక్షింపవలసిన అవసరం ఎల్లప్పుడూ వుంటుంది. ఈ విధమగు రక్షణను పౌరునికి కల్పించునదే, ప్రాథమిక హక్కుల బాధ్యత.

మన దేశంలో తరతరాలనుండి కొంతమంది వ్యక్తులు, అంటరానివారుగా, అస్పృశ్యులుగా, పరిగణింపబడారు. వారిని సంఘదూరులుగా చేయడం జరిగింది. వారికి కనీసమగు సాంఘిక న్యాయంకూడా ప్రసాదింపబడలేదు. అలాంటివారికి, మనరాజ్యాంగం సాంఘిక న్యాయం కలుగజేయ సంకల్పించింది. ఈ విషయం, ప్రస్తావనలోనే స్పష్టీకరింపబడింది. ఏ పౌరుడు కూడా, జాతి, మత, కుల కారణంగా షాపులలో, పబ్లిక్ హోటళ్ళలో, వినోదశాలలలో,

లోక్ సభా విశ్వాసాన్ని చూరగొని, ఆ సభకు బాధ్యత కలిగివున్న మంత్రివర్గం. కాబట్టి, ప్రతి విషయంలోను కేంద్ర మంత్రివర్గం యిచ్చిన సలహాను అనుసరించాలి. మంత్రివర్గ నిర్ణయాలతో ఏకీభవించలేకపోతే, పదవినుండి బయటికి రావాలి.

ఉపరాష్ట్రపతిని, పార్లమెంటులోని ఉభయ సభలూ, ఒకే సమావేశంలోకూడి, సింగిల్ ట్రాన్స్‌ఫర్ బుల్ ఓటు ద్వారా, దామాషా ప్రాతినిధ్యం ప్రకారం ఎన్నుకొంటారు. మరణంవల్లగానీ, రాజీనామా యివ్వడంవల్లగానీ, రాష్ట్రపతిస్థానంలో ఖాళీ ఏర్పడితే, మళ్ళీ మరో రాష్ట్రపతిని ఎన్నుకొనేంతదాకా, రాష్ట్రపతి తరఫున ఈయనే పనిచేస్తాడు. అపుడు రాష్ట్రపతికుండే అధికారాలన్నీ యీయనకుంటాయి. సాధారణంగా, రాజ్యసభకు యీయన అధ్యక్షుడుగా వుంటాడు. పదవీ కాలపరిమితి 5 సంవత్సరాలు. అమెరికాలో అధ్యక్షుని పిదప ఉపాధ్యక్షుడు వున్నట్లే, మన దేశంలోకూడా రాష్ట్రపతి, పిదప ఉపరాష్ట్రపతి పదవిని ప్రవేశపెట్టారు. ఐతే, ఈ పదవుల్లో నామమాత్రము పోలికే వుందిగాని, వాస్తవానికి అమెరికాలోని అధ్యక్ష ఉపాధ్యక్షులకూ, మన రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతులకూ అధికారాల్లోమటుకు ఏమాత్రం సామ్యంలేదు.

కేంద్ర ప్రభుత్వంలో మామూలుగా శాసనాలను చేయునది పార్లమెంటు. ఐనా, రాజ్యాంగంలోని 123 వ ఆర్టికల్ ప్రకారం, రాష్ట్రపతికి, శాసన నిర్మాణ విషయంలో అసాధారణాధికారాలు యివ్వబడ్డాయి. పార్లమెంటు ఉభయసభలు సమావేశమై వున్నపుడుగాక, ఏ యితర సమయంలోనైనా, తాను సత్వరంగా చర్య తీసికోవాల్సిన విపరీత విపత్కర పరిస్థితులు ఏర్పడ్డాయని నమ్మినయెడల, అపుడు ఆయన యీ అసాధారణాధికారాలను వుపయోగించి, ఆర్డినెన్సులను జారీచేస్తాడు. వాటికి, పార్లమెంటు ప్యాస్ చేసిన చట్టములకున్నంతబలం, అధికారముంటుంది. కాని, అలాంటి ప్రతి ఆర్డినెన్సును పార్లమెంటు యొక్క ఉభయసభలముందు ప్రవేశ పెట్టవలయును. పార్లమెంటు సమావేశమైన పిమ్మట, 6 వారాల అనంతరం, ఆ ఆర్డినెన్సు వర్తించకుండా నిలిచిపోవును; లేక, ఆ వ్యవధి గడువకపూర్వమే, ఆ ఆర్డినెన్సుకు అసమ్మతి తెలియజేస్తూ, పార్లమెంటు ఉభయసభలూ తీర్మానాలు చేస్తే, దానికి ఏబలమూ వుండదు.

భారత ప్రభుత్వానికి న్యాయశాస్త్ర (లీగల్) సంబంధమగు విషయాలలో సలహా యిచ్చే వుద్యోగిని, ఇండియా ఎటార్నీ జనరల్ అని పిలుస్తారు. ఈయన రాష్ట్రపతిచే నియమింపబడి, ఆయన అనుగ్రహ పర్యంతం, తన పదవిలో వుండును. రాష్ట్రపతి, అప్పుడపుడు తనకు నిర్దేశించిన న్యాయశాస్త్ర సంబంధమగు కర్తవ్యాలను, నిర్వహించాలి. భారత ప్రభుత్వం, వాదిగాగాని, ప్రతివాదిగాగాని, ఏ కేసులోనైనా పాల్గొన్నప్పుడు, కోర్టులో ప్రభుత్వప్రతినిధిగా ఈయన వాదిస్తాడు.

భారత రాజ్యాంగంలోని 74వ ఆర్టికల్ ప్రకారం, ఇండియన్ యూనియన్ యొక్క కార్యనిర్వాహక అధికారాలను ఆచరణలో పెట్టేందుకూ, రాష్ట్రపతికి సహాయపడుటకూ, సలహానిచ్చుటకు, లోక్ సభకు పూర్తి బాధ్యతను కలిగివున్న ఒక మంత్రివర్గం వుంటుంది. దానిలో ప్రధానమంత్రి ముఖ్యుడు. ప్రధాన మంత్రిని రాష్ట్రపతి నియమించును. ప్రధానమంత్రి సలహాతో, యితర మంత్రులను కూడా నియమించును. రాష్ట్రపతి, అనుగ్రహ పర్యంతం, ఆ మంత్రులు పదవుల్లో వుంటారు. బాధ్యతాయుత ప్రభుత్వానికి సంబంధించిన సూత్రాలకు, కన్వెన్షనులకూ పాటిస్తూ, మంత్రివర్గం పనిచేస్తుంది.

## పార్లమెంటు

రాజ్యాంగంలోని 79వ ఆర్టికల్, యూనియన్ పార్లమెంటును గూర్చి వివరించింది. పార్లమెంటులో, రాష్ట్రపతి అంతర్భాగంగా చేయబడ్డాడు; దీనిలో లోక్ సభ, రాజ్యసభ అనే రెండు సభలుంటాయి.

లోక్ సభ, ఇండియన్ యూనియన్‌లోని ప్రజల కందరికీ ప్రతినిధి. బ్రిటిష్ పార్లమెంటులోని కామన్సు సభకీ, లోక్ సభకీ, చాల సామ్యములున్నాయి. వివిధ రాష్ట్రాలలో, వయోజనులచు (ఓటుచేయుటకు అర్హులు) ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడ్డ 500 మంది సభ్యులు దీనిలో వుంటారు. ఈ సభా కాలపరిమితి 5 సంవత్సరాలు. 25 సంవత్సరాలు వయస్సుండి, భారత పౌరసత్వాన్ని కలిగియుండి, రాజ్యాంగం నిర్దేశించిన అనర్హతలు లేకుండిన ఏ అభ్యర్థియైనా, ఈ సభకు సభ్యుడుగా ఎన్నిక కావచ్చు.

ప్రజలకుగాక, రిపబ్లికులోని వివిధ రాష్ట్రాలకు రాజ్యసభ ప్రాతినిధ్యం యిస్తోంది. విజ్ఞానశాస్త్రం, సారస్వతం, కళ, సాంఘిక విషయాలలో పాండిత్యాన్ని, అనుభవాన్ని గడించిన 12 గురు సభ్యులు, రాష్ట్రపతిచే ఈ సభకు నామినేటు చేయబడతారు. ఈ సభకు చెందినమిగతా సభ్యులంతా, దామాషా ప్రాతినిధ్యం ప్రకారం సింగిల్ ట్రాన్స్‌ఫర్ బుల్ ఓటుద్వారా ఎన్నికవుతారు. దీనిలో 238 సభ్యులకు మించకుండా వుండును. భారతీయ పౌరుడుగావుండి, 30 సంవత్సరాలవయస్సు కలిగినవ్యక్తి, ఈ సభకు ఎన్నిక కావచ్చు. ఐతే, పిచ్చివారూ, దివాలాదారులూ, ప్రభుత్వోద్యోగులూ, పార్లమెంట్‌లోని ఏసభ సభ్యత్వానికైనా, అనర్హులు. రాజ్యసభను డిసాల్వ (రద్దు) చేయడానికి వీల్లేదు. ప్రతి రెండు సంవత్సరాల కొకసారి, ఈసభలోని మూడవవంతు సభ్యులు, వీలైనంత త్వరలో రిటైర్ అవుతారు.

రాజ్యాంగమందలి, 85 ఆర్టికల్ ప్రకారం, పార్లమెంటు ఉభయసభలు, ప్రతి సంవత్సరం కనీసం రెండుసార్లైనా సమావేశమగుటకు ఆహ్వానింపబడాలి. ఏ రెండు సమావేశాలమధ్య 6 మాసాల కంటె అధికవ్యవధి వుండరాదు. ఐతే, రాష్ట్రపతి, తనకు యుక్తమని తోచినపుడెల్ల, పార్లమెంటునుగానీ, లేక ఉభయసభలలో దేనినైనా గానీ ఆహ్వానించవచ్చును.

## పార్లమెంటు అధికారాలు

1. రాజ్యాంగం కేంద్ర ప్రభుత్వానికి అప్పగించిన అంశాలపై ఇండియన్ యూనియన్ కంతటికి వర్తించే శాసనాలను చేసే అధికారం;

2. కేంద్ర ప్రభుత్వానికి విధానాలను సిఫారసుచేస్తూ తీర్మానాలు చేసే అధికారం; ఐతే ఈ సిఫారసులను ప్రభుత్వం తప్పకుండా అనుసరించాలనే నిర్బంధం మాత్రం లేదు.

3. ప్రభుత్వం పన్నుల రూపంలో ధనాన్ని వసూలు చేయడానికి, ఆయా ప్రభుత్వశాఖలు ప్రజోపయోగకరమగు పనుల నిమిత్తం ఖర్చుచేయడానికి అవసరమగు ధనాన్ని మంజూరుచేయడం.

పన్నులు విధించడానికి, ఖర్చుపెట్టడానికి ప్రభుత్వమే ప్రతిపాదనలు చేస్తుంది. పార్లమెంటుగాని, దానిలోని ఏ సభ్యుడుగానీ ఈ ప్రతిపాదనలు చేసేందుకు పూనుకొనకూడదు. ఐతే, సాంవత్సరిక పన్నులు, వ్యయం, యిత్యాది వ్యవహారాలు మాత్రం పార్లమెంటు ఓటుద్వారా ప్రతిసంవత్సరం మంజూరు కావాలి. ఈ క్రింది వాటిని మాత్రం పార్లమెంటు తన ఓటుద్వారా మంజూరు చేయవలసిన అవసరం లేదు.

(ఏ) రాష్ట్రపతియొక్క ఇమాల్యుమెంట్లు (జీతభత్యాలు), బత్తాలు, తదితర వ్యయాలు.

(బి) రాజ్యసభ అధ్యక్ష, ఉపాధ్యక్షులయొక్క, లోక్ సభ స్పీకర్, డిప్యూటీ స్పీకర్లయొక్క జీతబత్తాలు.

(సి) భారత ప్రభుత్వం బాధ్యతవహించిన రుణాలు, వాటి వడ్డీ, నిక్షేపనిధి మున్నగునవి.

(డి) సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తుల జీతాలు, బత్తాలు, ఫెన్షనులు.

(ఇ) ఇండియా ప్రభుత్వ కంట్రోలరు — ఆడిటర్ జనరల్ కు ఇచ్చే జీతబత్తాలు.

(ఎఫ్) కోర్టుల నిర్వహణకయ్యే ఖర్చులు.

(జి) సంచితనిధి (కన్సాలిడేటెడ్ ఫండ్) నుంచి చెల్లించాలని రాజ్యాంగంగాని, పార్లమెంటుగానీ ప్రకటించినఋణాలు.

పైన ఉదాహరించబడిన, యీ ఖర్చులు శాశ్వతమేగాక, తప్పనిసరైనవి. అందుచేత పార్లమెంటు ఓటుతో నిమిత్తంలేనివి. వీటిని సంచిత నిధినుండి భరించాలి.

ప్రభుత్వ పరిపాలనకు సంబంధించిన చర్చపై, పార్లమెంటు ప్రశ్నల సమయంలో తీర్మానాల ద్వారా, ప్రభుత్వాన్ని, మంత్రులను, అనుబంధ అర్జీలలో పరిశీలించుటకు ప్రయత్నిస్తుంది. మంత్రివర్గ విధానాలు, మంత్రుల పరిపాలన, లోక్ సభకు అంగీకార యోగ్యం కాకుండా వున్నపుడు ఆ సభ ప్రతినిధులను ఓటుద్వారాగాని, మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానాన్ని ప్యాస్ చేయడం ద్వారాగాని మంత్రివర్గాన్ని పదవినుంచి తొలగించవచ్చు.

## కేంద్ర న్యాయాధికారవర్గం—సుప్రీం కోర్టు

ఇండియన్ యూనియన్ లోని న్యాయనిర్వహణ వ్యవస్థ అంతా సుప్రీంకోర్టుచే నడుపబడుతుంది. ఈ కోర్టుయొక్క కార్యకలాపాలూ, వివిధ సమస్యలపై యివ్వబడిన తీర్పులూ, రికార్డు చేయబడి సాక్ష్యంగా ఉదాహరింపబడతాయి (Court of Record). కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల మధ్య వుత్పన్నమైన వివాదాలనుగానీ; కేంద్ర ప్రభుత్వం కొన్ని రాష్ట్రప్రభుత్వాలూ ఒకవైపూ, మరికొన్ని రాష్ట్రప్రభుత్వాలు యింకొకవైపున వుండగా ఏర్పడిన వివాదాలనుగానీ; రాష్ట్రములమధ్య ఏర్పడ్డ వివాదగ్రస్త సమస్యలనుగానీ; చట్టం లేక యదార్థం—(Law or fact) వీటికి సంబంధించిన న్యాయశాస్త్ర సమస్యలనుగాని విచారించి తీర్పుయిచ్చేందుకు సుప్రీం కోర్టుకు సర్వాధికారం వుంది. ఏ రాష్ట్రమందలి హైకోర్టు యిచ్చిన తీర్పులపైనా, డిక్రీలు మున్నగు వ్యవహారాలపైనా, వ్యక్తులుగాని, సంస్థలుగానీ ఈకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు (Court of Appeal). సివిలు, క్రిమినలు, వ్యవహారాలపైనా, రాజ్యాంగ చట్టానికి సంబంధించిన వివాదగ్రస్త సమస్యలు యిమిడివున్నాయని ఏ రాష్ట్ర హైకోర్టైనా, సర్టిఫై చేసినట్లయితే అలాంటి ప్రధాన సమస్యలపైనా ఈ కోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు. రాజ్యాంగ చట్టంలోని 141—142 ఆర్టికల్స్ ప్రకారం సుప్రీంకోర్టుచే ఆమోదింపబడిన శాసనాన్ని, తీర్పుని, ఇండియన్ యూనియన్ లోని కోర్టులన్నీ శిరసావహించాలి. ఈ కోర్టుయొక్క తీర్పులు, డిక్రీలు, ఆదేశాలు, ఇండియన్ యూనియన్ అంతటా అమలు చేయబడాలి. ఏ వ్యక్తినైనా హాజరగునట్లు చేయడానికి, ఎలాంటి దస్తావేజులనైనా ప్రకటించడానికి, తనకు జరిగిన అవమానాన్ని (Contempt of Court) విచారించి వ్యక్తులను లేక సంస్థలను శిక్షించడానికి ఈ కోర్టుకు సర్వాధికారమున్నది.

సుప్రీం కోర్టుతో సమాలోచించడానికి, రాష్ట్రపతికి అధికారము ఇవ్వబడింది. ఒక అసాధారణమగు శాసనం, లేదా యదార్థము (Law or Fact) నకు సంబంధించిన సమస్య ఉత్పన్నమైనదని గానీ, ఉత్పన్నం కావచ్చునని గానీ, రాష్ట్రపతికి తోచినపుడే ఆయన ఈ కోర్టుతో సమాలోచింపను. ఇలాంటి విషయాలపై సుప్రీంకోర్టు తన అభిప్రాయాన్ని రాష్ట్రపతికి నివేదించ "వచ్చును" అని అనడంద్వారా రాజ్యాంగం జాగ్రత్తపడినది. అంతేకానివలెను అని అనలేదు. ఎంచేతనంటే, రాష్ట్రపతి చేసే అలాంటి సమాలోచన ద్వారా సుప్రీంకోర్టుయొక్క స్వేచ్ఛకు, నిష్పాక్షిక ప్రవర్తనకు భంగం వాటిల్లవచ్చు.

కార్య నిర్వాహకవర్గాధికారం దాడినుండి, న్యాయాధికారవర్గం లేక కోర్టుల స్వేచ్ఛను, (Independence of the Judiciary from the raid of the Executive) రక్షించేందుకు జడ్జీల జీతబత్తాలు, ఆఫీసు నిర్వహణకయ్యే వివిధ ఖర్చులు, పార్లమెంటు ఓటుకు పెట్టకుండా, వీటిని నేరుగా కన్సాలిడేటెడ్ ఫండు—సంచిత నిధి—ద్వారా చెల్లించేందుకు రాజ్యాంగంలో ఏర్పాటు చేయబడింది. ఎగ్జిక్యూటివ్ అధికారదాడినుండి జ్యుడీషియరీ స్వాతంత్ర్యాన్ని కాపాడవలసిన ప్రతి, ప్రజాతంత్ర రాజ్యాంగంలోనూ యిలాంటి యేర్పాటు చేసి తీరతారు.

సుప్రీం కోర్టులో ఒక ప్రధాన న్యాయమూర్తి, ఆరుగురు సాధారణ న్యాయమూర్తులు వుంటారు. ప్రధానన్యాయమూర్తి సలహాను తీసుకుని, రాష్ట్రపతి ఇతర న్యాయమూర్తులను నియమిస్తారు. 65 సంవత్సరాల వయస్సు దాకా వీరు పదవిలో వుంటారు. నిర్ణీతమగు దుష్ప్రవర్తన, అసమర్థత, అనే కారణాలను ఆధారంగా ఒక న్యాయమూర్తిని పదవి నుంచి తొలగించవచ్చును. పార్లమెంటు లోని ఉభయ సభలూ, ఒకే సమావేశంలో కూర్చున్నప్పుడు ఆ సమావేశంలోని సభ్యులలో అధిక సంఖ్యాకులచేతను, ఆ సమావేశానికి

చెబితే ఆ తయ్యకూడా ప్రయాణమౌతుంది; అదో చిక్కు! అంగుకల్ల బజారుకు వెళ్ళినతర్వాతనే ఆ విషయం కదపాలి......

అంతా కృష్ణ అనుకున్నట్లే జరిగింది...ఊరు అవీ కొన్న తర్వాత అరగంటలవుతూండగా యిద్దరూ ఒక రెస్టొరెంటులో ప్రవేశించారు. ఐస్ క్రీం తింటూ కృష్ణ, "భవానీ, సినిమాకు వెళ్దామా? ప్రక్కనున్న థియేటర్లో క్రొత్తతెలుగు సినిమా వచ్చినట్లుందే!" అన్నాడు.

"ఫూర్స్టు క్లాస్., వెళ్దామా...సరే!" అన్నది భవాని.

అంత సులువుగా భవాని అంగీకరిస్తుందనుకోలేదు కృష్ణ. 'ఎలాగ? అమ్మతో చెప్పలేదే!' అని అంటుందేమో! లేకపోతే, 'ఏం సినిమా? తలనొప్పి, వద్దులే!' అని అభ్యంతరం చెబుతుందనీ, బలవంతపెట్టవలసి వస్తుందని ఊహించాడు. కాని భవానికి అలాంటి జంకుగొంకులు ఏమీ ఉన్నట్లులేవు! నిన్నరాత్రి వచ్చిన ఆ యువకుతోనూ, స్నేహితుల్తోనూ యిలాగే సినిమాకు తల్లితో చెప్పకుండా వెళ్ళటం బాగా అలవాటున్నట్టుంది భవానికి!......

థియేటర్లో చాలసార్లు భవాన్ని మాటల్లోకి దింపాలని ప్రయత్నం చేశాడు కృష్ణ. కాని భవాని 'సినిమా చూద్దాం!' అని వారించటంతో లాభంలేకపోయింది.

అసలు యీ మనస్తత్వపు స్త్రీలకు మాటల్తో ఏంపని? కావలసినవి అనుభవాలే! అనుకున్నాడు కృష్ణ. మెల్లగా తనచేయి భవాని చేతిని స్పృశించేలా చేశాడు; కాని భవానిలో ఏవిధమైన చలనమూ లేదు. తర్వాత మెల్లిదిగా తనభుజం ఆమెభుజాన్ని తాకేటంత మేర ఆమెవైపు ఒరిగాడు. భవాని క్షణం అలానేవుండి అటువైపుకు ఒరిగి తప్పుకుంది...మళ్ళీ ఆమె యిటువైపు కదుల్తుందేమోనని నిరీక్షించాడు కృష్ణ. కాని లాభంలేకపోయింది.

సినిమా వదలి పెట్టిన తర్వాత భవాని, "టాక్సీలోవెళ్ళిపోదాం, తొందరగా వెళ్ళొచ్చు" అన్నది...'దారికి వస్తోంది; నేను పట్టివెత్తి మొహాన్ని కాకపోతే ఏదో మాట్లాడాలి, ఒకళ్ళభావా లొకళ్ళతో చెప్పుకోవాలి అనుకున్నానుగాని, యిందులో మాటలు నిజంగా అనవసరమే! శరీరాలే మాట్లాడుకోవాలి!" అనుకొని ఒక నిశ్చయానికి వచ్చాడు కృష్ణ...టాక్సీలో భవాన్ని స్పృశిస్తూ ప్రక్కనకూర్చున్నాడు గాని ఏం చెయ్యటానికీ సాహసం చాల్లేదు; పదినిముషాల్లో టాక్సీ యిల్లు చేరుకోవటంతో టైమూ చాల్లేదు.

ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు.

"ఎలావుంది బావా సినిమా? కథ చాల బాగుంది!" అన్నది భవాని

"రావణున్ని అమాయకుణ్ణిచేసి మోసం చేశారు దేవతలు; పాపం రెండుసార్లూ దగాపడ్డాడు."

"అది అమాయకత్వమెలా అవుతుంది? రాక్షసత్వం. లేకపోతే శివుడు 'ఏం వరము కావాలి' అంటే 'నీ భార్యకావాలి' అంటాడూ! వాడిమనస్సుకు తగినట్లే పార్వతి కాళీమూర్తిగా కనిపించింది. భయపడి, అంతటితో వెళ్ళి మండోదరినే పార్వతి అనుకుని తృప్తిపడ్డాడు..."

"రెండోసారి అలాంటిదేమీ లేదుకదా, అప్పుడు జరిగింది మోసమేనా!"

"దానికీ రావణుని గుణమే కారణం. ఆత్మలింగం, అదేదో వస్తువులాగా దాన్ని కనిపించిన పిల్లవాడి చేతి కివ్వటమేమిటి? అంటే వాడికి దాని విలువ తెలీదు! మనకొక రత్నం దొరుకుతుందనుకో, దాని విలువ తెలీకపోతే పోగొట్టుకుంటాము, అంతే! అందులో మోసమేం లేదు. ఒక గేమ్ వుంది, దాని రూల్సు ప్రకారం ఆడాలి...ఆత్మలింగం క్రింద పెట్టకూడదన్న నిబంధన వుంది, అజాగ్రత్తవల్ల దాన్ని పాటించలేక ఓడిపోయాడు.. విచారించి లాభమేమిటి?"

భవాన్ని మాటల్లో అంతరార్థంకోసం వెతుకుతున్నాడు కృష్ణ...విలువ తెలీక భవాన్ని తను అలా పోగొట్టుకున్నాడు అంటోందా?

"అయితే రూల్సు తెలిసినంతమాత్రాన జాగ్రత్తగా వుండికూడా గెలవకపోవచ్చుగా! అదృష్టం కలిసిరావాలి!"

"నిజమే దానికి అదృష్టంకాదు, చొరవా సామర్థ్యమూ వుండాలి. రావణుడికి అవి వున్నాయి, రూల్సే తెలీవు. కాని చాలమందిలో చొరవా, సామర్థ్యమే వుండవు. రూల్సు బాగా తెల్సినా!"

"మంచి సిద్ధాంతమే తయారుచేశావ్!" అన్నాడు కృష్ణ నవ్వుతూ, తనకు విషయం పూర్తిగా అర్థమైందన్నట్లు.

రూల్సు తెలియటమేకాదు, చొరవవుండాలి ఆడదాన్ని అనుభవించటానికి! అనుకున్నాడు కృష్ణ.

భోజనం ముగించి ముందుగదిలోకి వచ్చారు.

"నేను రేపు ప్రొద్దున వెళ్ళిపోతాను; నీదగ్గరేవో నమూనాలు వున్నాయి తెమ్మని చెప్పిందే!" అన్నాడు కృష్ణ, భవాని అభిప్రాయం కనుక్కుందామని.

"ఆ నమూనాలు నా ఫ్రెండు ఒకావిడ దగ్గరున్నాయి. నిన్న, యివాళ, ఆవిడ యింటికి వెళ్ళలేకపోయాను. ప్రొద్దునే వెళ్తాను. రేపు ఎలాగూ ఆదివారం; వుండి, ఎల్లుండి వెళ్ళుతావా?"

"అయితే వాటికోసం ఒక రోజంతా ఆగాల్సిందే!"

"ఏం? అర్జంటు పనులేమైనా వున్నాయా?"

"వుంటే ఏంలే! సర్దుకోవచ్చు...కాని ఏం తోచకుండా..."

"ఎందుకు తోచదు? నేనింట్లోనే వుంటాను...మ్యూజియం చూట్టానికి వెళ్దామా?"

"నే నిదివరకే చూశాను."

"పోనీ మేటనీకి."

"సరే రేపు ఆలోచించుకోవచ్చు...అయితే వుండక తప్పదంటావ్!"

కృష్ణ పడుకున్నతర్వాత చాలసేపు నిద్రపోలేదు...ఏదైనా అలికిడైతే భవాని ఏదో నెపంతో తనగదివైపు వస్తోందేమోనని అనుకుంటూ చాలసేపు నిరీక్షించి, తను రేపు వుంటానని చెప్పటం పొరపాటనీ, అలా చెప్పకుండా వుంటే ఫలితం వేరుగా వుండేదనీ ఆలోచించుకుని, చివరకు నిద్రపోయాడు.

*   *   *

ఆదివారం ప్రొద్దున భవాని స్నేహితురాలి యింటికి వెళ్ళి పది నిముషాల్లో... కొందు గంటలకు నమూనాలతో తిరిగివచ్చింది.

# తమిళ సాహిత్యంపై తెలుగు వెలుగు

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

దక్షిణ భారతమునందు వ్యవహారమున నున్న భాషలలో తెలుగు తమిళము కన్నడము మున్నగునవి ముఖ్యములు. ఈ మూడును బహుప్రాచీనములు. కాని క్రీ.శ. 11 వ శతాబ్దమున సంతరింపబడిన కలింగత్తుప్పరణి అను నొక చారిత్రక కావ్యమున కర్త యగు జయంగొండార్ కన్నడభాషను గురించి యిట్లు చెప్పెను.

“...కన్నడక్కుఱు మొళిక్ కిళవనుగుం పలతిమిళుం
కుళితి తిరుకరునాడియర్ కుఱుకిక్కడై...”

కొన్ని తెలుగుమాటలయు, పలు తమిళ శబ్దములయు కలయిక వలన కన్నడభాష యేర్పడెనని యీ పంక్తులలో వ్యక్తము చేయబడినది. అందేకాక కన్నడశబ్దములు లోకువపడునవనియు చెప్పబడినది. ఈ సందర్భమున సుప్రసిద్ధ పరిశోధక విద్వాంసులగు శ్రీ ము. రాఘవయ్యంగారు[1] తమ ఆరాయ్చ్చి తొగుదిలో తెలుగు కన్నడములను గురించి వ్రాసిన వాక్యముల నిట నుదాహరించుచున్నాను. “అది (కన్నడము) తమిళము అను భాషకు కలయికవలన ఏర్పడిన భాష అనియే ప్రాచీన తమిళ పండితుల విశ్వాసము ......... ఈ ప్రమాణములను పురస్కరించుకొని చూడగా తెలుగునకు తమిళమునకున్నంత ప్రాచీనత కలదని గ్రహింపవలెను.” కాని యీ విషయాదికము నంగీకరింపని వారును కొందరు కలరు. ఏమయినను, తెలుగు తమిళములు మాత్రము బహు ప్రాచీనములని చెప్పవచ్చును.

తమిళ వాఙ్మయమున ప్రాచీనము, ప్రశస్తమునగు గ్రంథము తొల్కాప్పియము. ఈ లక్షణశాస్త్రమును రచించిన తొల్కాప్పియనారు కావ్యమునందు ప్రయోగింపదగిన తమిళ శబ్దములను ఇయల్ చొల్ (మార్పు చెందని తమిళ శబ్దములు) తిరిచొల్ (మార్పు చెందిన తమిళశబ్దములు), దిశైచ్చొల్ (అన్యదేశ్యములు), వడచొల్ (సంస్కృత శబ్దములు) అని నాలుగు విధములుగా విభజించెను. ఇట్లగుటచే తొల్కాప్పియనారు కాలమునకే తమిళములో అన్యదేశ్యములును, సంస్కృత శబ్దములును చోటు చేసికొని యుండుట నిస్సంశయము.

అన్యదేశ్యములను గురించి తరువాతి వ్యాఖ్యాతలిట్లు చెప్పిరి.

“సెందమిళ్ సేర్న్ద పన్నిరు నిలత్తుం
తంకురిప్పినవే దిశైచ్చొల్ కిళవి.”

తమిళ దేశమునకు చెందిన పన్నెండు భాగములకు వెలుపల నున్న దేశములనుండి గ్రహింపబడిన శబ్దములకు దిశైచ్చొర్కళ్ అని పేరు కలిగెను.

ప్రాచీన కాలమున తమిళము మాటాడు దేశము పన్నెండు భాగములుగా నుండెడిది, తమిళ దేశమునకు ఉత్తర సరిహద్దుగా తెలుగు మాటాడు దేశమే యుండెనని తమిళ విద్వాంసులెల్లరు నంగీకరించిన విషయము. తొల్కాప్పియనారు కాలపువారగు పనంపారనారు “వడ వేంగడం తెన్ కుమరి యాయిడై త్తమిళ్ కూఱు నల్లులగత్తు—” అని చెప్పెను. ఉత్తరమున వేంకటాచలము, దక్షిణమున కన్యాకుమారి—ఈ రెంటి నడుమనున్న ప్రదేశమున తమిళము వ్యవహారమున నుండెనని పై మాటలవలన తెలియుచున్నది.

కాక్కైపాడినియార్ అను ప్రాచీన పండితుడును “వడదిశై మరుంగిన్ వడుగు వరంబాగ” అని తెలుగు దేశమునే ఉత్తర సరిహద్దుగా నిర్ణయించెను.

తెలుగువారు తమిళమును అరవ[2] మనియు, తమిళులను అరవ లనియు వ్యవహరించుచున్నట్లుగానే తమిళులు తెలుగును తొల్లి వడుగు అనియు, తెలుగులను వడుగర్ అనియు వ్యవహరించిరి. వడుగు శబ్దమిప్పటిది కాదు. తమిళ వాఙ్మయమున తొలి యుగముగా గణింపబడు సంగకాలముననే వడుగు శబ్దము వాఙ్మయములోనికి వచ్చెను. తరువాతి కాలముననే తెలుగువారిని తెలుంగర్ అని వ్యవహరించిరి. నేటికిని బలిజ కులస్థులను తమిళులు వడుగర్ అనియే వ్యవహరించుచున్నట్లు తెలియుచున్నది.

సంగకాలపు గ్రంథములగు అగనానూఱు, పుఱనానూఱు, కుఱుంతొగై మొదలగు వానిలో ‘వడుగు’ శబ్దము వాడబడినది. వడుగులు తమిళమునకు భిన్నమగు భాష మాటాడు వారనియు పరాక్రమశాలు లనియు, తమిళ సేనానాయకులకు శత్రువు లనియు చెప్పబడినది. సంగవాఙ్మయములో తెలుగు నాయకుల పేరు కొన్ని కానవచ్చుట గమనింపదగు విషయము.

సంస్కృత శబ్దములతో పాటుగ తెలుగు మాటలు కూడ వ్యావహారిక తమిళమునందే కాక గ్రాంథిక తమిళమునందును ప్రవే

---

1 ఈ నడుమనే వీరు దివంగతులైనారని తెలుపుటకు చింతిల్లుచున్నాను.

2. అరవ అనుట సమంజసము. తమిళ కావ్యములలో అరువ శబ్దమే వాడబడినది.

3. సంస్కృత శబ్దములనేకములు తత్సమ తద్భవ రూపములతో సంగకాలమున సంతరింపబడిన గ్రంథములందే కానవచ్చుచున్నవని శ్రీ టి. ఎన్. కుమారస్వామిగారు నాకు తెలిపిరి. వీరు బహుభాషాకోవిదులు; ప్రసిద్ధ తమిళ రచయితలును. వీరికి కృతజ్ఞుడను. సంగవాఙ్మయమున ప్రవేశించిన కొన్ని సంస్కృత శబ్దముల నొసగుచున్నాను.

అంకుశం, అమరర్, అంజనం, తిలకం, పలాశం, పున్నాగం, తమాలం, యూపం మొదలగు తత్సమములు.

అరశ (రాజ), అమిర్తం (అమృత), తవం (తపస్), అరం (ధర్మ), నేయం (స్నేహ), అరమియం (హర్మ్య) మొదలగు తద్భవములు...

గొనినవి. మదరాసు విశ్వవిద్యాలయము వారు ప్రకటించిన తమిళ నిఘంటువు (Tamil Lexicon) నందు తెలుగునుండి 488 మాటలు తమిళమున ప్రవేశించినట్లు తెలుపబడినది. కాని శ్రీ యస్. వి. సుబ్రహ్మణ్యన్ గారు 450 తెలుగు మాటలే తమిళమున ప్రవేశించెనని తలచుచున్నారు. 4 మరియే యితర ద్రావిడభాష నుండియు ఇన్ని మాటలు తమిళమున ప్రవేశింపక పోవుట గమనార్హము.

నేటికిని తమిళులు తమదైనందిన వ్యవహారములో వాడుకొను కొన్ని తెలుగు మాటలను పరికింతము.

కోమటి (కోమటి)
కొంచెం (కొంజెం)
కొంచెమా సంచమా (కొంజెమా సంజమా)
పాగాతులు (?యిల్)
ముద్దం (ముద్దు)
కోసరం
దొడ్డగాస్త్రీ (పెద్ద అను అర్థములో)
చిన్న (సిన్న)
లంచము (లంజం)
తల్లి
రవిక (ఇరవిక్కై)
రవ (ఇరవై)
లాహిరి (ఇలాహిరి)
కవ్వం
ఉబ్బసము (ఉప్పసం)
(ప్రా) పాలుమాలు (పాల్మాగు)—వ్యాకరణోరికొంత్ర ములో కూడా ఈ ప్రయోగ మున్నది)
చేరము (సేరం)
ఉగ్గము (ఉక్కం)

ఇక తమిళ కావ్యములలో తెలుగు మాటలకు తావొసగిన వారిలో తొలుతటివాడు కంబ మహాకవి అనవచ్చును. కంబడు తన రామాయణములో యుద్ధకాండమున తమ్మి, అక్కట అను మాటలు వాడెను. తిరుప్పుగళ్, విరలివిడు తూగు మున్నగు రచనములందును కొన్ని తెలుగు మాటలు కానవచ్చుచున్నవి. కొన్ని చాటువులందును తెలుగుమాటలు చోటుచేసుకొనెను. కాని చాల (శాల), చెప్పు (సెప్పు, మాటచెప్పుట) వంటి కొన్ని మాటలు నేడు వ్యవహార భ్రష్టము లయినవి; గ్రాంథిక తమిళమునందును వాడబడుటలేదు. కాని సింహళమునందలి తమిళులు మనవలె చాల, చెప్పు, చాల్ (సాల్, మా ) అని వ్యవహరించుచున్నారు.5 అనగా తమిళులు చకార లేక శకార యుక్తముగ పలుకు మాటలను సింహళము నందలి తమిళులు తెలుగువారివలె చకారయుక్తముగా నుచ్చరింతురని మనుచ నగును.

---

4. చూడుడు "Telugu Loans in Tamil" అను వ్యాసము. S. K. Chatterji Jubilee Volume 1955.

5. ఈ విషయమును సుప్రసిద్ధ విద్వాంసులు, పరిశోధకులునగు శ్రీ కి. వా. జగన్నాథన్ గారి వలన తెలిసికొంటిని.

వ్యావహారిక తమిళమునందు — ముఖ్యముగా మదరాసు, ఉత్తర దక్షిణార్కాడు జిల్లాల తమిళమునందు — తెలుగు ప్రభావము మరింత స్పష్టముగ గోచరించును. మదరాసు ప్రాంతమున తమిళులు కొందరు తెన్నంచెడి (కొబ్బరి చెట్టు), వాళచ్చెడి (అరటి చెట్టు) అని వ్యవహరింతురు. చెడి అనగా మొక్క. చెట్టును మరం అని అందురు. చెట్టు, చెడి సరూపములుగా నుండుటచే తెలుగువారివలె మదరాసు ప్రాంతపు తమిళులు కొబ్బరిచెట్టు, అరటిచెట్టు అని వ్యవహరింప సాగిరని భావింపవచ్చును. కాని మధుర, తిరునల్వేలి మున్నగు ప్రాంతములందు తెన్నమరం, వాళమరం అనియే వ్యవహరింతురు. చెట్టూ చేమ అనినట్లుగా చెంగల్పట్టు జిల్లాలో కొన్నిచోట్ల చెడి చెట్టు అనునది వ్యవహారమున నున్నట్లు శ్రీ తె. నా. కుమారస్వామి గారు నాకు తెలియ జేసిరి.

మరియొక ప్రయోగము : తమిళవైష్ణవులు సెయ్‌గాక్కొండు (చేసికొని) అనుటకుమారుగా సెంజిట్టు అని వాడుదురు. సెంజిట్టు అనునది కేవలము వ్యావహారిక రూపము. చేసికి ప్రతిరూపమే సెంజి అని పేర్కొనవచ్చును. కొన్ని తమిళ సమాసములలోను తెలుగు మాటలు ప్రవేశించినవి. ఆట్టుక్కోడ్డి, ఎరంగాడు మొదలగు మిశ్రసమాసములు తెలుగు చెందినవే. వీనిలో దొడ్డి, ఎద్దు అనునవి తెలుగుమాటలని వేరుగ చెప్పనవసరము లేదు. ఇట్టి మిశ్రసమాసములు తమిళనిఘంటువునందు 39 ఉదాహరింపబడినవి.

భాషావిషయకముగా మాత్రమే కాక రాజకీయముగాను, సాంస్కృతికముగాను తెలుగువారికిని తమిళులకును సంబంధబాంధవ్యములు కలవు. ఈ సంబంధము నేటిది కాదు. సంగకాలము నుండియు అవిచ్ఛిన్నముగా వచ్చుచున్న సంబంధమిది. సంగవాఙ్మయమునందు కొందరు తెలుగునాయకుల పేర్లు కానవచ్చుచున్నవని తొలుతనే తెలియజేసితిని. ప్రప్రథమమున తెలుగులును తమిళులును శత్రువులుగానున్నను, కాలక్రమమున వారుభయులును స్నేహితులై సంచరించిరని విజ్ఞులు తలచుచున్నారు. యశశ్శరీరులు శ్రీ ము. రాఘవయ్యంగారు నుడివినట్లు, చారిత్రకదృష్టితో చూచినచో తెలుగువారికిని తమిళులకును నడుమగల రాజకీయ సంబంధమును మూడు తెరగులుగ విభజింపవచ్చును.

తమిళులును తెలుగువారును స్నేహితులుగా సంచరించిన కాలము మొదటివిభాగము. సంగకాలమునకు పిమ్మట పల్లవమహీపతి మామల్లుని సేనాధిపతియగు పరంజ్యోతి వాతాపిని ముట్టడించి నాశము చేసికొనుటతో తెలుగువారికిని తమిళులకును మధ్య రాకపోకలు ప్రారంభమయినవి. పల్లవుల కాలమున భక్త్యుద్యమమునకు ప్రభుత్వాదరము లభించినది. ఈ యుద్యమనాయకులు దక్షిణాపథమునంతటను పర్యటన సాగించి అంతకు పూర్వము దేశమున నెలకొన్న జైన బౌద్ధమతములను పారద్రోలిరి. భక్త్యుద్యమము కూడ తమిళులను తెలుగులను సన్నిహితులనుగా చేసియుండవోపునని కొందరి యభిప్రాయము.

రెండవవిభాగము చోళమహీపతులు తెలుగునాడును హస్తగతము చేసుకొని పరిపాలించిన కాలము. ఈ కాలమున చోళరాజులు చాళుక్యనృపులతో వైవాహిక సంబంధముకూడ ఏర్పరచుకొనిరి. విమలాదిత్యుడు రాజరాజచోళుని కుమార్తెయగు కుందవిని వివాహమాడుటయు, విమలాదిత్యుని తనూజుడగు రాజరాజనరేంద్రుడు మొదటి రాజేంద్రచోళుని కుమార్తెయగు అమ్మంగదేవిని పరిణయమాడుటయు, కులోత్తుంగుడు [illegible] చోళ సామ్రాజ్యమునకు రాజగుటయు విజ్ఞులెరిగిన విషయములే. తత్ఫలితముగ తమిళులు పలువురు తెలుగుదేశమున స్థిరనివాసము లేర్పరచుకొనుటయు జరిగినది.

చోళులు బలహీనులయిన పిమ్మట విజృంభించినవారిలో ఓరుగల్లు నేలు కాకతీయనృపులు ముఖ్యులనదగినవారు. కాకతీయుల కాలమునకూడ తమిళులు తెలుగు దేశమునకు రాకపోకలు సాగించుచుండిరని పేర్కొనుటకు కంబకవి మొదటి ప్రతాపరుద్రుని (1162-1197) యాస్థానమును సందర్శించుటయే సాక్ష్యము.

మొదటి ప్రతాపరుద్రుడు ఓరుగల్లు నేలుచున్న కాలమున మూడవకులోత్తుంగ చోళుడు చోళరాజ్యాధినేతగా నుండెను. [illegible] వలననో తెలియదుకాని కంబకవికిని చోళనృపులకును మధ్య వైమనస్య మేర్పడెను. అందువలన కంబమహాకవి మొదటి ప్రతాపరుద్రుని యాస్థానమునకు పోయెననియు, కంబని కమనీయ కవితాశక్తిని చూచి ప్రతాపరుద్రుడు ముగ్ధుడయ్యెననియు తెలియుచున్నది. ఆ సందర్భమున కంబకవి ప్రతాపరుద్రునిమీద ఈ క్రింది పద్యమును చెప్పెనట!

"అవని ముళుదుణ్డు మయిరావతిత్తున్
బువని తొళువార్ పనిత్తుం బువని
తిరువరా నిన్నుడైయ ఓరంగనాట్టిల్
కుర్తుత్తిరా వాళైక్కుళామ్."

[అవనిగల జనులెల్లరు నీ కతిథులగుటవలనను, విరాగభావము తెలిపించు పట్టపుటేనుగు నెక్కి యూరేగుచుండగా నిన్నుచూచి మనసితులు మోహము చెంది మదనతాపోపశమనమునకై క్రిందవేసికొని వానిపై శయనించుట వలనను గదా! నీ ఓరంగల్లునాడున అరటియాకులు కరవయ్యెను.]

కంబడు తన కావ్యమున తెలుగుమాటలను వాడుటయే కాక తెలుగు నేలను సుసంపన్నము నొనర్చుచున్న గోదావరిని బహుముఖముల ప్రశంసించినాడు. ఉత్తమ కవిత గౌతమీ ప్రవాహమువలె నుండవలెనని పేర్కొనెను. గోదావరినడకలో కవితాలక్షణములను కనుగొనిన కంబని యీ పద్యమును పరికింపుడు.

"బువియినుక్కణియాయ్ యాన్ద్ఱు......

.......... .......... ..........

కవియెనక్కిడన్ద గోదావరియినై వీరర్ కణ్డార్."

(అరణ్యకాండము)

ఈ పద్యమున అణి, పొరుళ్, తుఱై, తణ్ణై, ఒళుక్కం అను ఐదుమాటలు గలవు. ఈ యైదును నదీపరముగాను, కవితాపరముగాను ప్రయుక్తములు.

నదీపరము :

అణి=సౌందర్యము

పొరుళ్=సారవంతమగు జలము, ప్రవాహవేగమున కొట్టుకొని వచ్చిన దుబ్బటి మొదలగునవి.

తుఱై=వివిధ ఘట్టములు (రేవులు)

తిగసులరాయుడు. వసుచరిత్రమును తమిళ మొనర్చిన అంబలత్తాడుం అయ్యన్ తొండైమన్నార్ అను గ్రామమునకు చెందినవాడగుటచే అతనికా పేరు కలిగెను. అతడు శివభక్తుడట!

అంబలత్తాడుం అయ్యన్ తెలుగున అంత పండితుడు కాడని తెలియుచున్నది. వసుమిశ్రవాయదేవుడు, బాలయ్యదేవుడు నను వారు వసుచరిత్రమునందలి విశేషములను తెలియజెప్పగా వానిని విని అంబలత్తాడుం అయ్యన్ తమిళమున వసుచరిత్రమును వెలయించెను. రామరాజభూషణుని శైలిని అనుకరించుట సులభమయినపని కాదు. అయినను అంబలత్తాడుం అయ్యన్ తన యనువాదమునందు మూలము లోని సౌందర్యమును తీసికొనివచ్చుటకు ప్రయత్నించి కృతకృత్యు డయ్యెనని చెప్పవచ్చును. ఈ తమిళవసుచరిత్రమును చెన్నపురి ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమువారు 1952 లో ముద్రించినారు. "తమిళమున ఎక్కువ కల్పనలతో విలసిల్లు కంబరామాయణము, విల్లిభారతము, నైషధము మొదలైన కావ్యములకు తరువాతిదిగా దీనిని పేర్కొనదగును" అని తమిళవసుచరిత్ర సంపాదకులు శ్రీ టి. చంద్రశేఖరన్ గారు తమ మున్నుడిలో పేర్కొనిరి. కంబరామాయణము, విల్లిభారతము మొదలగు రసవత్కావ్యములకు తమిళ వాఙ్మయమునందు బహుళ ప్రచారము కలదని వేరుగా చెప్పనక్కర లేదు. తమిళ వసుచరిత్రము సత్కావ్య శ్రేణికి చెందినదనుట గమనార్హము.

పెద్దనామాత్యుని స్వారోచిషమనుసంభవ మహాకావ్యమునకు కూడ తమిళమున అనువాదము వెలసెనని విదితమగుచున్నది. కాని యది యింకను అచ్చుపడలేదు. అట్లనే పుష్పగిరి తిమ్మనామాత్య భాగవతసారమునకు వెలసిన తమిళ పరివర్తనముకూడ అచ్చుపడలేదు.

ఇంకను తమిళ రచయితల నాదరించిన మరికొన్ని తెలుగు రచనలు కూడ కలవు. వెలగపూడి కృష్ణయామాత్యుడు రచించిన భానుమద్విజయము తమిళము చేయబడెనని బ్రౌను దొరవారు విశ్వసించిరి. క్రీస్తుశకము 1600 ప్రాంతమున నివసించిన పరమానందయతి విరచించిన వేదాంతవార్తము అను వేదాంత వచనరచనమును సదాశివయోగి 'అద్వైతార్థోపన్యాస' మను పేర తమిళము చేసెను. ఇది మణిప్రవాళ శైలిలో నున్నది.10 వేమనపద్యములు కూడ తమిళము చేయబడెను. ఈ అనువాదము 1912 కు పూర్వమే చేయబడినట్లు తెలియుచున్నది.

ఎట్టయాపుర సంస్థానాధిపతులు, హూణాంధ్ర ద్రవిడభాషా విశారదులు నగు జగదీశ్వర రామ కుమార ఎట్టప్ప మహారాజాగారి ప్రోత్సాహము వలన కవిత్రయము వారి మహాభారతము తమిళమున వచన గ్రంథముగా వెలసినది. దీనిని సంగీత సాహిత్య మర్మజ్ఞులగు సుబ్బరామ దీక్షితులు వ్రాసెను. "(ఎట్టప్పమహారాజు) శ్రీ మహాభారతమందు బద్ధస్పృహులు. కవిత్రయమువారిచే తెనిగింపబడిన శ్రీ ఆంధ్ర మహాభారతము నీ మహారాజు అనుమతివలన నాచే ద్రవిడీకరింపబడి యచ్చొత్తింపబడినది (1904?)" అని సుబ్బరామ దీక్షితులు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో వ్రాసెను. కాని నే నింతవరకు ఈ తమిళ పరివర్తనమును చూడలేకపోయితి.

శ్రీ ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర కూడ తమిళము చేయబడినది. అనువదించినవారు శ్రీ సోమలీశ్వరన్ పేరు శ్రీనివాస పిళ్ళగారు. ఆనాళ్ళలో కాశీయాత్ర ఎంత ప్రచారమున నుండెనో గ్రహించుటకీ యొక్క విషయమే చాలును.

తమిళ జాతీయకవిగా గణింపబడుచున్న మహాకవి సుబ్రహ్మణ్య భారతికి తెలుగు భాష యందును, తెలుగువారియందును ఆదరాభిమానములుగల వనుటకు ఆ విశాలహృదయుడు సంతరించిన కొన్ని రచనలే సాక్ష్యము. ఆతని దృష్టిలో తెలుగు సుందరమగు భాష; గానానుకూలమగు భాష. భారతదేశము అను గీతమునందు భారతి తెలుగును గురించి యిట్లనెను.

"సింధు నదియిన్ మిశై నిలవినిలే
    శేర నన్నాట్టిళం పెణ్గళుడనే
సుందర తెలుంగినిల్ పాట్టిశైత్తు
    తోణిగళోట్టి విళైయాడి వరువోం"

(సిరిమగాదిన వెన్నెలరాత్రిలో
చేర దేశపు చెలులు చెంతనుండగన్
సుందరాంధ్ర పదమ్ము పాడుచున్
సింధునదిని పడవ నడుపుచు వాడుదాం—)

చంద్రిక అనుకథలోను, ఆంధ్రమహాసభ అనువ్యాసమునందును సుబ్రహ్మణ్య భారతి ప్రసిద్ధులు కందుకూరి వీరేశలింగము, కొండా వెంకటప్పయ్యగారలను పేర్కొనెను. బహుశః వీరిరువురు భారతికి అభిమానపాత్రులైన ఆంధ్ర మహాపురుషులై యుండవచ్చును.

ఇక దక్షిణదేశమందలి వాగ్గేయకారులపై తెలుగు ప్రభావ మింత అంత అని చెప్పలేము. శ్యామశాస్త్రి, పట్నం సుబ్రహ్మణ్య అయ్యరు ప్రభృతులు తమిళులే యైనను తెలుగున చక్కని కీర్తనలు వెలయించి తమ సహృదయతను చాటిరి. త్యాగరాజ కృతులకు తమిళ వ్యాఖ్యానము రచించిన శ్రీ రామనాథపురం శ్రీనివాసయ్యంగారుగారి సేవను సంగీతాభిమానులు విస్మరింపలేరు.

ఆధునికాంధ్ర వాఙ్మయమునందలి ఉత్తమ కథలను, నవలలను తమిళము చేసి తమిళుల నలరించుచున్న శ్రీమతి జాన్. కె. సీతాదేవిగారిని కూడ సంభావించుట సమంజసము. శ్రీయుతులు మునిమాణిక్యం, చింతాదీక్షితులు వి. యస్. శర్మ, జనమంచి రామకృష్ణ మొదలగు వారి రచనలను శ్రీమతి సీతాదేవిగారు తమిళము చేసిరి. కళాపూర్ణోదయ కథను 'రత్నమాల' అను పేరున నీమె తమిళులకు పరిచయము చేసినారు. డాక్టరు పి. వి. రాజమన్నారుగారి నాగుపాము, శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి 'కుదిరిన సంబంధం' మున్నగునవి కూడ తమిళమునకు అనువదింపబడెను.

శ్రీ కొత్త భావయ్య చౌదరిగారి కమ్మవారిచరిత్రకు కూడ తమిళమున అనువాదము కలదని విన్నాను. ఇట్టి తెలుగురచనలు తమిళమున పరివర్తింపబడుట ఎంతయో హర్షింపదగిన విషయము. ఈ అనువాదముల వలన తెలుగువారును తమిళులును మరింత సన్నిహితులగుదురని నమ్మదగును.

తెలుగు తమిళములు రెండును ద్రావిడ భాషలగుటచే వీని వయసు అతి ప్రాచీనము. అత్యంత సన్నిహితము నగు సంబంధ మేర్పడుటలో ఆశ్చర్యము లేదు. తెలుగు తమిళమునుండి క్రొత్త సంగతు లెన్నో గ్రహించినట్లు, తమిళము తెలుగునుండి క్రొత్త సంగతులు గ్రహించుటలో వింతలేదు. ఇట్లు ఒక భాష మరియొక భాషనుండి నూతన విషయములు గ్రహించి సుసంపన్నము చెందుట వాంఛనీయము. నిజమున కిది అభ్యుదయ లక్షణము!

---

10. శ్రీ నిడదవోలు వెంకటరావుగారి ఆంధ్రవచన వాఙ్మయము (పుట 45-46)

# పిరికానుక

శ్రీ త్రిపురాన వేంకటకృష్ణరావు

ఉదయగిరి దుర్గము. అది హుజూరు జనానా మహారము; దర్వాజాలవద్ద ఖోజ్జా దౌవారికులు పహరా లిచ్చుచుండిరి. ఎచటచూచినా తొందరగా దాసీజనంబులు బురఖా ముసుగుమొగంబుల తిరుగుచు నిరంతరము తిరుగుచుండిరి. ఒక కిశోరకుమారుని వెంటనిడుకొని హకీ మొకండు సర్దారుగా హాజరునుండి అంగు వేచియుండెను. జనానా పిలుపైనది. లోన ప్రవేశించెను. అతడే శ్రీనాథ వైద్యరాజు.

అది బీగము సాహెబా జనానా మహాలు. క్రొంగ్రొత్త వన్నియ మెరసి ముఖమల్ తూలుబాలీసులతో నమర్చియున్న మేలు సోఫాపయి జేరబడి రాణి సర్దార్బేగు ఢిల్లాడి పరుండియుండె. బీబీకి వలయు నుపచారము లానటించుచు తొందరగా మెలగుచుండిరి. సింగాణీ పళ్ళెరంబున నౌషధం బల్పపానంబునో ప్రక్షాళించి సాహెబా మంజూషనకై యొక్క బాలిక నిలిచియుండె. నిశాలవృక్షము నిశ్చలంబుగా నిశ్శబ్దమై యుండె. ముందు దేవగించి మార్గమున మహోన్నతికి ఎవరియోన నాతియొక బాలిక బోధించుచుండె. ...

రాణి సాహెబా నీరోగయైనది. వాడు వైద్యకుమారునకు నవాబు బహుమానించు దినము; దివాను మొదలుగాగల పెద్ద యుద్యోగులు కొలువు నలంకరించియుండిరి; నవాబు సింహాసనాసీనుడై యుండెను; శ్రీనాథుడు ప్రత్యేకాసనమున నధిష్ఠించియుండెను. కాజీ యొకండు లేచి సభను సంబోధించి యుపోద్ఘాత వచనంబులు పలుకదొడగె.

"సకల భిషక్ప్రవీణులు యునాని హకీములుఁ గూడఁ జాల్పలే
కగడు పడంగ వీడిన మహామయ మిట్టి కుదిర్చి రాణి పె
న్వ్రగులును దీర్చి వాడుప మనోముదమందె, మహోపకార మీ
సుగుణుఁ డొనర్చె మా పెంపె దన సుస్థిర వైద్యకళాతిచాతురుల్.

రోగపరీక్ష లేక, ప్రతిరూప నిమిత్తమునే మాత్రనే, మహా
రోగనిదానముం గని, పరోక్షముగానె ప్రతిక్రియాదులన్
బాగొనరించు తీరుపు వినంబడ దెందును; వీని వైద్య వి
ద్యాగరిమంబు భూవర సమాదరణీయము, పూజనీయమౌ.

మందు లేదు మనోవ్యాధి కందు రెందుఁ; బావనము వానిహృదయంబు పంకజాక్షి;
మెట్టి సుధ చిందెనో యందు నిట్టి తోంగి నా మహాప్రభావమున నందదామయంబు.

విభవాముఖమంబుగ శ్రీప్రభు వానంగెడు నెంత గొప్ప బహుమతికే నీ
శుభమతి తగు" నంచును దన యభిలాషను దెలిపి యాతఁ డధ్యాసించెన్.

ఉర్వీపతికిని దక్కు న్నుద్యోగులకును నిలిచి వినయంబుమీఱ నంజలి ఘటించి
యా ద్విజుండు రాజభక్తి కార్యానురక్తి, తనదు నానక్తి తెలియఁగా నసియె నిట్లు.

"నా మీఁదన్ మహిళేశకుం గల నితాంత ప్రేమయే హేతు వి
యామం బొప్పిన నా చికిత్సకును; నా యందేమి లేదీ భిష
గ్గ్రామణ్యాళికి లేని యెట్టి సుకళా ప్రజ్ఞాతిరేకంబు; శ్రీ
భూమీశుండు ముదంబు నందె నిదె నా పూర్ణాశయం బిప్పుటన్."

అంత సర్దారు కనకపన్న సవనిపాలు వోల, లోని బంగరు మొహారీల తళుకు
వెలిని గప్పిన పళ్ళెరు విరులనుండి యొలుకఁ దెచ్చి పెట్టెను బల్లె మొక భటుండు.

అపుడు దివాను లేచి ప్రియ మారఁగ నిట్లు వచించు "ఱేఁడు మీ
యుపకృతికిన్ బహూకృతియు నల్లన మంది, యొసంగె వేయి నూ
ఱు, పదియు, నాలు మొహరల్ జలజారికిఁ బోఁగు వోలె; నీ
యుపదను స్వీకరింపుఁ డిది యుష్మదనుజ్ఞకు సూచకంబుగన్."

అని యా విప్ర కుమారునిం గని దివా నందీయఁబోఁగా, నతం
డను: "ఓ దేవ! క్షమింపుఁ డిట్టి యులుపాలం దేమియున్ లేదు నా
మన, మిప్పింపుఁడు మన్మనోహరము ప్రొంబన్నీగ పూ వొక్కఁ డ
న్ననయే నాకుఁ బ్రియంబు, నమ్మతీ; మదే నాపట్లఁ గట్నంబగున్."

"అగును, గులాబి క్రొవ్విరి ప్రియంబగు మీ కని తొల్లి వింటి, మా
సొగసును, దీపులే వలపు జూచి రహింతురు గాని కాన్కగాఁ
దగునని పూవుఁ గోరుదురె? త్వాదృశు లెంత రసజ్ఞులైన; నీఁ
దగు బహుమానముం గొనుచు ధన్యుని జేయుఁడు నన్ను; వేఁడెదన్."

అని జనవరుఁ డత్యనునయమున వచియించి మఱి నేయి మొహరీలం దె
మ్మని యానతి యిడి, తేరఁగఁ గొనఁడని యా యువ చికిత్సకుని నర్థించెన్.

ఒకరి మొగంబు నింకొకర యోచనులై తేలఁబోయి పశ్న సూ
చకముగఁ జూచుకొం చపుడు సర్వ సభాసదు లబ్రమంది యొ
క్కొక రొక రీతిగాఁ దలఁచి, "రొల్లక కాదిది చాల కంచుఁ, జా
లకయును గాదు నేరక ని లాఁతిగ" నాతని గూర్చి యీ గతిన్.

కను నమాయికుని బలెఁ గన్పడుచున్నాఁడె! న్యగహారమొ! జాగీరో! యడుగకుండ
నలరఁ గోరుట యేమిటి? యడుగ నేర్వకున్న నిచ్చినదే కొంట యుత్తమంబు.

ధీనిధి యతండు, దానికిఁ దెలియకున్న? యెట్టి తలఁపున నిట్టు లర్థించె నొక్కొ!
యుర్వరాంతరమున సాగరోదరమున నేమి యుండునో! యెవ్వార లెఱుఁగఁగలరు.

"ధనముతోఁ బనిలేదు, మీదయయె యున్న నోఁ గులాబి ప్రసూనంబె యొసఁగు దేవ!
యదియె పదివేలు, నాకుఁ బ్రియంబు సుమ్మ యన్ని మేల"ని యతండంత విన్నవించె.

అనుడు దివాను పల్కెఁ: "ముద మందె నవాబిడె నీ బహూకృతిన్
గొనుటయొ! చాలదంచు మఱి కోరుటయో! యిదికా దటంచు న
చ్చెవయది తెల్పుటో! కరము శ్రేయముగాని ప్రసూన మొండె మా
కొవరు నటంచుఁ గైకొనమి యొప్పదు ధిక్కృతి కూడ దేరికిన్."

తనదు చూర నీ గతి మతేమి ఘటించెనో! కాని పూజ్యమున్
బోలిన కేలికా శిఖయుఁ బోలెను భగ్గన లేచి తేఁడు సం
ప్రాణదమూర్తియై మెలఁగు రాజడుఁగా వరదార్ల్యఁ బిల్చి "యీ
భూసుర వైద్యునకు నొసఁగుం డిదె ఖౌండ"ని యాన తియ్యఁగన్.

కోకిల కాకలీ ధ్వని యిదో! యనఁ గొవ్వనఁ గేః వావి బం
ధీకృతుఁ జేయుఁడంచు ధరణీపతి యానతి యిచ్చునంతఁ బే
రాకుల పాటునన్ యువతి కాంతమునుండి వినంబడెన్ సతి
శోకము పంచుకోంపఁ బతిలోనికి న్యాతము మీఱి పోఁగఁగన్.

అడలి సుల్తాను లోనికి వెడలినంతఁ దల్లి యొడిని కుమారి మూర్ఛిల్లి యుండెఁ
చెలులు శైత్యోపచారముల్ సేయుచుండఁ దల్లడిలి తల్లి పతి బిట్టటిల్లి చూడ.

చూచిన యంతనే నృపతి శోకము పట్టఁగలేక యేమ్ముకోం
చేసిన తత్తఱంబున "నిదే మిటు లయ్యెను రాకుమారి, నన్
బ్రోచెడువారు లేరె? గుణఁ బోల్చి ప్రతిక్రియఁ జేయరారె? ప్ర
త్యాచరణీయమేమి?" యని యచ్చటఁ గూలఁబడెన్ మహోర్మిమై.

బీగము సాహిబా యపుడు భీతిలి వాకొన మాట రాక మూ
ర్ఛాగతపోలె నుండ నొక యాలి వచించు: "నదేమొ! మీరు వై
దీక నొసంగ్గఁడి ధరణిదేవ కుమారకు నన్నతోడ మూ
ర్ఖోగ మదెట్లు లన్నయదియో! సుత మూర్ఛిలె నేమి సెప్పఁగన్.
అనిపిన తోడ్కొనివచ్చిన సత్రబోధకును మఱియు నిటుల చూపినఁ బనిలే
దతడే కుదుర్పఁగలఁడ"ని యతివ నుడువ తేఁడు నటులె యాజ్ఞాపించెన్.

అంతయుఁ బాదషా కొక మహాద్భుతమై పొడకట్టె వారి యే
కాంత పరస్పర ప్రణయగాథ వియన్నది నాఁ దనర్చు దు
ర్దాంత నిజాభిజాత్యమునతో మలినీకృతమైన యా ప్రభు
స్వాంతమునందుఁ బొటి యట వానిఁ బ్రసన్నుని జేసె నంతటన్.

పెంపుల శైత్యోపచారాలనఁ దెలివిఁ గనియె రాసుత; ప్రభునాజ్ఞ నవసించి
వైద్యుఁ గొనివచ్చి తెరయావల వసిగఁ డోడయని యనుజ్ఞకై వేచియుండెనపుడు.

నృపతి కుమారిఁ జేరి యను "నేల వచింపవు తల్లి! నీ మనం
బెపుడును నాకు; నీకుఁ బ్రియ మెయ్యదియో యది నాకుఁ గాదె? నీ
కపుడు డులలోం మా కపవ్వు లాగెను, నీకు మజేమి బాధలే
దిపుడు గదమ్మ! నీ మనసు నిప్పుడ తీర్చెదలెమ్మ తల్లిరో!

మీ దాంపత్యము దైవకల్పితము మీ మేలైన మేల్ దివ్యమై
కాదా? మాన్యము, మీ పరస్పర మనఃకాంతుల్ పవిత్రంబు, ల
క్ష్యాదర్శార్హము, మీ వివాహమున కేలా? యింక సందేహ సం
వాదంబుల్ మతభేదముల్ తనయ! నీ స్వాంతం బిదే యౌఁ గదా."

అనుటయు రాణియు నారాట్టనయయుఁ దమ సమ్మతులను దమ చూపులలో
కనములనే తెలుపుటయును జనపతి పలుకున్ వెలుపలి సర్దారు వినన్.

"మనసు గలసిన తఱి మఱి మఱుఁ గదేల? యతని విడువుఁడు లోనికి నగుగుదెంచు"
ననుడు రాణియు రాసుత చనిరి దవ్వు తెరలలోనికి శ్రీనాథుఁ డరుగుదెంచె.

పలుకు నవాబు: "మీరు ప్రతిభావహాసీయు లటంచు ధర్మ వి
స్తులమతులంచు నే నెఱుఁగుదున్ దొలి, యిప్పుడు మీ యచంచలా
చలనమథైర్యవర్తనము సత్యమయ ప్రణయైక దీక్షయున్
దెలిసికొనంగ నేఁ గలిగితిన్ గడు ధన్యుఁడనైతి భూసురా!

కృపణుఁడనై యరయక మీ యుపకృతి కపకృతిని జేయ నూహించితి, నా
యపరాధమ్ము దలంపక కృప మీ తలఁపోక పరి నెఱఁగింపుడు మఱఁన్ "

అనవుడు విప్రకుమారం డను: "నా సాహసమునకు సమాధానము నో
జనవర! నావల యీవలసినయది మఱియే నవాబు చెంగట నేనిన్.

తనుకు నింతవట్టు దయయున్న నామీఁద నొక గులాబి విరియె యొసఁగుఁ డదియ
నా కుపాయనంబు నా కిష్టమౌ; నదే నా మనోరథంబు నా ప్రియంబు."

నావుడు పాదుషా యనువు: "నా కది జీవము, జీవనంబు, సం
జీవని, జీవికా పరమ శేవధి; యీవిరి జీవిత ప్రథా
నావధి నే విధిన్ విడుతు? నైనను దత్సుమ వల్లికం బున
ర్జీవితఁ జేసి యిచ్చిరి చెట్టిడుచోఁ బువు నీయఁ గష్టమే?"

అనుచుఁ దెరలోనికని జని తనకుమారి విరి గులాబియా గుల్నారు కరినిశ్చిగ
యొడలు వడఁ కొడఁ గన్నీరు వోడము నతఁడు మాటరాక గద్గదిక రాఁ గ్రేటుకొనుచు.
"రమ్మిటు తల్లి! నా తనయ! రమ్మ మఱుంగిక వేల నీకు నీ
వమ్మిన కాంతు పొంతను? బుణం బిటు నేఁటికిఁ జెల్లె నీకు మా
కమ్మరొ! నీ మనఃప్రియున కర్పణ చేసెద రమ్మ"టంచుఁ గం
పమ్మునఁ గూఁతుఁ దోడ్కొనుచు వచ్చి పొరిన్ వచియించు విప్రుతో.

"ఇదిగో! మీ విరికాన్క, యియ్యది నమం బిద్దాని కయ్యా రహ
స్సదనాలంకృతి కాని కాక ప్రభు పూజావేదికంగూడ నో

అమెరికనులలో నవతరమున కలిగిన చింతనాశక్తి అత్యంత వ్యాపించెను; దాని పైననే మాపునఃపుటయు బుద్ధికంతగా మనకు నున్నను, మనస్సున కంతగా సంతోషప్రదమును గాదు. ఈ యాన్వేషణము వలనను, వ్యగ్రత వలనను మేలెంతకలదో, కీడు నంతకలదు. సార్థక (ప్రసిద్ధి)తివృత్తము, సువ్యవస్థ బంధము, సమన్వయము వనునవి లభించుట వీనివలని మేళ్లుగా చెన్నదగును. ఇంగ్లాండులో యున్న కాలమును నవలాకారుల యుగమనుటకంటె నవలల యుగమనుట లెస్స కాని, అమెరికాలో నట్లు కాదు. సింక్లేర్ లూయీ, జోసఫ్ హెర్గిషైమర్, విలాకేథర్, విలియం ఫాక్నర్ వంటి ప్రసిద్ధ నవలాకర్తలు కనీసము రెండుడజనుమంది కలరు. వీరెవ్వరును యేదో యొక నవల వ్రాసి పారవేసినట్టివారి పట్టికలోఁ జేరువారు కారు. వీరికృతులు విశిష్టములైనవి. అవి యితరులవని భ్రమపడుటకు వీలులేదు. వీరి కృతుల యందెల్లడను ప్రతిపాద్యమున న్యూతిమై యుండును. అవి భిన్నముగ సంబంధరహితముగ నుండదు. అట్లే వీరి సృజనాత్మక శక్తియు వేయొక్క కృతి నిర్మాణము చేతను నుడిగిపోవునది గాదు.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతర మేడాదిలోపున వెలువడిన సింక్లేర్ లూయీ నవలపేరు "రాజవీధి"1 అది యెంత వాగ్వాదములలో యెంత ప్రఖ్యాతి సంపాదితము, నంత యసాధారణమునకు సర్వప్రియత్వముఁ గలది. సింక్లేర్ నకుఁ బూర్వగాముఁడగు డ్రైసర్ నెందరో యెఱుఁగరు; కొలఁదివారే యెఱుఁగుదురు. తన ప్రమేయము లేనిచోటఁ గూడ జోక్యముఁ గల్పించుకొను కొన్ని యనధికార పరిశీలనసంస్థలు అతని నెఱుఁగును. ఇతని నవల2 అమెరికనుల సంప్రదాయము పైనను, నవనీతి పైనను గంప వ్యాత్రం. 'సింక్లేర్ లూయీ' నవలయైన "రాజవీధి" డ్రైసర్ నవలలకంటె తీవ్రతరమైనది. అమెరికనుల మూఢత్వ స్వార్థపరత్వములకది గొడ్డలిపెట్టు. అయ్యును నది లోకప్రియతను సంపాదించెను. ఈ ప్రజాభిమానమునకు ప్రధానహేతు వా యా నవలలలోని గుణము గాదు. సింక్లేర్ లూయీ కథనరచనము, డ్రైసర్ రచనము కంటె మనోజ్ఞముగుచో నాతని నవలలోని నాయిక యందుకంటె నీతని నవలలోని నాయిక (జెన్నీ)3 యందధికమైన మానవత్వమున్నది. కాని యివి యేవియు నంత ప్రధానములైనవి గావు. తనకుఁ బూర్వుఁడైన వాని కంటె నీ యువకుఁడు, ప్రబోధితమైన తాత్కాలిక సాంఘిక మనస్థితిని, యుగలక్షణమును బాగుగ గుర్తించినాఁడు. అదియే యాతని కీర్తికిఁ బ్రధానహేతువు. సంఘము తన్ను గూర్చి తాను వినుటకు సిద్ధముగా నుండును. అది కేవలము ప్రశంసయైయుండఁ గాదు; ఔత్సుక్యము. ప్రచారము, ప్రాంజలమైన భావలో దానికి దానినిఁ గూర్చి మనము చెప్పవలెను. అది తా నెప్పుడెట్లు రచయిత కంటఁబడినదియు వినఁగోరును. సంఘము, తాను సృష్టించిన జీవితము నాదర్శముతోఁ బోల్చి గాని రచయిత విశ్లేషింప వీనసమర్థులగుదురు. 'లూయీ'యు, నతని యనుయాయులును ప్రకృతి

(1) 'Main Street' is the novel of Mr. Sincliar Lewis.

(2) 'Jennie Gerhardt' and 'The Financier' are the novels of Mr. Dreiser (3) 'Jennie' is the heroine in 'Jennie Gerhardt' of Mr. Dreiser, the fore runner of Mr. 'Sinclair Lewis.'

సైతము ఫ్రెంచి ప్రభావమునకు లొంగిపోయిరి. ఇటియుదాహరణములు ఫ్రెంచి యువకులకు నవోత్సాహము, నూతన విశ్వాసమును గల్గించినవి. వీరా భావచ్ఛాయలలో నేనో క్రొత్తదనము జూపింప నభ్యాసము లూగిరి. వీరి కొంగ్ల భాషయందతిపరిచయముచే నవజ్ఞ కలిగినది. అందుచే నా భాష వారికి సమర్థమైన వ్యక్తీకరణ సాధనముగాఁ దోఁపలేదు.

అటు సాంకేతిక ప్రతిపత్తిఁ జూపగల 'ఎర్నెస్ట్ హెమింగ్వే' మొదలుకొని, యిటు పూర్వాచారపరాయణతకుఁ జేరవచ్చిన 'లూయీ బ్రూమ్‌ఫీల్డ్' వఱకు నీ ప్రభావమునకుఁ బ్రబోధితులగుటలో నాశ్చర్యము లేదు. ఏలన, వారు చాల కాలము పారిస్ నగరమునందుండిరి. కాని, చిరకాలము అమెరికా సంయుక్తరాష్ట్రములయందే తమ జీవితమును గడిపిన విలియం ఫాక్నర్, 'జేమ్స్ కజిన్స' వంటి వారికిఁ గూడ నీ ఫ్రెంచి ప్రభావము సంక్రమించుటలో నాశ్చర్యమున్నది. ప్రౌస్ట్ స్వీకరించు విషయముతో జాయిస్, స్టైయినుల విధానమును సంధానించి, పరిశీలింపఁగలవారికి యీ ఫ్రెంచి ప్రభావ మవగతమగును. మన యనుభూతికి సన్నిహితములుగాని, యాంగిక వాచకాభినయములు గల పాత్రలను భౌతికముగ సన్నిహితముఁ జేయఁగల భూతగ్రహణ యంత్రమువలె నా విధానమునందుఁ బాత్రల పరిశీలన ముండును. ఆ పాత్రల యాథాతథ్యమునకును, మన యాథాతథ్యమునకును నడుమనున్న వ్యత్యాసమును సూచించు తేఁడలెఁగూడ నీ పరిశీలనా కటకము తోడ్పడఁగలదు. కాని యీ ఛాయఁగల రచనము లోకాదరముఁ బడయఁజాలకపోయెను. అందు చిత్రీకరింపఁబడిన పాత్రలు, దృశ్యములు, నింతకుఁ బూర్వము పరిచితములైనవుడు నవియంత దుర్గ్రాహ్యములై నిరాదృతములైనవి. ఈ కాలమున నమెరికాలోఁ బ్రముఖుఁడైన నవలాకర్త విలియం ఫాక్నర్ స్వస్థానమున స్వభావమునందు సర్వప్రియత సంపాదింపలేకపోవుటకుఁ గారణమీ ఫ్రెంచి ప్రభావ మతనిలో స్ఫురించుటయే యనఁదగును.

ఫాక్నర్ రచించిన వైదు నవలలు. ఈ యైదింటియందును సంయుక్తరాష్ట్రములలో దక్షిణభాగమె రంగభూమి. అచటి ప్రాగేయులకును, మధ్య ప్రతీచ్యాంశమువలె నీ రంగవిన్యాసమాంగేయ పాఠకులకంత సుపరిచితము కాదు. భాషా విషమత్వము నకుతోడు నీ నవలలు తీవ్రబలాత్కారమును, ప్రబల దౌర్జన్యమును, సంకుచిత సాంఘిక శాఖాభిమానమును సూచించుటయే ప్రధానముగ గోచరించును. సురాపానము, పాశవిక కామము, మనస్మారము, మున్నగు నీచమానవ దోషము లీ నవలలలో క్రియావేగమునకుఁ దోడ్పడుచున్నవి. వీనికన్నిటికిని గార్యరంగము 'మిసిసిపీ'నది క్రింది పరీవాహప్రదేశములో నొక నూత్నభూభాగమన్న సంగతి నతఁడు మఱపు రానీయఁడు.

అప్పటికప్పుడు నమ్మరానివై, భీతినిఁగొల్పు రకరకములైన దౌర్జన్యముల నతఁడు చూపును. ఆ పాత్రలు 'డొస్టవెస్కీ' పాత్రలవలె వికృతములు, హాస్యజనకములునై యుండును. ఫాక్నర్ రూపొందించిన కృతులు పాసవ్యతేనముగ నెంతి స్వచ్ఛతాశోభితములో జాతీయతచే నంత యమెరికా సంయుక్త రాష్ట్రీయములు. ప్రజాంతర్యుద్ధ ఫలితముగఁ బ్రబలిన క్షేమవినాశముల నడుమఁ బ్రజ్వరిల్లినవి. కాంప్సన్స్ (Compsons) కుటుంబము. శ్రీజకోనప్యక్షమున నట్టి శ్వేతజాతి కుటుంబమునకుఁ జెందిన యతివృత్తము సందానవిక క్రౌర్యము, మూర్ఖత, దురాశ, యాత్మహత్య, రక్తసంబంధుల కాముక వ్యాపారాదికము నుండుట యంతి యసహజము గాదనవచ్చును. అపరిపక్వము, నపరిష్కృతమునగు

భావ కొంత కొంతకుఁ బరిపక్వము బరిష్కృతము గాఁగా, కృతకము వస్తుత విషయ విశిష్టమునకు గూఢ భేదములవలె నందు ఘట్టములు పోనుపోను పరిశుద్ధములై నెగడిన యాతని నవలలును గలవు.

కేవల ప్రతిభయందును, సంఘ ధర్మాభిజ్ఞతయందును 'లూయీ బ్రూమ్‌ఫీల్డ్' కంటెఁ గించిదల్పుఁడయ్యు, ఫాక్నర్ జాతీయమైన నవలా నిర్మాణకళయం దధికుఁడు. అతని సాంఘిక శాఖాభిమాన మనగుణమునకంటె గుణమైనది. ఇంగ్లాండు నందలి యుగకుసంగులలో, మూల మూలలలో నివసించి వానియందుఁ బక్షపాతము, నభిమానమును జూపినంతమాత్రముచే డికెన్స్, హార్డీ ప్రముఖు లాంగ్ల నవలాకర్తలు కాకపోయిరా ?

ఇకని కర్యు యించుక వికృత ప్రభావముల సాంకర్య ప్రవర్తనము. చాలవఱకు మాండలికము నీగ్రో జాతిది; పరూసములు జర్మనులవి.

ఈ దృశ్యమైన సంకుచిత జాతీయత విరసింపఁ దగినదనియు, నవలలలోఁ గాల్పనిక జగత్తులు సృష్టింపఁ బనవలెననియు వాదించు వేఱొక శాఖవా రమెరికాయందు బయలుదేరిరి. మిస్ 'విల్లా కేథర్' వీరిలో లబ్ధప్రతిష్ఠురాలు. 'జేమ్స్ బ్రాంచి కేబెల్' కట్టుకథలలోను, 'జోసఫ్ హెర్గ్‌షైమర్' ఐతిహాసిక కథలలోను, కాల్పనిక శాఖయందును ప్రఖ్యాతులు. తన జీవితకాలమునవే యనన్యమగు ప్రజాదరమును జూఱగొని నిస్తంద్ర కీర్తి సాంద్రయైన మిస్ విల్లా కేథర్ తొలుదొల్త రచించిన రెండు నవలలయందును వాస్తవ్యాను దుస్త్యజముగుటచే మధ్య ప్రతీచ్య వాతావరణమున్నది. కాని, ఫాక్నర్ ప్రభృతుల సాంఘికాచార పరిశీలన నైశిత్యమును, సంకుచిత జాతీయతా పాక్షికతయు లేవు. భావపారశ్యమునకు శయ్యాసౌభాగ్యమునకు కేథర్ ప్రసిద్ధిఁ గన్నది. కాని, యామె సమకాలిక జీవితమును జిత్రింపలేదు. భూతకాలిక చిత్రణమునకే తన ప్రతిభ సమర్థమని స్వశక్తిని గుర్తించుకొన్నదేమో ?(5) మహాకావ్యము లనఁదగిన యిట్టి నవలికలయందామె క్రమక్రమముగ సిద్ధహస్తురాలయ్యెను. ఈ తరములో నింగ్లాండునందు విల్లా కేథర్ కంటె సర్వాతిఁ గలిగి యశస్వియైన వారి నమెరికాలో జూడఁబోము.

దివ్య వస్తువు, శిల్ప సౌందర్యము, వీరపూజ, విస్మృతిరసభావ భావనా పరమశము, నన్నియు నెప్పటియట్లే యున్నను నీమె కృతి రచనలలో సంజ వెలుఁగుల వెండి వెలవెలలు విలవిలలాడినట్లుఁ దోఁచును. ఇది యొక కేసరి నవలలయందే స్ఫురించినచో నది సహజముగ శిల్పులందఱకు వార్ధక్యముఁ గలుగు సమయ దశయేమో యనుకొందుము. కాని యీనాఁడు 'థార్టన్ విల్డర్', 'ఆలివర్ లాఫార్జ్', 'రాబర్ట్ నేథన్' ప్రముఖులగు యువకుల రచనలలోని శక్తిగూడ క్రమముగ క్షీణించుచునే వచ్చినది. దీనిని బరిశీలింపఁగా సమకాలిక చిత్రణమెంత వికృతము, నవినీతికరము, దౌర్జన్యపూరితము నైనను, దానిఁ గాలికే శక్తియుక్తులతోఁ బరుగులిడి ప్రత్యక్ష జీవిత జలావర్తమున సుడులు తిరిగి మునిఁగి పరిసరముల నన్ని వెంటల వేఁటాడుట యంకే నవలాకారుల జవసత్త్వములున్నవా యనిపించును. ఏనను, దేశకాల వ్యవస్థాపరిచ్ఛిన్నములుగాని రచనలు సాగించు సముచిత భావనాపరులకు, భాషాసంప్రదాయాభిజ్ఞులకు, సుదాత్త ప్రతిభాశాలురకు, స్వచ్ఛ శిల్పులకు, నే నాగరిక దేశమందైనను గౌరవస్థానముండుట యుచితము. అట్టిది, యమెరికనుల నవలా సాహిత్యమున నిట్టివారి వీరలలో లేనట్లుఁ దోఁచును. తాత్కాలిక నిత్య నైమిత్తిక పరామర్శకులకే యెక్కువ భావి యున్నట్లు స్ఫురించును. కాని, యనుభవాతిశయ పరిపూర్ణమైన భూతకాల మనివార్యముగ భావికాలమున కమూల్యమగు శాసనరూప సందేశము నొసఁగక మానదు.

# నాలుగు స్తంభాలాట

శ్రీ బూదరాజు శ్యామసుందరరావు

## వచ్చేవారు

రాం......చిత్రకారుడు......వయస్సు 25 సం॥

కాంత్ } రాం స్నేహితులు { వయస్సు 30 సం॥
కిరణ్ } { వయస్సు 22 సం॥

శశికళ......రాం ప్రియురాలు...వయస్సు 20 సం॥

[స్థలం : విశాలమైన చిత్రశాల సమయం : ఉదయం 9 గం॥లు (తెర లేచేటప్పటికి) చిత్రశాల గోడలనిండా బొమ్మలతో నిండివుంటుంది. రెండు, మూడు కుర్చీలు, బల్ల, ఫోటోస్టాండు, పడక కుర్చీ వగైరా. రెండు మూడు సగం గీసిన చిత్రాలు చెదురుమదురుగా స్టాండుమీద పడేసివుంటాయి. ఒక కాన్వాసు, సగం చిత్రం వ్రాయబడింది, స్టాండుమీద వ్రేలాడుతూ వుంటుంది.

సామాన్యమైన సౌందర్యవంతుడు రాం పడకకుర్చీలో కూర్చుని వుంటాడు. చేతిలో కలర్ పెన్సిల్, ఏదో ఆలోచిస్తున్నట్లు అతిడికళ్ళు అరమూతలు పడివుంటవి. తెరలోంచి "అరే రాం" అని కేక వినిపిస్తుంది.]

రాం : ఎవరైనా స్వాగతం. (కళ్ళు తెరచి తెరవైపు తిరుగుతాడు.)

కిరణ్ : (ప్రవేశిస్తూ) నేను రా కిరణ్ని. (అందమైన విగ్రహం. నీటైన ముస్తాబు. నటుడిలా వుంటాడు.)

రాం : ఆ కుర్చీ లాక్కొని కూచోవోయ్. ఏం కథ? ప్రొద్దున్నే బయల్దేరావు.

కిరణ్ : (కూర్చుంటూ) ఏం లేదు. ఊరికేనే బయల్దేరాను. ఏంచేస్తున్నావో చూద్దామని.

రాం : ఏదో మామూలు ధోరణిలో ఆలోచిస్తూ కాలం గడుపుతున్నా బ్రదర్.

కిరణ్ : మరచిపోయాను. పోటీకి బొమ్మ వేస్తానన్నావు. ఏంచేశావు?

రాం : ఇలాంటి వాటికి తేల్లేదోయ్. సరైన మూడ్ రావడంలేదు.

కిరణ్ : నాన్సెన్స్. ప్రతి ఆర్టిస్ట్ మూడ్ మూడ్ అంటాడు. ఏమిటో గొడవ!

రాం : అదంతా తీరిగ్గా ఆలోచిద్దాం. ఆ కాన్వాస్ పెయింట్ చూడు. ఇంకా పూర్తికాలేదనుకో—సరికొత్త అభ్యుదయ భావాల్తో చిత్రింపబడ్డది.

కిరణ్ : (లేచి కాన్వాసు సరీగా చూస్తుంటాడు) ఆ బావుంది, కానీ—

రాం : (చిరునవ్వుతో) అబ్బ. నీ కానీ రానేవచ్చింది—ఏమిటి నీ సందేహం.

కిరణ్ : నీవు వేరవిధంగా భావించకుండా వుంటే—

రాం : ఎందుకలా అనుకోవాలి?

కిరణ్ : చిత్రంలో భావస్ఫురణ బాగానే వుంది.

రాం : మరి ఏమిటి లోపం?

కిరణ్ : తొందరపడతావేం? నీ చిత్రం హృదయాన్ని బాగానే గాయపరుస్తుంది. కానీ ఆ గాయా లెప్పటికీ మానేరకం కాదు. అసలు మానుతుందా అని నా అనుమానం.

రాం : పిచ్చివాడా! ఎందుకు అనుమానం? చిత్రాన్ని బాగా పరికించు తీక్షణంగా పరిశీలించు. అందులోని రంగులు—నా భావాలకు రూపాలు. ఈ చిత్రంలో తొంగిచూసే భావం—నా హృదయంలోని వెలుగు—కాంతి పుంజం. (ఆవేశంగా) నా కన్నీళ్ళు—నా ఆశతో—దేనికోసం విడిపించానో—ఆ ఆశ—ఆ ఆశయం ఇందులో ప్రతిఫలించింది. అది తీరని కోరికై—అందని ఆ అద్భుత ఫలం కోసం—తీరని దాహంతో. దుఃఖితమనస్సుతో బాధపడమని శాసిస్తుంది. నన్ను హింసిస్తోంది.

కిరణ్ : నిజమే. నేను కాదనటంలేదు.

రాం : అలాంటప్పుడు. ఆ చిత్రరంగు చూడు—అర్థం చేసుకో. ప్రపంచంలోని మానవుల క్రూరత్వాన్ని జుట్టుపట్టి బయటికి లాగి నిరూపిస్తున్నది. ఇందులో రాక్షసి ఒక మానవుడు. ఇంకో మానవుడిమీద—కళ్ళుబలిసి, క్రొవ్వెక్కి, మదించి, కళ్ళు పొరలుక్రమ్మి చలాయించే దురహంకార చిహ్నం, చూడు. అటుంచేసుకో—వాడు—ఆ బక్కచిక్కి, చెక్కిళ్లు లొక్కుపోయి, డొక్కలు పీక్కుపోయి—కాళ్ళు చచ్చుకున్న పిల్లల్తో, శోషపోయి తిన్న అనుకున్న భార్యతో, దోపిడిపట్టి, విషాదవదనంతో వున్నాడే—వాడు ఆకలిలో కానికి త్రొక్కివేయబడ్డ మానవుడు. దరిద్రదేవత బంది—ఒక మానవుడి వికటాట్టహాసం—ప్రళయకాల ఝర్జ్యాగర్జనలా దడపుట్టిస్తే వణికిపోతున్న శిథిలమానవుడు, జీర్ణకృశాంగుడు.

కిరణ్ : (కాన్వాసును పరీక్షగా చూస్తుంటాడు.)

రాం : కిరణ్, అదుగో వాడు నిజమైన మానవుడు. పీడితుడు విగించలా? ధృఢంగా వుండలా—రొమ్ములా వుండి—వలకలా లేదూ—వాడు దూకుతున్నాడు బరిమీదికి—ఈ కుళ్ళు సంఘాన్ని—పొగరెక్కి విర్రవీగే దురహంకార చిహ్నాన్ని—సవాలు చేస్తున్నాడు. "నా హక్కేది?"—అంటున్నాడు. ఏ కిరణ్ ఈ చిత్రం కదిలించదూ? నా ఆవేశం, నా ఆశ, దీన్లో ప్రతిఫలిస్తున్నాయంటావా? చెప్పవేం?

కిరణ్ : ఎలాగూ చూడమూ — వరేగాని. ఒక స్త్రీ ఏకాంతంగా నిన్ను కలుసుకుంటుం దనుకో — నీలో ఏం భావాలు జనిం చవా? ఏ కోర్కెలు రేకెత్తవా?

రాం : అంతవరకూ రానిచ్చేదెవరు? నే నే స్త్రీని ఏకాంతంగా కలుసుకోను. అందుకు యిష్టపడను కూడా.........

("అది పిరికితనం" అంటూ కాంత్ ప్రవేశిస్తాడు. పూలపూల బుష్ షర్టు. చేతిలో పూవు. మంచి షోకిలాలా వుంటాడు. మధ్య మధ్య పూవు నాఘ్రాణిస్తూ పచార్లు చేస్తుంటాడు.)

కాంత్ : రాం. నేనన్నది వినపడిందా? పిరికితనాన్ని అసహ్యించు కుంటాడు ఈ కాంత్.

రాం : అది పిరికితన మెందు కవుతుంది?

కిరణ్ : ఎలా అవుతుందో నే చెప్పనా.

కాంత్ : నివ్వేం చెప్పగలవోయ్. పాలబుగ్గల పాపవి. నే చెపుతా విను రాం. ఈ కాంత్ ఎంత అనుభవశాలో నీకు తెలుసుగా?

రాం : ఆ. ఏకాంతంగా కాంతా కాలక్షేపం. తమకు దినచర్యలో ప్రథమఘట్టం. ఆ నే మహాత్మ్యం ఎలా మరిచిపోగలను.

కాంత్ : ఇంకేం. అందుకనే నిన్ను "పిరికివాడివి" అంటున్నాను. ఒంటరిగా స్త్రీని కలుసుకోడాని కెందు కంత భయం?

రాం : భయం కాదు. పిరికితనం అంతకంటే కాదు. ఎందుకు ఒకర్ని ఒంటరిగా కలుసుకోవాలి? ఏమిటి అవసరం?

కిరణ్ : అవసరమో, అనవసరమో ప్రశ్న అడుగుదాం కాని, పపోన్ నీకు తటస్థపడిఉంది అనుకో — అప్పుడు —

రాం : అప్పుడు. ఆమె అనుభావాన్ని, అనుభూతుల్ని వివరించ మంటాను. అర్థమయ్యేదాకా ప్రశ్నల్తో ప్రాణం తోడ తెలుసు కుంటాను. ఆమె అనుభవాలకీ, ఆశలకీ, ఆశయాలకీ — నా జీవితానికీ, ఆచరణకీ మధ్య అంతరం, ఎడం ఎంతవుందో తెలుసు కుంటాను. ఆమెతో హృదయం విప్పి మాట్లాడుతాను.

కాంత్ : Wonderful. పుటికిన్న కథన్ను కథన్ను కలుపుతావు. హస్తాలు జోడిస్తావు. "ఓ నా ప్రణయదేవతా" అని అష్టోత్తర నామాలు జపిస్తావు. ఆమె కులుకులో, తళుకులో, బెళుకులో, హొయల్లో, చూపుల్లో మునక లేస్తావు. ముగ్ధుడవై మురిసిపోతావు. ఆమె కలిపమై, కంచుకమై, జడలో పువ్వువై, కంటిలో పాపవై, కనుకొలకులో వెలుగువై, చెరగులో అంచువై, కుచ్చెళ్ళలో ముడతవై, ముంగురుల్లో వెంట్రుకవై, నిట్టూర్పులో వేడివై, 'ఐస్'లో బాధవై శ్యమేవాఽహం, తాదాత్మ్యం అని పలకరిస్తావు.

రాం : టక టకా! నీ అనుభవం అంతా కుమ్మరించేశావేం మా సెత్తిన, అంతా మీలాంటి యంత్రబహ్మలే అనుకున్నావా ఏమిటి ఖర్మ?

కిరణ్ : అనుకోడమేం. చూస్తాంగా రాం. నీ గొప్పదనం.

కాంత్ : రాం బుద్ధుడు, వివేకానందస్వామి! ఇంకా — ఇంకా —

రాం : ఇంకా అను నీ యిష్టం వచ్చినన్ని.

కిరణ్ : ఏమైనా "నవిత తినంత తా వలచివచ్చిన" అంత సులభం కాదు నన్ను ముట్టమాకు అనడానికి.

రాం : అబద్ధం. మీ వృథాప్రచారం.

కాంత్ : కిరణ్. "తెలిసి తెలియని వయసెల్ల ప్రమాదకరమైన వశమే" అన్నారు పెద్దలు.

కిరణ్ : అదీ చాలదు. "అనుభవంలోంచి వివేకం వస్తుంది. మరి అను భవమో? అవివేకంలోంచి" అన్నారు సైమన్ బోలివర్ బక్నర్.

రాం : అందరూ అన్నీ అంటూనే వుంటారు. అసలు మీకు ప్రపంచ జ్ఞానం తక్కువ. "ప్రపంచజ్ఞానం అంటే ఏమీ లేదు. మానవుల లోటుపాట్ల సమూహం" అన్నారు డికెన్సు.

కాంత్ : ఆఖరికి మాకే ఎసరు పెట్టావూ. నీవు ఎక్స్పెరిమెంట్ చేసి చూడు. నీకే తెలుస్తుంది.

కిరణ్ : వీడికి తెలీటం కష్టం. మానవులు, పుణ్యగమనం — ఆకలి మంటలు, ఆకలి చావులు — ఇవితప్ప ప్రపంచంలో కులాసాగా, హాయిగా ఎంజాయ్ చేయటానికి ఏమీ లేవంటాడు ఈ అభ్యుదయవాది. వీడికి ఆ పాడురొచ్చులో ఏం ఆనంద ముందో?

రాం : ఆ పతనం కూడా రొచ్చే. ముద్దులో ఏముందోయ్ తీపి. పెదవులు కలుస్తాయి. ఒకరి పెదవి సిగరెట్ కంపు అయితే, ఇంకొకరిది "లిప్‌స్టిక్" (Lip-stick) వాసన. పైగా లాలా జల ప్రవాహం. అంతకంటే '...' రుచిమూడొచ్చు.

కాంత్ : Hopelessly Dirty fellow. "The last puff of a cigarette is equal to the fist kiss of a lass" అన్నారు పెద్దలు. ఎంతమాధుర్యం చవిచూసినదే అంతమాట అన్నారూ అని నా భావన. నా సొద ఒకడూ ఆలకించడేం?

రాం : చెవుల తుప్పవదిలేట్టు వింటున్నా కాంత్.

కాంత్ : నివ్వేమన్నా అనుకో రాం. ఇంతకీ నే చెప్పదలచుకొన్నది ఏమిటి అంటే స్త్రీలని ఉద్ధరించాలి అని. ఆ ఆశయం నా చిర సంచిత ధనసంచయం లాంటిది. నన్ను వేధిస్తున్న తపన పెను తున్న మహత్తరమైన, మధురాతి మధురమైన వాంఛ.

రాం : ఉద్ధరించు. ఎవరు వద్దన్నారు?

కాంత్ : కాబట్టే, నా వాంఛకు బూజుదులిపి పాలిష్ పెట్టాలంటే — వాళ్ళను బుర్రగలవాళ్ళుగా సబలలుగా, స్వతంత్రాభి ప్రాయాలు గలవారుగా తయారుచేయాలి. ఆర్థిక స్వాతంత్ర్యం వాళ్ళకు వచ్చేందుకు తగినస్తోమత కల్పించాలి. కమ్మరిలా సాగగొట్టి వాళ్ళబుర్రల్ని మరామతు చేయాలి.

రాం : అంటే. పాతలాంతర్ని అలంకరించి ఉద్ధరించి, ఎలక్ట్రిసిటీ లేనిరోజున బాగుచేసుకున్నట్లా?

కాంత్ : ఎగతాళి చేయవాకోయ్. యుగయుగాలుగా స్త్రీ దుర్గతి అనుభవిస్తోంది.

రాం : నీకు కనువిప్పు ఇప్పుడు కలిగిందా?

కిరణ్ : నీ ఇష్టం వచ్చినట్లు ఉద్ధరించవోయ్. ఎవరు వద్దన్నారు?

కాంత్ : అదికాదు. రాం ఎగతాళిగా మాట్లాడుతుంటేను, కవి ఏమన్నాడో తెలుసా?

"నా కవిత్వం—

వేయి గులాబీలకొమ్మ
మొగ్గ విచ్చి పరిచిన
వేయి బూరగదూది పరుపుల దొంతర్లు
నిజం. నిజం.

"నా కవిత్వం—

జ్యోత్స్నా వధూ నేత్రాల్లో
ఉజ్వలంగా వెలిగే
లేత కిరణజీర
జీవలో దాగిన
ఇంద్రధనువు.

నా కవిత్వం—

ప్రేయసీ ప్రియుల హృదోపగూహనమ్ముల మెలగు
ఉన్నత శక్తోజ ఘర్షణమ్ము,
అంతియే కాదు—
ఘర్షణమ్మున జారిన ఘర్మకణము.

రాం: శాంతించు మహాత్మా. ఇంతకంటే కవిచాతుర్యం కోకంబెట్టి పెటు.

కిరణ్: ఆనందించలేనివాడి ముందు సౌందర్యప్రదర్శన కుక్కు దండుగ.

రాం: చిత్తం. తమ సూక్తులు వినలేక చస్తున్నాను.

కాంత్: ఉత్త పిరికివాడివోయ్. నిన్ను చూస్తే జాలేస్తుంది. నా ధోరణికే తట్టుకోలేనివాడివి—ఆడదాని ప్రేమ తాకిడికి ఏం తట్టుకోగలవు?

రాం: ఫరవాలేదు నాయనా. నా ధోరణిలో నన్ను బతకనీయండి.

కాంత్: నీ కోరిక ఫలించుగాక. అరె చాలా టైం అయిందే. వాకు పనివుంది. వస్తా Cheer you both (కాంత్ నిష్క్రమిస్తాడు)

రాం: అమ్మయ్యా! సుడిగాలిలా వస్తాడు; ఏదో దుమారం లేపి పోతాడు.

కిరణ్: కానీ లైఫ్‌ని పరిపూర్ణంగా ఎన్‌జాయ్ చేయాలనే తత్వం కాంత్‌ది.

రాం: ఇంతకన్నా చీకూ చింతా లేనివాడు ప్రపంచంలో వుండడేమో కిరణ్. జీవితాన్ని ఒక ఆటవస్తువులా చూస్తాడు. దొరికినంతమట్టుకు అనుభవిస్తాడు.

కిరణ్: అదో రకం పాలసీ.

రాం: సరేగాని కిరణ్. నీవు ఏదో బాధపడుతున్నట్లున్నావ్.

కిరణ్: ఏం లేదే!

రాం: ముఖాన్ని అద్దంలో చూసుకో. నా దగ్గరకూడా దాచగలవా ఏమిటి?

కిరణ్: ఏం లేదు రాం. కాంత్ చెప్పినదానిమీద ఆలోచిస్తున్నాను. నేను ప్రేమించాను "ఎవరిని" అని అడక్కు.

రాం: అనక్కర్లేదు భయపడకు. ఇవ్వాళ నీ మాటల ధోరణివిబట్టి నేమందుగానే వూహించాను. ఆమెను సంపూర్తిగా అనుభవించాలనీ—ఆమె నా కోసమే సృష్టింపబడిందనీ—అనుకునేదాకా వచ్చిందా—నీ ప్రేమ ఘట్టం?

కిరణ్: లేదు. ఇంకా అంత అధికారాన్ని పొందగలిగేటంత స్వార్థపరుణ్ణి కాలేదు. కానీ—ఆమె యవ్వనమధువును—ఆ అవాఘ్రాత వికసిత పుష్పసౌరభాన్ని ఆస్వాదించాలని ఉద్రేకంతో ఆశతో విలపిస్తున్నాను. వియోగాన్ని ఎలాగో భరిస్తున్నాను.

రాం: ఏమైనా—నివ్వరన్ని ప్రేమించినా—ఆమె ఎలాంటిదైనా—నా అభిప్రాయం చెప్పమంటే—ఆమెమీద కల్గిన, కల్గుతున్న, నీ తుచ్ఛవాంఛను సాధ్యమయినంత తక్కువ మోతాదులోకి తగ్గించుకో. ఒకవేళ నీ ప్రేమ ఫలించకపోవచ్చు—దిగులు పడకు—అప్పటి పరిణామం నీ వ్యక్తిత్వంమీద ఎక్కువ దెబ్బతీయలేదు. ఏమీ జరగనివాడిలా మామూలుగా మనగల్గుతావు. నిజంగా నీయత్నం లాభిస్తుందే అనుకో అనుకోనివాడు—ఆ మధుర క్షణంలో—నీవు వూహించే, ఊహిస్తున్న, ఎన్నడు ఊహించలేని సౌఖ్యాన్ని రుచిచూస్తావ్.

కిరణ్: ఏమో! ఏమవుతుందో! నేను అసమర్థుణ్ణి. ఈ విషయంలో మొండివాంఛను. ఫలితమెలా వుంటుందో నిర్ణయించలేని వాంఛను జయించలేక పోతున్నాను. క్షణికమైన యీ భౌతిక సుఖంకోసం నా శక్తిని, మేధను నిర్వీర్యంగా, బానిసగా, పతనం చేసుకుంటున్నాను.

రాం: తెలిసి బాధపడతావేం కిరణ్. మనోబలంతో మానవుడు జయించనిదంటూ ప్రపంచంలో లేదు. కాంత్ అన్నాడే "పిరికి" అని ఆ పిరికితనం నీలో చొరనీయకు. ఇన్ని కబుర్లు చెప్పి ఇంతలో డీలాపడతావే.

కిరణ్: మళ్ళీ కలుస్తా రాం. నీ కాలం చాలా వృథా చేశాను.

రాం: ఫరవాలేదు మళ్ళీ కలుస్తావు కదూ? (కిరణ్ నిష్క్రమిస్తాడు)

రాం: వీణ్ణి చూస్తే జాలేస్తుంది. శశికోసం వీడు బాధపడుతున్నాడు. అదీ వాకోసం బాధపడుతుంది. ఇవ్వాళ శశితో మాట్లాడాలి. అవసరమైతే కావున్ను. (కాసేపు నిశ్శబ్దం. కళ్ళు మూసుకుని పడుకుంటాడు.)

("Mr. రాం" తెరలోంచి పిలుపు వినిపిస్తుంది.)

రాం: (విసుగా లేచి కూర్చుని) ఎవరు?

(తెరలోంచి) నేను శశిని.

రాం: శశివా! చంద్రుడివా?

(తెరలోంచి) కాదు వెన్నెల్ని.

రాం: నా జీవితాన్ని వెలిగించడానికి వచ్చావా?

(తెరలోంచి) అవును. నిన్ను వెన్నెల్లో, తేలిపోయే మబ్బుల్లో తెల్లని ఇసుకతిన్నెల్లో, నీలిసంద్రతరంగాలమీద ప్రేమ డోలికల్లో ఊగించడానికి వచ్చా.

రాం: అంతే అయివుంటుంది. కాంత్ పంపించివుంటాడు నిన్ను. (తెరలోంచి కలకలనవ్వు వినిపిస్తుంది.) అవును. కాంత్ పంపాడు. నీ కోసం. నీకు రసమార్గం ఎరిగించాలని—రమ్మంటావా! నీ జీవితనాటకంలోకి—నీవెలుగుల బాటల్లోకి—నీ ఆశల కూటంలోకి—నీ భావన్న అలల్లోకి—రమ్మంటావా?

రాం : నా సుస్వాగతం. ఇది సామాన్య ఆహ్వానం కాదు, ఒకడి చరిత్ర నిజాయితీ ప్రస్ఫుటమవటం కోసం—రా. నా కళ్ళ వెలుగుల్లోకి, నా ఆశాజ్యోతి నలంకరించడానికోసం—రా—నా మనోగవ్వారం విశాలంచేసి అలంకరించా—నా హృదయ కవాటాలు పూర్తిగా తెరిచా—రా. ఆహ్వానిస్తున్నా. నీరాజనం పడుతున్నా—నా జీవితశయ్య అధిరోహించడానికి—నాతో జీవితాన్ని పంచుకోడానికి—స్వాగతం. సుస్వాగతం. (తెరలోంచి) వస్తున్నా. వచ్చేశా—నేను శశిని. వెన్నెల్ని. (శశికళ ప్రవేశిస్తుంది. నిరాడంబరమైన వేషంలో అందంగా అగుపడుతున్న నాగరకత; ఆమె కళ్ళల్లో పల్లెటూరి సహజసిద్ధమైన అమాయకత్వం తొంగిచూస్తుంటుంది.)

శశి : ఏం రాం. కవిత్వం మాట్లాడుతున్నావు?

రాం : నువ్వు మాట్లాడిందేమిటి?

శశి : నువ్వు ఏదో భావంలో ప్రశ్నిస్తే—సమాధానం... (ఇద్దరూ గలగలా నవ్వుకుంటారు)

శశి : (కుర్చీ లాక్కొని అతడికి దగ్గరగా కూర్చుంటూ) ఇవ్వాళేదో క్రొత్తగా మాట్లాడుతున్నావు?

రాం : ఏంలేదు. కొంత చెపుతూంటానే అరసానుభవం రుచి చూద్దామని—

శశి : నిజంగానా?

రాం : ఏం. నీదగ్గరకూడా అబద్ధమాడతా ననుకున్నావా?

శశి : (చిలిపిగా నవ్వుతూ) అప్పుడే ప్రేమఘట్టం ప్రథమసోపానాన్నధిరోహించావు.

రాం : నిజంగానే (నతితో ఆమె చిబుకాన్ని స్పృశించి) నేనెక్కడున్నానో, ఏంచేస్తున్నానో, ఏంచేస్తానో తెలీనిస్థితిలో వుంది నా అవస్థ.

శశి : (నవ్వుతూ) రెండో మెట్టెక్కావ్.

రాం : ఏమో: నాకేం తెలీటంలేదు—అర్థంకావటం లేదు. ఏదో ఆనందం. ఏదో బలీయమైన వాంఛ నన్ను లొంగదీసుకుంటున్నది. ఇదిగో శశి. ఇలా చూడు. నాకళ్ళల్లోకి చూడు. ఏమిటో నా నరాలు పట్టుతప్పుతున్నాయ్. నా చైతన్యం లుప్తమవుతోంది.

శశి : ఎందుకు రాం, అలా ఆవేశపడతావు?

రాం : ఆవేశం! ఆవేశం కాదు. ఏదో మహత్తరశక్తి—నీలో—నీలోంచి వుద్భవిస్తోంది. నన్ను సమ్మోహితుడ్ని చేస్తోంది. నా హృదయవీణ అనంతానంత మూర్ఛనలు పలుకుతోంది. ఏదో అనివార్యమైన ఆవేశం—నన్నావరిస్తోంది. నీవు—నీవు నా స్వంతం—నాకోసం. నిజం. నవ్వకు. నాకోసం సృజింపబడ్డావు. నాదానివి—నా ఆత్మవి—నా ప్రాణానివి. ఏమిటి ఆ పెదాలమీద. ఎందుకో హాసం—నన్ను వశంచేసుకుందామనా? నీ నేత్రాల్లో ఎందుకంత మాదకత్వం? ఎందుకంత ప్రభావం నీకు వచ్చింది? ఆ పెదాల్లో అమృతం—కొంత నాకు భాగమీయవూ? (శశికళకు మరిదగ్గరగా జరుగుతాడు.)

శశి : (లాలనగా) ఎందుకంత తొందర! ప్రేమలో—ఊబిలో... పంకంలో దిగబడతానేందుకు? నేచేరుస్తా నిన్ను ఒడ్డుకి—

రాం : అవును. నీవే దరిచేర్చాలి ఈ దీనుణ్ణి.

శశి : నేను నీదాన్ని రాం. ఎప్పుడూ జన్మలెత్తినా నీదాన్ని. ఎందుకింకా భయం?

రాం : ఇలా నిన్ను చూస్తూ, నీ అందం గ్రోలుతూ, నిన్ను స్మరిస్తూ శిలనై పోకూడదూ!

శశి : అబ్బ ఎంత ప్రేమ. ఇంకా పరిపక్వం కావాలి.

రాం : ఇంకానా. అవుతుంది. నీ ప్రేమకోసం నా ప్రాణం బలిచేసే రోజు కూడా వస్తుంది అవసరమైతే.

శశి : తప్పు. ఎందుకంతమాటలు? మన ప్రేమాకాశానికి చంద్రుడువు నువ్వు; చంద్రికను నేను. కిరణ్, కాంత్ తారకలు. ఇంకా ఏంకావాలి చెప్పు? జీవితంలో హాయిగా ఆనందంగా నాలుగుస్తంభాలాట ఆడుకుంటున్నాం మనం. ఏదో కొత్త ఎవరో ఒకరం "అవుటు" అవుతాం. ఇంకోదొంగ మిగిలిపోతాడు. ఇంతకంటే రసవత్తరం, ఆనందదాయకం ఏముంటుంది? ఇంకన్నా అధికం మనం కోరేదేముంది? నీకంటి పాపలో నానీడ చూసుకుని మురిసిపోతుంటాను జీవిత మాధుర్యం చవిచూస్తుంటాను.

రాం : నువ్వేమైనా అను శశి. నీపాదలచెంత ప్రాణమైన నివాసాలని వుంది నాకు. చివరికి నీ పాదాలు గూడా శిల్పశాస్త్రప్రకారం చెక్కినట్టున్నాయి. ఎంత సౌందర్యం నిక్షిప్తమైంది నీలో!

శశి : ఎందుకలా పొగుడుతావు? ప్రేమికులకళ్ళు మసకలు కమ్ముతయ్. ప్రేమాంధకారంలో దారీ, తెన్నూ మరచిన నిన్ను మళ్ళీ యథాప్రకారంగా మార్చాలి. ఎంత కష్టమోమరి! నన్ను బాధపెడతావా? నామాట చెల్లించవా? రాం నాకోసం—నీ మహాశక్తి నీ సృజనాత్మకశక్తి నాశనం చేసుకుంటావా? ప్రపంచం ఓ గొప్ప శిల్పిని—చిత్రకారుణ్ణి కోల్పోవలసిందేనా? నీ ఆశలు—ఆశయాలు అన్నీ బూజుపట్టి శిథిలమవాల్సిందేనా?

రాం : ఏమో నాకు తెలీదు. నా ఆశలు ఆశయాలు అన్నీ నీవే. నా సర్వస్వం నీవే. ఏ ఊహాప్రేయసికోసం దేవులపల్లి తా వెడ్డి మనస్సెడిపించాడో, ఏ ఊహాప్రేయసికోసం వేగుల వేనవాథరితుడై గాలించాడో, ఏ ఊహాప్రేయసికోసం బాపిరాజు శిల్పం కవిత్వం అంతా ఖర్చయిందో —అలాంటి భావనారూపం—ప్రత్యక్షంగా నా కళ్ళముందు నాట్యమాడుతోంది. ఎన్నాళ్ళనుంచో ఇలాంటి అపురూపమైనరూపంకోసం నా మనస్సు తపిస్తోంది. ఆరూపం నువ్వే నువ్వే శశి—ఆ నీకోసంఎన్నికన్నిలు కార్చానో తెలుసా? ఎంత బాధపడ్డానో ఆ వియోగాకులకు విషాదాశ్రువులు ఖరీదుకట్టే మగాడెవడైనా వున్నాడా?

శశి: ఎందుకంతబాధ? నీబాధకు నేనిలా ఉపశమనంగా అక్కరకు వస్తే అలాగే ఉపయోగించుకో. నెనరుగా అడడం లేదుగా. అరచేతిలో వైకుంఠం చూసుకొని మురుస్తావేం? ఈ రసానుభూతిలో నీ కానందంలేదా?

రాం : ప్రాస్తుత కాలో మాట్లాడి వెళ్ళాలనే. అప్పుడైనా ఏలా అవ లేదు, అతన్ని గురించి శశితో మాట్లాడుదాం అనుకుంటు న్నాను. ఇంతలో ఇలా జరిగిందేమిటి?

కాంత్ : కిరణ్ అంతిమ సందేశం వినే ధైర్యం వుందా మీకు? వినగలరా?

రాం : తొందరగా చెప్పు. నా మనస్సు బాగాలేదు.

కాం : నీ కోసం, నీ క్షేమంకోసం, నీ భవిష్యత్తుకోసం కిరణ్ మర ణించాడు రాం. నువ్వు లేందే శశికి లేదు. శశికి లేనిదే నీ భవిష్యత్తు శూన్యం. నీ శరోహృదయం మోడు వారుతుంది. నీ సృజనాత్మకశక్తి నశిస్తుంది. నీ జీవితం, నీ గొప్పదనం వృథా అవుతుంది. తాను బ్రతికివుంటే ఏ క్షణానైనా శశి తన ఆకర్షణకు లొంగక తప్పదనే సత్యం గ్రహించాడు కిరణ్ నీ కోసం—నీ కోసం ప్రాణాలు వదిలాడు.

రాం : ఆఖరికి నా శశి ఒకరి ప్రాణాలు కూడా—ఒకరి ప్రాణాల్ని బలి తీసుకుందా! ఇంత స్వార్థపరుణ్ణా నేను. కాంత్— విధవ శశి, వేషవ గొప్ప. కిరణ్ లేనినాడు ఎందుకివంతా— (కాన్వాస్ చిత్రం చించబోతాడు)

శశి : కాంత్ : ఆ! ఆ! (దడాలున చిత్రం లాక్కుంటారు. శశి బొమ్మను తన వొళ్ళో పెట్టుకుంటుంది.)

కాంత్ : ఏం పిచ్చెక్కిందా రాం? ఎంతో తపఃఫలితాన్ని వమ్ము చేస్తావా?

రాం : (గద్గదికంగా) తపఃఫలితం. ఏ మిత్రుని ఆనందం కోసం ఇంత తపస్సు చేశానో—ఆ మిత్రుడే లేనప్పుడు—ఏం లాభం. ఎందుకీ తపస్సు? ఒట్టి స్వార్థపరుడిగా మిగిలి పోయాను.

శశి : క్షమించు రాం. కిరణ్ ఇలా అవుతాడని తెలీదు. నా ఆశల్ని వివరించి చెప్పా వతడికి. నిజానికి నా తప్పేమీ లేదు. ఇలా చేస్తా డనుకోలేదు.

కాంత్ : పోనీ రాం. కిరణ్ ఆత్మశాంతికి ప్రతిఘాతం కల్గకూడదు. నీ బొమ్మ పోటీకి పంపించు. ప్రైజ్ రాగానే కిరణ్ స్మారక చిహ్నం ఏర్పరుద్దాం.

రాం : స్మారకచిహ్నం — స్మారక చిహ్నం — (అంటూ రాం నివర్కిస్తాడు.)

శశి : కాంత్! ఏమిటీ అసలు గొడవ!

కాంత్ : (పెద్దగా నవ్వుతాడు.)

శశి : (కంగారుగా) పిచ్చి పట్టిందా ఏం?

కాంత్ : నీకు తెలీదు శశి. రాం తత్వం నీ కింకా బాగా తెలీదు. అతడి చేత పోటీకి బొమ్మ గీయించాలి. కిరణ్, నేను ప్లాన్ వేశాం. ఏదో ఒక షాక్ తినిపించాలి. లేక పోతే అతడు మనలాంటి మనిషే. షాక్ తిన్నాడా అద్భుత మైన వ్యక్తి. అద్భుతాలు సాధిస్తాడు.

శశి : అమ్మయ్య. బ్రతికించావు. హడలిపోయాను, రాం బాధ చూచి.

కాంత్ : నిన్నెందుకు ఇక్కడికి పంపించాననుకున్నావ్. ఆ కాన్వాస్ చిత్రం సగం గీసి వదిలేశాడు. ఆ పని పూర్తి చేయించాలి. అందుకోసం. అప్పటిదాకా అతడ్ని ప్రేమ లోకంలో ముంచి ఎత్తేను. కిరణ్ కూడా సమయానికి అందివచ్చాడు. నీ సహాయం కావలసివచ్చింది. నిన్ను ఉపయోగించుకున్నాం.

శశి : అందుకేనా రాం అంత తీవ్రంగా, ప్రేమకై భక్తులు మాశాడు. ఎప్పుడూ లేనిది నా పిచ్చి రాం, ఇలా అయి పోయేడే అని భయపడ్డాను. నేను దగ్గరికి పోయేకొద్దీ— ఆత్మార్పణ చేసేకొద్దీ—మనిషి మారిపోయాడు. ఎంత శోధించినా, ఎంత బుజ్జగించినా ఎంత నిగ్రహం ప్రకటించాడు! నేను దూరంగావుంటే దగ్గరకు వస్తాడు. దగ్గరకువస్తే దూరంగా పోతాడు. వింత ప్రకృతి.

కిరణ్ :—అదే విచిత్రం (అంటూ ప్రవేశిస్తాడు)

కాంత్ :—రాంని అర్థంచేసుకోవడం చాలా కష్టం కిరణ్.

శశి:—కిరణ్. ఎంత గాభరా చేసేవు, పోనీలే. రాం మంచిబొమ్మ గీస్తాడు. గొప్ప పేరు వస్తుంది.

కిరణ్ :—అంతేనా. పోటీలో ఫస్ట్ ప్రైజ్ రావాలి.

శశి:—అంతా కోరెడి అదేగా.

కాంత్ —అమాయ కప్పిల్లా! రాంకోసం ఏం బాధపడ్డావు...

శశి:...నీకు తెలీదు కాంత్. ఇలాంటి విచిత్ర ప్రకృతి అంటే నాకు చిన్నప్పట్నుంచీ చాలా ఇష్టం. మొదట్లో రాం పిచ్చి మనిషి చూసి బాధపడేదాన్ని. ఇప్పుడు గర్వపడుతున్నాను. నా వల్లేగా ఇంత చిత్రం రూపొందుకు అయింది.

కిరణ్, కాంత్ :—ఆహా!

కిరణ్ :—మా ప్లాను అంతా వ్యర్థం అంటావు.

కాంత్ :—వేగుబోతే పీకేస్తున్నావే.

శశి:—మీ రేమైనా అనండి. రాం నావాడు. నావాడు.

కాంత్ :—నిన్నాపేక్షం చేయటంలేదు. మేమెక్కడికీ ఎత్తుకెళ్ళం.

కిరణ్ :—Innocent girl (ఇంతలో రాం తూలుతూ ప్రవేశిస్తాడు)

రాం:—(కిరణ్ణిచూసి) కిరణ్ (బిగ్గరగా అరుస్తూ కౌగిలించు కుంటాడు. అతడిచేతి బొమ్మవేసిన డ్రాయింగ్ పేపరు క్రిందపడుతుంది)

కాంత్ :—(గబాల్న కాగితం తీసుకుని) Wonderfull! ఎంత బావుంది. రాం. శశి. ఇలాచూడు. Beautifull Art! (శశి కిస్తాడు.)

శశి:—అబ్బ! ఎంతబావుంది. రాం. నా పిచ్చిరాం. (రాం జుట్టు నిమురుతుంది.)

రాం : ఏమి టిదంతా. కిరణ్. నా కిరణ్ బ్రతికేవున్నావా?

కాంత్ : అదంతా తరవాత చెప్తాం. ఈ చిత్రానికి పేరు సూచించు.

రాం : ఏం చెప్పను. నాకంతా అయోమయంగా వుంది. కిరణ్ నా ప్రక్కనే వున్నాడు. శశి. నీవు అంతా వున్నాం. పోనీ. వెంవబొమ్మ, పోనీ. ఏమైతేనేం?

కిరణ్ : నా కోసం వేసినబొమ్మకు నేనే నామకరణం చేస్తా. "మిత్ర వియోగం" ఏమంటావు శశి?

శశి : నా ప్రాముఖ్యం పోయింది. ఇంక నే నేమంటాను.

కాంత్ : ఎక్కడికీ పోలేదు. రాం నీవాడు.

రాం : Much audo about Nothing.

కిరణ్ : All is well that ends well.

శశి : నాలుకు సంభోలాట.

కాంత్ : ట్రాజీ కామెడీ.

రాం : ఏదన్నా కాని — అంతా హాయిగా జరిగిపోయింది. మీ తోడిదే శశి అన్నట్లు—మనది "నాలుగు స్తంభాలాట". ఆట అయిపోయింది. అంతా సుఖంగా వున్నాం.

(తెర వాలుతుంది.)

# కేరళమునకు వికారిచేసిన మేలు

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

గత వికారి సంవత్సరము కేరళదేశపు చరిత్రలో మరువరానిది.

రాజకీయ రంగమునందేమి, ప్రజాపాలన తంత్రమందేమి, జన సామాన్యశాంతి భద్రతా వ్యవస్థయందేమి, నానా వికారములు పుట్టించి శివతాండవమాడినా ఆడినదికాని, వికారి సంవత్సరము కడకు కేరళభూమికి మేలే చేసిపోయినది. రెండుసంవత్సరములకు పైగా, భారత కేంద్రప్రభుత్వవర్గములకు భిన్నమయిన పద్ధతిలో దేశపరిపాలనమును సాగించుచుండిన కమ్యూనిస్టు మంత్రివర్గపు రాజనీతి క్రమక్రమముగా విజృంభించి అపశ్రుతితో ఆనందభైరవిని ఆలాపించుచుండగా, పక్కబాటకు లోనై ప్రజాసముదాయము శోకతరాళితో నిలపింపసాగినది. పరిస్థితులు సహింపుటకు అసాధ్యము కాగా, భిన్నభిన్నములగు ఆదర్శములు కలవారైనా, దేశమందలి రాజకీయపక్షములన్నియు అవసరమునుబట్టి గుమికూడి, చేతులు కలుపుకొని, ఆ కమ్యూనిస్టు మంత్రివర్గమును స్థానభ్రష్టము చేయు దీక్షతో ప్రతిసపట్టి నానా విధములుగా ప్రతిష్టంభనము చేయుచురాగా, కేరళదేశములో అశాంతిపుట్టి చెలరేగెననుట సుప్రసిద్ధ విషయము. శాసనసభలో సంఖ్యాబలమును, పలుకుబడిని, సంపాదించుకొని, గట్టిపునాదితో పాదుకొనియున్న పాలకవర్గమును కూలద్రోయుటకు సామాన్యమగు సక్రమ పద్ధతులు చాలమిచేత, విప్లవరూపమయిన విషమనీతిని ప్రతికూలపక్షములవారాశ్రయించగా, దేశము నాలుమూలలా, అణపరాని అంతర్వ్యాప్తి రూపమయిన అరాజకస్థితి ఆరంభమయ్యెను. తత్ఫలముగా, సభలు, సమావేశములు, సమ్మెలు, క్రాంతి ఘోషణములు, విప్లవ వాదములు, గృహదహనములు, తుపాకికాల్పులు, కారాగార శిక్షలు, రక్తపాతములు, అపమృత్యువులు—మితమీరుటచేత కొన్ని నెలలపట్టు దేశము క్షోభించినది. సాధ్యమయినంత చెప్పి, చూచి, ఓర్చి, పాలించుకొని, ప్రజాసముదాయపు శాంతి భద్రతలను రక్షించు శక్తిలేని నంబూద్రిపాదు మంత్రివర్గమునకు, విధిలేక కేంద్రప్రభుత్వము స్వస్తి చెప్పవలసి వచ్చెను. 31-7-1959 వ తేదీన సాయం సంధ్యాకాలమున (6-0 p. m. I. S. T.) రాష్ట్రపతి శాసనముతో కేరళదేశమందు కమ్యూనిస్టు పరిపాలనము అంతరించినది. మంత్రులులేక, శాసనసభలేక రాష్ట్రపతి తన ప్రతినిధిద్వారా పరిపాలనమును సాగించుచు వచ్చినాడు.

ఆరునెలలు కడచులోగా, ఎన్నికల సంరంభము ప్రారంభమైనది. ఏమైనాసరే, కమ్యూనిస్టులకు శాసనసభలో స్థానబలము నియ్యరాదని కాంగ్రెసు పక్షము దీక్షపట్టినది. అగ్రనాయకులు నలుదిక్కులనుండి కేరళమునకు వచ్చి, మూలమూలలు తిరిగి, ఉపన్యాసములిచ్చి, ప్రజలలో ఉద్రేకము కలిగించినారు. కమ్యూనిస్టులతో పోటిచేయుటకై ఇతర రాజకీయ పక్షములవారు సహాయములు దిగించి కత్తులు నూరుచుండిరి. కాని, అప్పటి పరిస్థితులలో, కమ్యూనిస్టు వ్యతిరేకులు వేరువేరుగా పోరాడుటకంటె అందరూ చేరి ఐకమత్యముతో శత్రుజయమునకై ప్రయత్నించుట హెచ్చుగా ఉపయోగకరమని యుద్ధనీతి విశారదులగు నాయకులకు తోచినది. కాంగ్రెస్సు, ప్రజాసోషలిస్టు, ముస్లిములీగు పక్షముల నాయకులు మంతనములాడి అన్యోన్య సహాయసంపాదకముగ తాత్కాలిక సంఘమును కూర్చుకొని రణభేరి వాయించినారు. కేరళదేశమునకు అంటియున్న కమ్యూనిస్టు పరిపాలన పంకమును కడిగివేయుటకు ఈ 'త్రివేణీ' సంగమము వారికి ఎంతో పనికి వచ్చినది. నానావిధోపకరణములతో, ఎన్నికలలో యుద్ధము చేసి, ఈ మిత్రమండలి 1-2-1960 వ తేదీనాడు కమ్యూనిస్టుల బలము వణచి శాసనసభలో సంఖ్యాబలమును సంపాదించుకోగలిగెను. చేతనైనంత పోరాడిచూచి, పరాజయము నంగీకరించి, "మీరే ఏలుకోండి" అని చెప్పి, కమ్యూనిస్టులు ప్రక్కకు నిలిచారు.

కాని, ఇంతటితో కథ ముగియలేదు. క్రొత్తగా మంత్రివర్గము నేర్పరచు సందర్భమున మిత్రమండలిలో అభిప్రాయ భేదములు వచ్చుట తప్పలేదు. అధికార వ్యామోహము చెడ్డది కదా! ఆసనములనుగురించి, సంధి షరతులనుగురించి, వాదోపవాదములు, సంప్రతింపులు, చర్చలు, మంతనములు యథేచ్ఛగా జరిగినవి. ఢిల్లీ నగరమునకు వాయువిమాన ప్రయాణములతో రాకపోకలకు విరామము లేదు. మిత్రమండలిలో స్వయానా కలహములు బయలుదేరు సూచనలు పుట్టినవి. ఇన్ని దినములు, ఇన్ని విధములుగా, ఇందరు పడిన కష్టమునకు రావలసిన ఫలము రాక "ముల్లుతీసి, కొఱ్ఱడము కొన్నట్లు" అగునేమో, అని దేశము మరల ఆందోళనము పాలయినది. నాయకులు తల్లడిల్లిరి.

కాని, అఖిలభారత జాతీయ సంస్థానాయకుల నిరుపమాన రాజనీతిజ్ఞతకు ఫలముగా, ఏదో ఒక విధముగా మిత్రమండలివారికి ఐకమత్యము కుదిరి, శాంతియుత వాతావరణ మేర్పడినది. కాంగ్రెస్సు పక్షమునుండి ఎనమండ్రు, ప్రజాసోషలిస్టు పక్షమునుండి ముగ్గురు మొత్తము పదునొకండుగురు మంత్రులతో పాలకవర్గము ఏర్పరచబడెను. 22-2-1960వ తేదీనాడు పగలు 11-0 A. M. (I. S. T.) గంటల సమయములో స్థానిక రాజప్రతినిధి శ్రీ బూర్గుల రామకృష్ణరావు మంత్రులతో ప్రమాణములు చేయించినాడు. వయోవృద్ధుడు, అనుభవశాలియునగు ప్రజాసోషలిస్టుపక్ష 'భీష్మాచార్యుడు' శ్రీయుత పట్టంతాణుపిళ్ళె ముఖ్యమంత్రి పదము నలంకరించి సేనాపతి అయినాడు. కేరళములో శాంతి ఏర్పడి ప్రజలు ఆనందించినారు. దేశపరిపాలనమును మరల కమ్యూనిస్టులపాలు చేయకుండ, వికారి సంవత్సరము కడకు కేరళదేశమునకు మేలే చేసిపోయినది.

నవ పంచమాధిపతియై లాభభావములోనున్న బుధుని మిత్ర దృష్టి ఈ లగ్నమునకు కలదు. దేశములోని నవతరముల యొక్క ప్రాముఖ్యము, విద్యాసంస్థల యొక్క ఆక్రమణము, విద్యార్థుల సానుభూతి సహా, ఈ మంత్రివర్గమునకు అండగా నుండగలదని సూచన.

చతుర్థభావపు అధిపతియైన చంద్రునితో షడ్కేంద్ర విషమ దృష్టిగల వరుణుడు భూసంస్కరణముల విషయమున మునుపటి మంత్రివర్గపు ఆదర్శములను త్రోసి రాజాజ్ఞనీ, నూతన మార్గమున ఈ మంత్రివర్గము పరిపాలనము సాగించునని చాటుచున్నాడు. తృతీయ, చతుర్థాధిపతులగు చంద్ర రవులతో లగ్నాధిపతియగు శుక్రునికి లభించియుండుటచే, వార్తాపత్రికల యొక్క, భూస్వాముల యొక్క సహాయసంపత్తి ఈ మంత్రివర్గమునకు సమృద్ధిగా నుండగలదు. దశమ కేంద్రమునందలి షష్ఠాధిపతి శుక్రుడు సామాజిక జీవితోన్నతికి, సహకారోద్యమమునకు, దోహదము నిచ్చుటే కాక స్త్రీలకు ప్రాముఖ్యము హెచ్చునదియు, పాటకపు జనుల బాగుపడుటను గూర్చియూ సూచించగలదు.

పుణ్యసహమము లాభభావములోనికి వచ్చుట మంత్రివర్గపు పుణ్యపరిపాకము. "లాభగే పుణ్యసహమే, లాభః కీర్తివివర్ధనః" (జాతక సుధానిధి.) కేరళమునకు లాభకరముగా కీర్తిప్రదముగా పరిపాలనము కొనసాగగలదు. శాసనసభ పాలకవర్గమునకు చేయూతగా నుండును.

ఈ యోగములన్నియు చాలా రమ్యముగా నున్నవి. కాని, ఏవో కొన్ని లోపములు లేకపోలేదు. సప్తమాధిపతి (ప్రబల ప్రతిపక్షం) కుజుడు అనతికాలమున మెప్పును లభించునాయని కాచుకొని లగ్నాధిపతి శుక్రుని వీపులమీద నున్నాడుకదా! శత్రుసహమములో ఆ కుజునికి నిండుగా త్రికోణ మిత్రదృష్టి! మంత్రివర్గముపై అసూయకలవారందరు ఆ కుజునికి సాయపడుదురు. ఆ సప్తమ భావమందే కాంతిదూరముగా నిలిచియున్నవాడు, మహా మాయావి, ఇంద్రుడు! ఇతడు వక్రియై, రాజ్యస్థానముపై పూర్తిగా కేంద్రదృష్టిని బాపును జరుగుచున్నాడు. సమయమునకై కాచియుండి, అనుకూలము దొరికినపుడు ఏవో మాయవేషములు వేసి, మంత్రములు పఠించి, కుట్రలు పన్ని, కుతంత్రములతో మిత్రభేదము చేయుటకు సిద్ధముగ వారు శత్రువులలో నున్నారని యీ యోగము హెచ్చరించుచున్నది. చతుర్థభావమందు క్రూరగ్రహము ఉండెనేని, విధ్వంసము చేయుశక్తి దానికి కలదందురు 'పచ్యుతిః సప్తతుర్గైః లైః' అని వశిష్ఠ వాక్యము. ఇట్టి చతుర్థ భావమందున్న వ్యాధికారకుడగు వరుణుడు మంత్రివర్గమునకు చిక్కులు తెచ్చి పెట్టవచ్చును.

దేవనాపదశలో దశమకేంద్రము దలించి, 1961వ సంవత్సరపు ఆరంభములో ఇంద్రునితో కేంద్రవేధను రాకతప్పదుకదా! అప్పుడేదైనా కొంత కష్టాలు జరుగగలవు. కాని, అది అంత ప్రమాద కారికాదు. 1958వ సంవత్సరమున చలిత కుజుడు శుక్రుని నాక్రమించుట, చలిత రవికి యముని సమసప్తక వేధ దాపరించుట, చలిత చంద్రుడు వరుణుని ప్రత్యుత్తరదృష్టికి వచ్చుట, అను విషమునకా యోగములు సిద్ధము కాగలవు. ఆ కాలమునందే, చలితలగ్నము చతుర్థ వరుణుని కేంద్రవేధను పొందగలుగు విషాదకరము. భూస్వాముల అసంతృప్తి మంత్రివర్గపాలనమునకు తొందరకలిగించవచ్చును. ముస్లిం లీగువారు కానికైనా, మొరకుపట్టు పట్టవచ్చును; అధికార వ్యామోహముతో స్వయమానకలహములు పుట్టి అలజడి కలిగించవచ్చును. ఏ కారణమైననేమి, అది కొంత క్లిష్టకాలమనక తీరదు. అయినా, తగిన జాగరూకతతో, గొప్పగా ప్రమాదపరిస్థితులు రాకుండు నట్లుగా నిర్వహించుట మంత్రివర్గమునకు అసాధ్యము కాదు.

ఈ సంస్థకు సాంకేతికము మాత్రమే కాక, ప్రబలమయిన మహదాశ్రయసంపత్తి సమయము కలదు. స్థానిక గవర్నరు శ్రీయుత బూర్గుల రామకృష్ణారావుగారి జాతకమున చతుర్థ గృహాధిపతి యగుటచే రాజయోగప్రదుడై, లగ్నభాగమునందే యున్న శుభగ్రహము శుక్రుడు! కావుననే, ఆ మహనీయుని ప్రశాంత మనస్తత్వము, సహనశీలత, మంత్రశక్తి, విశాలదృష్టి, భావౌదార్యము, సామంజస్య సంపాదన ప్రతిభ, మున్నగు గుణములు సుప్రసిద్ధములు. అట్టి శుక్రుని స్థానమునందే నికరముగా, ఈ మంత్రివర్గపు రాజ్య (దశమ) స్థానముండుటయని కనుగొనిరేని, ఈ మంత్రివర్గమునకు అతని రాజనీతి స్ఫురణము ఎంత చేయూతగ నున్నదో, పాఠక మహాశయులు గుర్తించగలరు. ఇంతేకాదు. ఆ మహనీయుని చలిత రాజ్యస్థానమునందే, స్పష్టముగా, ఈ మంత్రివర్గ జాతకమందలి భాగ్యరాజ్యాధిపతి శని నిలచియుండుట! ఈ సంస్థ యొక్క భాగ్యము అతని పుణ్యపాకపు ఫలమని ఈ యోగము చాటుచున్నది. అతని సందేశము మంత్రివర్గమునకు అమూల్యము. క్లిష్టపరిస్థితులు ఎప్పుడైనా వచ్చినచో, దాని ఆదరాభావము సులభముగా వాని నెదుర్కొని ఈ మంత్రివర్గము కేరళమునకు అభ్యుదయము చేకూర్చి ప్రజామోదమును పొందగలదనుటకు సందేహము లేదు.

మరియొక్క అంశమును మనము మరువరాదు. ఏమందురా? ఇప్పటి రాజ్యాంగ పరిస్థితులలో మన దేశములోని ఏ రాష్ట్రమందలి పాలకవర్గమైనా భారత కేంద్ర ప్రభుత్వపు దయ, ఆశ్రయము, లేక రాజ్యభారమును నిర్వహించుట కష్టము. కడచిన నంబూద్రిపాదు మంత్రివర్గమే దీనికి ప్రబల నిదర్శనము. ఆ మంత్రివర్గ జాతకమందలి[1] లగ్నమునకు (కర్కాటకము 18°) నికరముగా కేంద్ర వేధాస్థానములో—(తుల 18°) ఇంద్రుడు, సమసప్తక వేధలో (మకరము 18°) బుధుడును, కలది భారత కేంద్ర ప్రభుత్వ[2] జాతకమని జ్ఞప్తియందుంచుకొంటిమేని, చిల్లపేకల మేడవలె, ఆ మంత్రివర్గము ఒప్పన కూలిపోవుటకు మూలకారణము ఏమున్నదో,

---

(1) హేమలంబ సంవత్సరమున చైత్ర శుక్ల పంచమీ శుక్రవారమునాడు (5–4–1957) పగలు 12-32 గంటలలో పుట్టినది నంబూద్రిపాదు మంత్రివర్గము.

(2) గత విరోధి సంవత్సర మాఘశుక్ల నవమీ గురువారము నాడు, అనగా, 26-1-1950 నాడు, 10-30 A M (I S T) కాలములో ఏర్పడినది భారత కేంద్ర ప్రభుత్వము.

స్పష్టము కాగలదు. ఈ మంత్రివర్గమునకు స్వస్తి చెప్పుటకై 31-7-1959 వ తేదీన, రాష్ట్రపతి ఆజ్ఞాపత్రముపై చేవ్రాలు చేసిన క్షణమందు (సాయంకాలము 6-0 గంటలు P. M. I. S. T.) భారతకేంద్ర ప్రభుత్వ జాతకపు బుధస్థానమే - (మకరము 18°) లగ్నముగా నుండెనన్నచో, ఇది కాకతాళీయ మనజాలముకదా?

ప్రకృతాంశమునకు వత్తము. ప్రశంసలోనున్న మంత్రివర్గ జాతకమందలి రాజ్యభావము సాక్షాత్తుగా రాష్ట్రపతి శ్రీయుత రాజేంద్రప్రసాద్ బాబుగారి జాతకములో రాజయోగకారకుడగు శుక్రుని చలిత స్థానమందే (కుంభములో 8°) నిలుచుట కేరళ దేశపు భాగ్యము. అట్టే, భారత కేంద్రప్రభుత్వ జాతకమందలి లగ్నాధిపతి కుజుడు (తుల 9°) ఈ మంత్రివర్గ జాతకపు రాజ్య (దశమ) స్థానమునకు త్రికోణ (ప్రత్యక్ష మిత్ర) దృష్టితో నుండుట సయితము అమూల్యమగు సౌకర్యము. కేంద్రప్రభుత్వ జాతకపు వరుణ మహాశయుడు (కర్కాటకము 2°) ఈ మంత్రివర్గ జాతకపు రవితో కోణదృష్టిలో, చంద్రునికి సమసప్తక వేధాస్థానములో, మంగళేశ్వర సహాయముపై నుండుట! శాసనసభలో సంఖ్యాబలము అల్పమయినా, ప్రజా సోషలిస్టు పక్ష నాయకుడు శ్రీపట్టం తానుపిళ్ళై ముఖ్యమంత్రిపద మధిష్ఠించుటకును, అతడెంత పోరాడినా ముస్లింలీగునకు పాలకవర్గములో స్థానము లభించక పోవుటకును, మూలకారణ మెందున్నదో, ఇప్పుడు నూటిగ వ్రేలితో చూపినట్లు అగుపడుచున్నదికదా! భారత మహాప్రధాని శ్రీ నెహ్రూపండితుని జాతకమందలి కుజుడు (యోగకారకుడు) తులారాశిలో 2°లో నుండి, మంత్రివర్గజాతకపు చంద్రుని కేంద్రశత్రు దృష్టితో లగ్నాధిపతి శుక్రుని ప్రత్యక్షమిత్రదృష్టితో, కటాక్షించుచుండుటకు ఎంత విలువయున్నదో, చదువరు లూహించుకొనగలరు.

మరియొక్క విశేషము. అఖిల భారత జాతీయ మహాసంస్థ నాయకుడగు శ్రీయుత నీలం సంజీవరెడ్డి జాతకములో బృహస్పతితో కూడియున్న లగ్నమెందున్నదో, నిశ్చయముగా ఆ భాగమందే ఈ మంత్రివర్గపు శని, అనగా, రాజ్యభాగ్యాధిపతి! అన్యోన్య కోణ దృష్టి అనుకూల్యముగల అతని శని వక్రగుణములు ఈ మంత్రివర్గపు రాజ్య భావమునకు ప్రాప్తు అతని చంద్రునితో మంత్రివర్గపు బుధునికి నిండుగా ప్రత్యక్ష మైత్రి. మంత్రివర్గ నిర్మాణములో అతని రాజనీతికి గొప్పవిలువ యుండక తీరదుకదా! అతని నీతిచాతుర్యము 'విదురనీతి' యందలి ఈ క్రిందిసూక్తిని తలపునకు తెట్టించునట్టిది:

"అరిది విలుకాని ఉజ్జ్వల
శర మొక్కని నొంచు; తప్పిచనినన్ జను; నే
ర్పరియైన వాని నీతి
స్ఫురణము సగరాజ్యు, పతిని భూమిన్, చెరచున్."

(భారతము—ఉద్యోగపర్వము)

ఈ మంత్రివర్గమున కితరి సాహాయ్యము ఎంతో ప్రయోజనకారి. కావున నే, 1961, 1963 సంవత్సరములలో ఏవో బాలారిష్ట యోగములు వచ్చినా, మహదాశ్రిత భాగ్యముకల యీమంత్రివర్గము గండములను కడచి గట్టెక్కుట అంతకష్టము కాదు.

కాని, ముహూర్తమెట్టిదైనా, ముఖ్యమంత్రి జాతకము ననుసరించియే తన ప్రభావమును చూపగలదు. కనుక, అతని జాతక దశాక్రమమును గమనించనిదే, ఈ మంత్రివర్గపు ఆయుర్దాయమును చెప్పుట అసంగతము. ఆ జాతక సామగ్రి లేదు కనుక, ప్రకృతి మింత చాలును.

శ్రీ తానుపిళ్ళై మంత్రివర్గము ప్రజారంజకముగా పరిపాలనము సాగించి కీర్తి వహించును గాక!

"స్వస్తి ప్రజాభ్యః; పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః."

# శివ యాత్ర

శ్రీ కోట సుందరరామశర్మ

కాళిదాస వచోవిభూషితమహాకాలేశ్వరా, మత్పురా
పారోపార్జితపుణ్యకోశమున, దేవా, తావకజ్యోతిరా
కార ప్రాకటలింగ ముజ్జయినిలో గన్గొంటి, దత్సత్ఫలా
కారం బౌనిది వ్రాయగంటి మనసార్గన్, పర్వతేశప్రభూ!

శ్రీ తంజాపురిలోన నాకు లభియించెన్ బ్రాణికిం గల్పనా
తీతంబౌ బృహదీశ్వరాఖ్యభవదద్దివ్యమహాదర్శనం
బేతాదృక్షయనాప్తపుణ్యఫలితం బేశక్తి కల్పించి నా
చేతన్ పద్యశతంబు వ్రాయ ననువయ్యెన్, పర్వతేశప్రభూ!

గుణతాపత్రయకారి కామిత భవక్రోధాద్యనంతేంధనం
బిగుగా చిత్తములోన మేటిపొగ చూరింపంగ తూలించెనే
యరుదారన్ ద్రిశిరఃపురస్థ భవదీయాకార మబ్లింగమున్
దరిసింపంగనె చిల్కు సత్కరుణ, నన్నా, పర్వతేశప్రభూ!

వరంగల్ గట్టి యఖండకౌతమి యనన్ వర్ధిల్లు గోదావరీ
వరకుం బుట్టినయింటి మేటిదారవై వాసించు నీ త్ర్యంబకే
శ్వర రూపంబున నున్న దివ్యభవదైశ్వర్యమ్ము సేవింపగా
నరుడై పొంగను గాదె నా హృదయ, మయ్యా, పర్వతేశప్రభూ!

కృష్ణావాహిని వాస్తరంగములలో క్రీడింపగా శైతలో
నిష్ణాతత్వము కొంత కల్గినది; తన్నీరంబు మూలంబు రో
చిష్ణు గ్రామమహాబలేశ్వరమునన్ సేవింప నీమూర్తినిన్
దృష్ణాహారిగ భక్తిమై కవిత యొత్తెన్, పర్వతేశప్రభూ!

దక్షారామము సర్వదేండ్లపుడు నే దర్శించితిం గాదె, నీ
యక్షయ్యాంబరు రూపు జూచితివి భీమాఖ్యంబు; వెన్వెంటనే
యక్షుణ్ణంబుగ రెండు పద్యముల నీశా, నాడె వర్ణించుకో
దక్షత్వం బిడినావు నిన్ గొలువ శైతన్ పర్వతేశప్రభూ!

దండం బొక్కటికాక నిర్ధనుని యొద్దం గల్గునే బంగరుం
జెంబేరంబులు? రాణ్మహేంద్రపురిలో నెంచేసి యున్నట్టి మా
ర్కండేయేశ! త్వదీయ దర్శన ఫలాకారంబులౌ నీ స్తుతుల్
మెండై పొంగుచు నిక యర్పితము సుమ్మీ, పర్వతేశప్రభూ!

నా పుణ్యంబుల రాశి గాశిపురిలోనన్ విశ్వనాథాఖ్యమౌ
నీ పారమ్యము జాటు లింగమును గంటిన్, గంగలో మున్చితిన్

నాపాపిష్ఠఘటంబు పంకమొదలంగా, నంత పెల్లుడ్డ నా
యే పుణ్యంబుల గీతో యీ శతక మయ్యెన్, పర్వతేశ ప్రభూ!

ఏతన్మాత్కృవితాసుమంబులు నివాళింపంగ నానాటి నీ
పాతాళేశ్వర రూపదర్శన విధాప్రాబల్యమే గాక, యే
హేతూహం బచరింపలేను; నిను సేవింతున్ భవత్కారుణా
ప్రాతర్మాందసుగంధవాహముల గ్రోలన్, పర్వతేశ ప్రభూ!

నటరాజేశ్వర, నీ చిదంబరములోనం గన్గొ నీ దర్శనం,
బటు పై నొచెను 'చిత్రమిద్ది, యిదిగో' యంచెల్ల భక్తాళి ప్రా
కట భక్తిం గనుగొంగ, నమ్మిదిటు 'నాకా'శాంగమంగుండి యు
త్కట గంగోపమ మత్కవిత్వ మురుకంగా, పర్వతేశ ప్రభూ!

అమరేశా నా కొకనాడు హంపిని విరూపాక్షేశ సందర్శనం
బు, మహాస్కారకమైన నీ నెనరు శంభూ, నాకు సాక్షాత్కృతిన్
విమలానందము గూర్చె, నేను పెదలున్ నేనొక్క గైవారముల్
స్వామునకర్పించిగ, కన్నుగూర్చి, పరమేశా, పర్వతేశ ప్రభూ!

'చండీగఢ్' శిఖరాగ్రదర్శన సువైశాల్యాత్మతత్పుణ్యముల్
పండెం బో, భవదీయ మైశ్వరము భావంబెల్ల భావంబులో
మెండై నీయిదుభిక్షు నిక యిడగా నీకొన్న నాకైత పూ
చెండై నీపదసీమ నద్దుకొనదే, (శ్రీ) పర్వతేశ ప్రభూ!

నినదించున్ హిమవన్మహానగహిమానీ సంభవంబైన య
వ్వాన ధారావళిలోన యునన్మదనుతంపావ్యంజకోంకారముల్;
కని యా పంచనద ప్రదేశమున విశ్వాసున్మదీయాదిమూ
ర్తిం జోహారిడుదున్ 'నమోస్తు జలమూర్తే" పర్వతేశ ప్రభూ!

హిమవత్పర్వతసానుభాగముల దర్శింపంగ జేకూరి నా
సమయంబందు మనోమహాంబరమునన్ జానైన నీ యింటి వ
ట్టు మెరుంగుల్ తులకించి హత్తుకొని గట్టుల్ రేవి యల్లుండ నీ
వె, చురింకన్, మదిలోన నిల్వవలెగా, హే పర్వతేశ ప్రభూ!

బిరలామందిరమందు ఢిల్లిపురిలో బేర్మిన్ ప్రతిష్ఠించిరో
స్థిరయోగీశ్వర ముద్రకంబగు భవద్దివ్యప్రభాయుక్తశాం
తిరసోదంచితమూర్తి, నీ కరుణ నాథా, నావయిన్ వచ్చెనో
పరువ న్నిన్నిటు పంద్యముల గొల్వన్, పర్వతేశ ప్రభూ!

అరయం జూడగలేదె యిందనుక, దేవా, దర్శనప్రాప్తియున్
సిరి నాకందక; క్షేత్రరాజముల నా శ్రీశైల రామేశ్వరా
మరనాథాదుల; గావునన్ మదిని సంభావించి సేవింపగా
వర మీ వీవలె నాకు నిప్పటికి, దేవా, పర్వతేశ ప్రభూ!

# నూరేండ్ల తెలుగు వ్యాసము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

వ్యాస శబ్దమునకు సంస్కృతమున, విస్తారము, విగ్రహము అను పర్యాయపదములు గలవు. 1. విస్తృతి విస్తారః వ్యాస్ ఆచ్ఛాదనే. విశేషముగా గప్పుకొనుట. 2 విశేషేణ గ్రహణం విగ్రహః గ్రహ ఉపాదానే విశేషముగా గ్రహించుట. 3. వివిధమాసనం వ్యాసః అస ఉపవేశనే. అనేక ప్రకారములుగా నుంచుట. అని వీని వ్యుత్పత్తులు. ఈ మూడును విరివికి పేర్లయినను. నేను పై మూడింటిలో వ్యాసము 'అనునది ఆధునిక సాహిత్యశాఖలలో నొక ప్రత్యేక రచనకు రూఢియైనది.

సారస్వత విజ్ఞాన సకల వ్యవస్థా నిరూపణమునకు నీనాడు వ్యాసము ప్రధాన సాధనమైనది. వ్యాసమునకు, పత్రికా వాఙ్మయమునకు అవినాభావసంబంధము. వ్యాసరచయిత లేనిచో మనము గూర్చి వ్రాయుటకు ప్రారంభించిన నది యొకసూత్రమున నశించు నిర్బంధము లేక, పత్రికా ప్రత్యేకశీర్షికలలో దానిని ప్రపంచించుటకు తగిన అవకాశము, వ్యాసరచనలో గలదు. అట్టివి పత్రికలలో ప్రకటితములగుట చేత, వాని యందలి బాగోగులను లోకము గమనించును. రచయితలును వానిని సంస్కరించుటకు వీలగుచున్నది. ఆ వెనుక, వ్యాసములన్నియు గ్రంథరూపమును దాల్చుచున్నవి. కాగా నవీన కాలమున గ్రంథరచనలో ముప్పాతిక మువ్వీసము వ్యాసములే యనుట యతిశయోక్తి కాదు. "అంతా రామమయం ఈజగమంతా రామమయం" అన్నట్లుగా నీనాడు 'అంతా వ్యాసమయం ఈ పత్రికలంతా వ్యాసమయం" అని చెప్పవచ్చును.

సంపాదకీయములనుడు, ఉపసంపాదకీయములనుడు, సారస్వతానుబంధములనుడు మరేమి యనుడు వ్యాసములే, పత్రికకు నియత నిత్యవ్యవహార రూపకములుగా పరిణమించినవి. వార్తలు వ్యాసములు రెండును పత్రికకు ముఖ్యాంగములైనను, వ్యాసములు, వార్తలకంటె సాహిత్యమున స్థాయిత్వము గడించినవి.

ఆంధ్రవాఙ్మయ చరిత్రను పరిశీలించిన వ్యాసము అను రచనా ప్రక్రియ, నవీనయుగమునందే-యనగా ఆంగ్లేయుల పరిపాలన మన దేశమున నెలకొనిన వెనుక క్రిస్తుశకము పందొమ్మిదవ శతాబ్దిలో ఉత్తరార్థ ప్రారంభమునుండియు కానవచ్చుచున్నది. రాజకీయచరిత్ర ననుసరించి యీ యుగమునందలి సాహితీ పరిణామమును సూచించినచో యీ క్రిందవిధముగ చేర్పడును.

క్రీ. శ. 1800–1857– కుంఫిణీపాలన – ప్రాచీనయుగము – వ్యావహారిక భాష. 1857–1947–విక్టోరియారాణి విదేశాంగ యుగము– గ్రాంథిక భాష. 1947–నవీనయుగము. వ్యావహారిక భాష.

బ్రౌను దొరవారు తమ నిఘంటువున (ఇంగ్లీషు- తెలుగు) Essay అనుమాటకు వ్యాసము అనునర్థము నిచ్చిరి (చూడుడు పు. 1880 Supplement) Essay n. s. (add) is commonl ycalled in Madras వ్యాసము. Essayist n. s. he who makes an attempt. who writes an Essay, an author ప్రయత్నము చేసేవాడు (In Madras Commonly Called వ్యాసము వ్రాసివాడు గ్రంథకర్త.)

అనగా క్రీ. శ 1852 ప్రాంతమునకే మన సారస్వతమున వ్యాసరచనా ప్రక్రియ మొదలిడినట్లు తెలియుచున్నది. కాని యీనాటి 'వ్యాసరచనలు' మనకు లభించలేదు.

నేను ముందు చెప్పినట్లుగా పత్రికలకు, వ్యాసములకు, అవినాభావసంబంధ మున్నదిగదా. బ్రౌనుదొరవారి కాలమున భాష వ్యావహారికము. కావున యీ కాలమున పత్రికలు వ్యావహారిక భాషలో వెలువడుచుండెడివి. 'వర్తమాన తరంగిణిలో' (1848-1850) విషయ వివరణ మున్నదిగాని నేటి వ్యాసరూపమున నది లేదు. ఇక ఆ కాలమునాటిదే "వృత్తాంతి" అను పత్రిక మనకు లభ్యము కాక పోవుటచే నందులో నే వ్యాసము లున్నవో తెలియుటలేదు.

ఆ వెనుక క్రీ. శ. 1860 నాటికే పుదూరు స్వామినేని ముద్దు నరసింహులు నాయుడుగారి "హితసూచని" క్రీ. శ. 1862 లో ముద్రితమైనది. అదియే తెలుగు వాఙ్మయ చరిత్రలో వ్యాసరచనా ప్రక్రియకు నాంది కాబట్టి, వ్యాసరచనా చరిత్ర నేటికి నూరేండ్ల నాటిది.

నవ్యాంధ్రసాహితీ జగత్తులో, నింత ప్రాముఖ్యము బడసిన "వ్యాసరచనను" గూర్చి ప్రత్యేక పరిశీలన జరుగలేదు. దీనికి కారణము మనకు వాఙ్మయ సారస్వత చరిత్రలే కాని సాహితీ వికాస క్రమపరిణామమును దెలుపు చరిత్ర లేకపోవుటయే యని ప్రాజ్ఞులకు విదితము. ఈ వ్యాసమున తొలిసారిగా నూరేండ్ల వ్యాసరచనా చరిత్రను నివేదించుటకు ప్రయత్నించుచున్నాను.

అద్యతనాంధ్ర వచనవాఙ్మయ చరిత్రమున, వ్యాసరచన ప్రధాన స్థానము నాక్రమించినది. వ్యాసమునకు సాధారణముగ నీ క్రింద వివరించిన లక్షణము లుండునని గ్రహింపవచ్చును.

1. అతి దీర్ఘమును లేక అతి విపులముగను నుండకుండుట.
2 సంగ్రహముగాగాని, క్లుప్తముగాగాని యుండుట.
3 కర్తవ్యాంశమును విషయ విభాగము చేయుట.
4 ప్రత్యేక ప్రత్యేక శీర్షికలుండుట.
5 సమగ్రముగాని, నిర్దిష్టముగాగాని యుండుట.
6. నియతిమైన పుటలలో నిముడుట.

పై లక్షణములు వ్యాసముయొక్క వస్తువునకు సంబంధించినవి. ఇక వస్తునిరూపణమైన వెనుక భాషకు సంబంధించినవి.

1 భాష, నిర్దుష్టమై, సులభగ్రాహ్యమైయుండుట.
2 వాక్యాన్వయములు, కారకములు – వీనిచే వర్ణస్ఫూర్తి కల్గించుట.

3. ఉపక్రమణిక, ఉపపాదనము, ఉపసంహారము—అను మూడంగములు కలిగియుండుట.

పై లక్షణముల ననుసరించి తెలుఁగున వ్యాసరచనా చరిత్రను పరిశీలించినచో నందు నాలుగు విధములైన పరిణామములు కానవచ్చుచున్నవి.

వ్యాసము : 1 ప్రమేయము, 2 సంగ్రహము, 3 ఉపన్యాసము, 4 పత్రికా వ్యాసము, 5 ప్రత్యేక సంచిక — గ్రంథరూపము.

సలక్షణములు గల యీ యభినవసాహితీశాఖ యందలి రచనలు, నవల రచనలఁ గొన్నింటివలె క్షణికములుగాక, నిత్యనవస్ఫూర్తితో నిలువరించుకొన్నవి. ఈ సలక్షణములను సంగ్రహించిన. 1. విషయ సంగ్రహణము, 2. రచనా సౌలభ్యము, 3. విన్యాసపరిమితి అను మూడును వ్యాసరచనకు మూలములని చెప్పవచ్చును.

వ్యాసరచయిత, తన యాలోచనలను గాని, భావములను గాని స్పష్టముగా తెలుపుటలో కొంత కొంత చదువరుల యూహకు వదలివేయుట తప్పనిసరి యగును. అట్లు వదలకుండ, అంతయు తానే చెప్పుచో ఆ రచన పేలవమై, విసుపు పుట్టించి, బింకమును నింకించును. చదువరుల యూహ కుపయోగించునది ధ్వని, కాకువు. వాక్యవిరామ చిహ్నములు, కారకము ముఖ్యములు. వాక్యమునందలి మాటలను యథేచ్ఛగా వాడుకొనగల వ్యాసరచయిత ఆ మాటలనే, ఒక పొందికతో, ఒక గమనికతో వ్రాసిన, వది వక్తవ్యాంశమును సమీచీనముగా ధ్వనింపఁజేసి మనసునకు హత్తుకొనునట్లు చేయును.

## ప్రమేయము

ఈ విభాగమున ప్రథమముగను, కడపటిదిగను పేర్కొనఁదగినది, శ్రీ సామినేని ముద్దునరసింహనాయుడు గారి హితసూచిని. ఇందు 1వ్యాసరూపమున తొమ్మిది ప్రమేయములు గలవు —1. విద్యా ప్రమేయము, 2. వైద్యప్రమేయము, 3. సువర్ణప్రమేయము, 4. మనుష్యేతర జంతు సంజ్ఞా ప్రమేయమును, 5. గత్యుత్పత్తి ప్రమేయము, 6. మంత్రప్రమేయము, 7. పరోక్షాది జ్ఞానప్రమేయము, 8. వివాహ ప్రమేయము. ఇందలి రచన శిష్ట వ్యావహారికము. ఉదాహరణము :

“స్త్రీలకు విద్యలు నాశకము లౌచున్నవి. విద్యలు నేర్పుకొనుటకు హిందూదేశములో గ్రంథములు మిక్కిలి సదుపాయముగా నేర్పడియున్నట్లు కొందరెంచుకొంచున్నారు కాని, యిదివరకు విర్పడియున్న గ్రంథములు ఏవి, వాటిని బాలురకు చెప్పించు పద్ధతులేవి, యెవరెవరిచేత జరిగించబడుచున్న కృషికి తగినఫలములు ఇవ్వడము లేవందువమున్న, శరీరారోగ్యమునకు జరూరైన వైద్యాంశములు గ్రహించడము సర్వ ముఖ్యకార్యమైనప్పటికిన్ని, హిందూ జనులయందు, అంగనుగూర్చి ఉపేక్ష చెయ్యబడుచున్నందున నున్న... వారికి వ్యర్థప్రయత్నమున్ను, వ్యర్థకాలక్షేపమున్ను అనారోగ్యమున్ను హానియున్ను కలుగుచున్నవి.”

గ్రంథకర్త తాను వాడిన భాషనుగూర్చి యిట్లు చెప్పియున్నాడు :

“గ్రామ్యోక్తి ఆంధ్రభాషాశాస్త్రాలకు అంశములలో నొకటిగా లక్షణగ్రంథములయందు చెప్పబడియున్నది. ఈ పదములు ఛందోబద్ధములైన గ్రంథములయందు చేర్చడము అరుదైయున్నదిగాని, వాక్యగ్రంథములయందున్నూ, భాషయందును వీటి వాడిక తిరుచే యున్నది. ఇందువల్ల భాషారచన మిక్కిలి ధారాళముగా నుండును న్నది. గనుక సాధారణమైన భాషయందు వాడుకలోనున్న గ్రామ్యపదములు చాలామట్టుకు సరసమైన వాక్యరచనలో అంగీకరించ తగినవిగా నేను ఎంచుకుంటున్నాను.” (హితసూచిని 1862.)

## సంగ్రహము

వ్యాసములను సంగ్రహము లను పేర తెలుఁగున వెలయించినది భారతవర్ష ప్రథమ మహామహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులుగారు. వారీక్రింది సంగ్రహవ్యాసములను రచియించి ప్రకటించిరి. ప్రాచీన భారతీయమత సాహితీసంస్కృతి విశేషములను సర్వజన సులభ గ్రాహ్యమైన శైలిలో సప్రామాణికముగ తెలుఁగులో వ్యాసరూపమునఁ బ్రకటించినవారిలో రంగాచార్యులవారు ప్రథములు. ఆయా విశేషములుగల వ్యాసముల నీక్రింద పేర్కొనుచున్నాను.

1. అలంకార సంగ్రహము; 2. వర్ణనిర్ణయము; 3. ఆర్షమత సంగ్రహము; 4. ఆత్మసంగ్రహము; 5. శాఖా సంగ్రహము; 6. శ్రుతి సంగ్రహము; 7. స్మృతి సంగ్రహము; 8. వర్ణ సంగ్రహము; 9. వేద సంగ్రహము; 10. వివాహసంగ్రహము; 11. దేవతా సంగ్రహము; 12. ధర్మజన్మసంగ్రహము; 13. గుణ సంగ్రహము; 14 అవతార సంగ్రహము; 15. కళా సంగ్రహము; 16. కర్మసంగ్రహము; 17. ముక్త సంగ్రహము; 18. ముక్తమార్గసంగ్రహము; 19 ప్రమాణ సంగ్రహము; 20. ప్రాయశ్చిత్త సంగ్రహము; 21. పునర్వివాహ సంగ్రహము; 22. రహస్యసంగ్రహము; 23. హిందూశాస్త్ర సంగ్రహము.

## ఉపన్యాసము

నవ్యసాహిత్యరంగమున ‘ఉపన్యాసము’ అను రచనకు నొక ప్రత్యేక స్థానమున్నది. నేటి వ్యవహారములో, సాధారణముగ ప్రత్యేక సమావేశములయందు, సభలయందు, లిఖితరూపముగా గాక వాగ్రూపముగా చెప్పినవానికే, ఉపన్యాసములు అను వాడుక యున్నను, నొకప్పుడిది ‘వ్యాసము’ అనుపదమునకు పర్యాయపదముగా నుండెడిది. ఈపరిస్థితి క్రీ. శ. 1870 ప్రాంతమునుండి వాఙ్మయమున నేర్పడినది. దానికి కారణము నాటి సాంఘికపరిస్థితులే. వ్యాసములైనను, ఉపన్యాసములైనను మనకు పాశ్చాత్య నాగరికత, సంస్కృతి, సంస్కారములవలన వచ్చినవియే యని వాఙ్మయచరిత్రకారులకు, విమర్శకులకు విదితమైయున్నది. ఈ సంస్కార మూలముననే మన తెలుఁగుదేశమున వ్యాసరూపమునఁగల 2యుపన్యాస

---

1. గద్యచింతామణి. గిడుగు పండితులు గారిచే సమకూర్పఁబడింది. ఇందీ గ్రంథము ‘వ్యాసము’గానే పరిగణితమైనది. చూడుడు విషయసూచిక పు. 25: వ్యాసము. హితసూచిని—సామినేని ముద్దునరసింహనాయుడు.

2 ఈ యుపన్యాస శాఖానిర్వచనము లెఱుఁగఁగోరువారు నేను రచించిన ఆంధ్రవచన వాఙ్మయము 146, 147, 148 పుటలు చూడవలెను.

పద్ధతి ప్రారంభమై వ్యాప్తిలోనికి వచ్చినది. దీనిని ప్రారంభించిన వారు, ఆధునికాంధ్ర వాఙ్మయమున యుగపురుషుడు వీరేశలింగము పంతులు. వారు మొదట యుపన్యసింపఁబోవు విషయమును, వ్యాసములవలె సుప్రక్రమోప సంహారాదిలక్షణముల ననుసరించి దిద్ది తీర్చి వానిని, సభాసమావేశములయం దుపన్యసించి, ఆపై వానిని గ్రంథరూపమున ప్రకటించువారు. వారా యుపన్యాసములు చేసిన స్థలములు రాజమహేంద్రవరమున ప్రార్థనసమాజము, విజయనగరమహారాజావారి బాలికాపాఠశాల. ఇవి ప్రథమమున ముద్రితములై ప్రకటితములైనప్పుడు, వాని ముఖపత్రమున నిట్లుండెను: "ఐకమత్యము: తే 15-8-1875 దిని రాజమహేంద్రవరమున, విజయనగరము మహారాజావారి బాలికాపాఠశాలయందు కందుకూరి వీరేశలింగముచే నియ్యఁబడిన యుపన్యాసము."

వీరేశలింగకవి వ్యాసములను నాలుగువిధములుగా విభాగింపవచ్చును. (1) మతము (2) స్త్రీ పునర్వివాహవిషయము (3) సాంఘిక ప్రవృత్తి (4) రాజకీయములు.

1. మతము: హిందూమతములు - వర్ణములు, జన్మాంతరము, విగ్రహారాధనము—ప్రార్థన, వైరాగ్యము, దానములు, ఈశ్వరదత్త పుస్తకములు, ఈశ్వరోపాసనము.

(2) స్త్రీ పునర్వివాహవిషయము: అతిబాల్య వివాహములు, స్త్రీ పునర్వివాహవిషయకోపన్యాసము, ప్రథమ విజ్ఞాపనము, ప్రవర్తక సమాజవిజ్ఞాపనము. (ప్రథమ ద్వితీయములు), స్త్రీ పునర్వివాహ విషయశాస్త్ర సంగ్రహము.

(3) సాంఘిక ప్రవృత్తి: ఐకమత్యము, విద్యాధికుల యర్హకృత్యములు విద్యార్థుల ధర్మములు, సహాయకకర్మలు, స్వయంకృషి, జీవిత పరమార్థము—దానిని పొందు లాభములు.

(4) రాజకీయములు: దేశీయ మహాజనసభ దాని యుద్దేశములు, సంఘ సంస్కరణ, మహాసభాధ్యక్షోపన్యాసము, గోదావరీ మండల సాంఘిక సభాప్రసంగము.

4వీరేశలింగకవి వ్యాసములయందు (1) సులభగ్రాహ్యశైలి (2) వైశద్యము (3) సమత (4) జీవము ముఖ్యలక్షణములు. మఱియు నీ వ్యాసారంభమున నేను వివరించిన లక్షణములన్నియు వీరేశలింగకవి రచనలయందు పొందుపడియుండుటచే, నీతని "వ్యాసరచనాచార్యుఁడు" అని యీశాఖాచరిత్రమున పేర్కొనవలెను.

కందుకూరి వారికాలముననే వెలువడిన యుపన్యాసములను, వ్యాసములను రెండుపేళ్లతోను వ్యవహరింప బడుచున్నట్లుగా నీ ప్రచురణములనుబట్టి గ్రహింపవచ్చును. కర్మోపన్యాసము - దుర్భాక వెంకటాచలశాస్త్రి - 1892. ఇది కర్మను గూర్చిన వ్యాసము. బేకనుపన్యాసములు - ఆంగ్లేయ భాషలో ప్రసిద్ధవచన రచయిత తాత్త్వికుఁడును నగు బేకను మహాశయుడు వ్రాసిన వ్యాసముల కా భాషలో Bacon's Essays అని పేరు. కాని తెలుగులో తొలుత దీనిని భాషాంతరీకరించిన శ్రీ కిళాంబి రామానుజాచార్యులుగారు దీనికి 'బేకనుపన్యాసములు' అని పేరు పెట్టియున్నారు. రెండవ భాషాంతరీకర్తయగు సుసర్ల అనంతరావుగారు "బేకనుపన్యాసములు" అని వ్యాసమునకు పర్యాయపదముగా వాడియున్నారు.

ఉపన్యాస పయోనిధి—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు: 'కావ్య విమర్శనమునందు యమునికవాక్ సిద్ధప్రాణుఁడని' గిడుగువారిచే కీర్తితుఁడైన కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ప్రసిద్ధ వ్యాసరచయితలు. వారు వీరేశలింగముగారికి ప్రతిస్పర్థులై, ఆర్యమతబోధిని పత్రిక ద్వారమున మత సాంఘిక విషయములపై పెక్కు వ్యాసములు వ్రాసిరి. సాహిత్యమునందును పరిశ్రమములుగా వ్యాసవ్యాసంగము చేసిరి. అయినను క్రీ. శ. 1910 లో వారి వ్యాసములొక సంపుటముగా ప్రకటింపబడినపుడా గ్రంథమునకు "ఉపన్యాస పయోనిధి" అను పేర్లే యుండుట గమనింపదగినది.

ఇట్లే, వల్లూరి జగన్నాథరావుగారి ఉదకమును గూర్చిన ఉపన్యాసము (క్రీ. శ. 1881), మన్నవ బుచ్చయ పంతులుగారి కామినీ గర్హణ దూషణము అను నుపన్యాసము (1891) వ్యాసములే. పైవానిలో ఉదకమునుగూర్చిన వ్యాసము శాస్త్రీయ పద్ధతిని, శ్రుతి స్మృతి ప్రమాణ పూర్వకముగ రచితమైనది. తిరిగి ముద్రణము కాదగిన ప్రశస్తరచన.

## పత్రికా వ్యాసము

వార్తా పత్రికల స్వరూపమును మార్చి, ప్రత్యేక సంచికా రూపమున వెలువరించిన ప్రథమ పత్రిక తత్త్వబోధిని. ఇది క్రీ. శ. 1865 లో ప్రారంభమై మాసమునకొకతూరి సంచికారూపమున వెలువడుచుండెడిది. నేడు మనము "వ్యాసము" అని పరిగణించుశాఖను పత్రికయందు ప్రవేశపెట్టిన దీ పత్రికయే. క్రీ. శ. 1868 సంవత్సరమున ప్రకటింపబడిన యీ క్రింది వ్యాసము లెంత సమూల్యములో వివరించుచున్నాను.

సారస్వతము:—శతావధాన వివరణము 5 ఇందు శతావధానమున చేయునట్టి పద్ధతులు సంపూర్ణముగ వివరింపబడినవి. అవి

| | | |
|---|---|---|
| 1. | కవిత్వభేదములు. | 66 |
| 2. | ఖండ పత్రికా భేదములు. | 12 |
| 3. | చతురంగ భేదములు. | 18 |
| 4. | గణిత భేదములు. | 4 |
| 5. | ప్రకీర్ణక భేదములు. | 4 |
| 6. | నిర్బంధ భేదములు. | 6=104 భేదములు |

---

3. ఇట్లు ప్రథమముద్రణమునందలి విషయములన్నింటిని సంగ్రహించి పై గ్రంథమున వివరించితిని. వీరేశలింగముగారే తాము సంపుటములుగా ప్రకటించునప్పుడు వీనిని విడిచి వేయుటచేత, తరువాతి ముద్రణములలో నివి చేరలేదు.

4. వీరేశలింగముగారి వ్యాసములను క్రీ. శ. 1879 మొదలు క్రీ. శ. 1897 వఱకును రచించియున్నారు. వారి చివరవ్యాసము, వారు చనిపోవుటకుముందు క్రీ. శ. 1918 లో వ్రాసినది, "బమ్మెర పోతనామాత్యుఁడు" అనునది. ఇది యా సంవత్సరముననే, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికయందు ప్రకటితమైనది.

5. శ్రీ వేలూరి శివరామశాస్త్రి మహోదయులు ఆంధ్ర వారపత్రిక స్వర్ణోత్సవ సంచికయందు వ్యాసమును గూర్చి సూచించిరి.

నేటి 'శతావధానమున' కొన్ని పద్ధతులను మాత్రమే పనమెఱుంగుదుము - కాని తక్కువ యున్నియు విస్మృతములు. ఈ వ్యాసమున నా నివరణములన్నియు గలవు. ఈ విషయమును గూర్చి ప్రత్యేకముగఁ దెలుపు వ్యాసము నేటివఱకు వెలువడలేదు.

సాంఘికము :—1. స్త్రీ పునర్వివాహ విషయము. 2. బాలికా విద్యావశ్యకము.

మతము :—ఈ పత్రిక బ్రాహ్మమత సంబంధమైనది యగుటచే మతమునకు సంబంధించిన వ్యాసములు వెలువడినవి. 1. పరిశుద్ధాత్మిక మతస్వరూపము, 2. పరమాత్మ స్వరూపము. 3. జీవాత్మ స్వరూపము. పరిశుద్ధాత్మిక తత్త్వము.

వైజ్ఞానికములు :— 1. సూర్యగ్రహణము, 2. స్థైర్యము, 3. ఐకమత్యము.

ఈ పత్రికలో ప్రకటితమైన “స్త్రీ పునర్వివాహ విషయము” అను వ్యాసమే వితంతువివాహముల నాచరించిన వీరేశలింగము పంతులు గారికి నాయుద్యమమున చేయూత నిచ్చినది. ఇది వారి స్వీయచరిత్ర చదివినవారికి తెలియగలదు. మఱియు వారు బ్రహ్మసమాజికులగుటకును నీ పత్రికయే కారణము. పైని పేర్కొన్న వ్యాసములోని సులభశైలియే వీరేశలింగముగారి సౌలభ్య వచనరచనకు మూలమైనది.

“తత్త్వబోధిని” తరువాతనే, బందరున ‘పురుషార్థ ప్రదాయిని’, రాజమహేంద్రవరమున “వివేకవర్ధని” (వీరేశలింగము పంతులు గారిది) సంచికారూపమున వెలువడుచుండెడివి. ఆ పత్రికలలో వివేకవర్ధనిలో మాత్రము వీరేశలింగము పంతులుగారి వ్యాసములు కొన్ని ప్రకటితములైనవి. కాని యీ నాటి పత్రికలలో భాషాసాహిత్య వివాదములు కొన్ని చిన్ని కృతులుగూడ ప్రచురములగుచుండెడివి. అవి నాటికిని నేటికిని విస్మృతిప్రాయములు. ఉదాహరణకు—వివేకవర్ధనిలో వీరేశలింగము పంతులుగారు, శ్రీ పన్నాల సీతారామ బ్రహ్మశాస్త్రి (వీరు వీరేశలింగముగారి ఆంధ్రభాషా గురువులు) రచితమైన ‘పూచిపువ్వ’ శతకమును ప్రచురించిరి. ఈ శాస్త్రిగారు గాని, శతకము గాని నేటివఱకు కవుల చరిత్ర కెక్కలేదు.

క్రీ. శ. 187? ప్రాంతమునుండి. సంచికారూపమున నిట్టి మాసపత్రికలును, కేవల వార్తలను, విశేషములను ప్రకటించు పత్రికలును వేఱు వేఱుగా బయల్వెడలినవి.

ప్రతి వారమును, కేవలము పత్రికారూపమున వెలువడు వానికంటె, ప్రతి మాసమును నొక గ్రంథరూపమున వెలువడు సంచికలయందు “వ్యాసములు” ప్రకటించుటకు నవకాశములున్నను, అప్పటి దేశకాల భాషాపరిస్థితుల ననుసరించి, వానియందు అముద్రిత ప్రాచీనాంధ్ర కావ్యప్రచురణము ప్రధానస్థాన మాక్రమించినది. అముద్రిత గ్రంథ చింతామణి, సరస్వతి, మంజువాణి మొదలగు పత్రికలు ఆంధ్ర ప్రబంధముల నెన్నింటినో వెలుగులోనికి దెచ్చినవి. వానిలో సరస్వతి, మంజువాణి పత్రికలు కేవలము గ్రంథప్రకాశమునకే వినియోగమైనవి. అముద్రిత గ్రంథ చింతామణి పత్రికమాత్రము, ప్రాచీన ప్రబంధములతోపాటు “వ్యాసము”లను కూడ ప్రకటించినది. అవి కేవలము ఛందోవ్యాకరణములకు సంబంధించినవి. ఆ వ్యాసములు నేటి వ్యాసలక్షణముల ననుసరించినవియే.

శాబ్దికములు : 1. పరిఘా పరిఖశబ్దద్వయ విచారము 2. రేఫద్వయవిచారము 3. ఙ. ఞ. కారవిచారము 4. ఉకారాంతపద విచారము 5. బిందుపూర్వక టవర్గయతి 6. గసదవాదేశవిచారము ఏతద్విషయ మొదలగువాని దర్ప శ్రీ వేదమువారి 7. క్యమంతక, స్యమంతకశబ్ద విచారణ 8. పయశ్శబ్ద విచారణ 9. యతి కీర్తి శేషోపవ్యాసము.

ఛందస్సు : నన్నయభట్టారకుని కవిత్వమునందలి ఛందో విశేషములు.

ఆ కాలమునందలి పత్రికలలో సాహిత్యవిషయమే ప్రధానము. అప్పటికింకను సాహిత్యేతర వైజ్ఞానిక విషయములు తెలుగులోనికి వచ్చియుండకపోవుటచేతను. విషయములు తెలిసియు తెలుగు భాషలో వానిని తెలుపువారు అత్యల్పసంఖ్యాకు లగుటచేతను సాహిత్య విషయములే ప్రధానములైనవి.

వైజ్ఞానిక, శాస్త్రీయ విషయములను వ్యాసరూపమునఁ దెలిపిన తొలిపత్రిక ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారి ‘కల్పలత.’ ఇది సాహిత్యపత్రికయే యైనను, ప్రప్రథమున శాస్త్రీయ విషయములను ప్రచురించినది.

1. భూమితత్త్వము, 2. ఖనిజములు, 3. ఆర్యగృహము, 4. వాయువిమానములు, 5. విద్యుచ్ఛక్తి మున్నగు వ్యాసములందు ప్రకటితములైనవి.

‘కల్పలత’ పత్రికాప్రకటనకుపూర్వమే అనగా క్రీ. శ. 1891 లో సాంఖ్యాయనులు “రహస్యదర్పణము” అను పేర, తొలుత వైజ్ఞానిక శాస్త్రీయగ్రంథమును వ్యాసరూపమున ప్రకటించిరి. అందు 1. దృశ్యప్రపంచ రహస్యములు, 2. క్రిమికీటక రహస్యములు, 3. పక్షిరహస్యములు, 4. జంతుమాత్ర రహస్యములు అను వ్యాసశీర్షికలు గలవు.

శాస్త్రీయమైన సాంకేతికపదములను వాడకుండ, సర్వజన గ్రాహ్యముగ తేటతెలుగు మాటలలో వైజ్ఞానిక విషయములను వివరించు పద్ధతికి సాంఖ్యాయనశర్మగారే ప్రథములని చెప్పవచ్చును.

‘భారతీ కళానిధి’ యనునొక పత్రిక క్రీ. శ. 1916 లో బెంగుళూరునుండి వెలువడుచుండెడిది. ఆ పత్రిక ప్రథమ సంచికయందు “ఆంధ్రభాష”నుగూర్చి యపూర్వవ్యుత్పత్తి విషయములను దెలుపు నొక వ్యాసముగలదు. అందు “ప్రపంచలహరి” యను గ్రంథము భాషాధికారము 18వ ప్రకరణమున కృతియుగమునుండి కలియుగమువఱకు నేర్పడిన యీ క్రింది యాంధ్రభాషాభేదము లీయఁబడినవి. 1 ఆంధ్రము, 2 ఆంధ్రభేదము, 3 కోసలాంధ్రము, 4.

6. ఈ వాదము, భాషాతత్త్వమునుగూర్చి, తెలుగు వ్యాకరణమునుగూర్చి, ఛందస్సునుగూర్చి వ్రాయబడి, వ్రాయబడుచున్న వ్యాసములలోని యంశము లిప్పటికి వలె బడియుండ్లు క్రిందటి వ్యాసములలో నుదాహరింపబడినవని నేటి భాషాసాహితీ పరిశోధకు లెఱుంగుదురు గాక.

కవిగారి శైలి, సంస్కృతాంధ్ర పదబంధ పటుత్వము గలిగి, ప్రసన్న గంభీరమై నలరుచుండును. అట్టి శైలి యతికొలదికి నసాధ్యమై, పట్టుపడనిది. వారి వ్యాసము లన్నియు నింతవఱకు నొక సంపుటముగ వెలువడకపోవుట సాహిత్యోపాసకుల దురదృష్టము.

వారి రచనకొక యుదాహృతి: "మయూరకవి వాగ్గుంభనము మిక్కిలి ప్రౌఢమై, అర్థము గంభీరమై పాండిత్య వైదగ్ధ్య మూలకోదాత్తమై, శబ్దరచన యతిశిథిల బంధమై, యక్లిష్టమై, ప్రతిపదరసగ్రాహి అయి యుండును. ఈతని కవిత్వమందు రచనాపాటవముతో పాటు సందర్భశుద్ధియు, నర్థగాంభీర్యముతో పాటు శ్లేషావైదుష్యమును గలవు. పద గుంఫనము లలిత మధురమై, యర్థము ప్రసన్న గంభీరమై యనువాదమే మూలగ్రంథమని జనింపజేయుట ప్రథమ క్లేశము. రెండవది యథానుసారము మూలపద్య చ్ఛందస్సునకు సాజాత్యముగా లేక సమాన పరిమితముగా త్వరితజాతుల నేరుకొనుట. మూడవ క్లేశము. మూలపద్యములలో గల ధ్వనివిశేషములకు శాస్త్రాంతర రహస్యములును, చరిత్రాంశసంఘటనలును, శ్లేషభంగుల నేకదేశస్తుతినిందాగర్భిత విధానములును ననువాదమునకు దెచ్చుట. ఈ మూడును ననుకరణములలో సాధారణలక్షణములు."

విమర్శాదర్శక నడకుదుటి వీరరాజుగారి సాహిత్యవ్యాసములు విశిష్టత గలవి. ఇవి విమర్శతరంగిణి యను పేర ముద్రితములై యున్నవి. నిగ్రహము గల రచన, భావవైశద్యము వీరి వ్యాసములలో ప్రామాణికములై యుండును.

శ్రీ వేలూరి శివరామశాస్త్రి: విశ్వతోముఖప్రజ్ఞతో, మహావిద్వాంసులుగా, విఖ్యాత శతావధానులుగా, మినుమిగిలిన కవికథకులుగా, విరాజిల్లి, తను పేరులోనే, హరిహరాద్వైతసిద్ధిని సంపాదించిన భాషాసాహితీ నియంతలు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. వీరి వ్యాసరచన లాంధ్రభారతికి వెలలేని భూషణములు.

అతినిగూఢమును గంభీరమును నగు నద్వైత వేదాంతమును నాంధ్రభాషలో నతిసులభముగ నరటి పండొలిచి చేతికిచ్చిన రీతిని వివరింపగల సిద్ధహస్తులు శ్రీ శాస్త్రిగారొక్కరే. మాయావాదము, అరవిందదర్శనము మున్నగు వ్యాసములు వారి రచనకు దర్పణప్రాయములు. ప్రాచీన ఖగోళము మున్నగునవి వారి వైజ్ఞానిక ప్రతిభకు తార్కాణములు. ఉదాహృతి:

"కార్యము భవిష్యత్తు. కారణము భూతము, తిరిగి కార్యము వర్తమానము. కారణము భూతము. కావున కార్యకారణములే సునకు భూత భవిష్య ద్వర్తమానములు. కుమ్మరి ఒక కుండ చేయబోవుచున్నాడనుకొందము. అతడు మొదట నేమి చేయును? మన్ను, నీరు, బూడిదె సారెకోల మొదలగువానిని చేకూర్చికొనును. కుండకివి యన్నియు కారణములే. ఆరంభవాదు లీ కారణములలో మట్టిని మాత్రము సమవాయి కారణమని యందురు.

"ఈ సృష్టికి పూర్వము ప్రత్యక్షముగా కానుపించు వస్తువేదియు లేదు. నిత్యములగు గాలి నిప్పు నీరు మన్నుల పరమాణువులును దిక్కాలాకాశములును ఈశ్వరుడును లెక్కలేని జీవాత్మలును నీ సృష్టికి పూర్వమున్నవి."

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ: శర్మగారి వ్యాసశైలి సజీవమైనది. మనసుమీద ముద్ర పడినట్లు చెప్పగల శక్తి దానికి గలదు. వాక్యములు చిన్నవియై పటుత్వము గలవి. భావబంధురమైనవి. సరసమగు హాస్యముతో జాతీయతను ప్రకటించునవి. సారస్వతాలోకమున ప్రకాశితమైన వీరి వ్యాసములలో ననుకరణమునకు నలవి యని "రచనాశిల్పము" కలదు. కావుననే శ్రీ శర్మగారు వ్యాసరచయితలలో ప్రత్యేక వ్యక్తిత్వము గల మనీషి.

## చారిత్రక వ్యాసము

చారిత్రక వ్యాసరచనమున కొవిదగ్రామణులు కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు. సరసిజాసనులు. సంస్కృతాంధ్ర మహారాష్ట్ర భాషలయందు విద్వాంసులు. వీరి వ్యాసశైలియందు సమత, సౌలభ్యములు సమానముగ నుండుటయేగాక ఎట్టి నిగూఢ, క్లిష్ట, గహన విషయము నైన నిష్పంకిలముగ, తేలముగ విప్పచెప్పును. వీరి శైలియందు నూతనత్వము వాపాదించు వైశద్యము గలదు.

చరిత్ర, శాసనములు, భాషాశాస్త్రము, కళ మొదలుకొని విజ్ఞానసర్వస్వము వఱకును వీరి వ్యాసరచన విస్తరిల్లినది. వివిధ విషయగుంఫితములగు వీరి వ్యాసములు సంపుటముగా ప్రకటితములు.

చరిత్ర చతురాననులు వీరభద్రరావుగారి వ్యాసరచన వాదప్రతివాదములయందు నూతనత్వమున వెలుగొందుచుండును. పటుత్వము గలిగి పఠనీయమగు రచన.

మల్లంపల్లి వారు: ఆంధ్రదేశ చారిత్రక పరిశోధనాచార్యులగు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చారిత్రక వ్యాసరచనయందు సిద్ధహస్తులు. శర్మగారు తొలుత చక్కని గ్రాంథిక భాషలో వ్యాసరచన సాగించిరి. వీరి రచన భావోద్రేకము గల్గించి, పాఠకులకు మన చరిత్రయెడల సమాభిమానము గల్గించును. అజంతా శిల్పములు, చారిత్రక వ్యాసములు, బౌద్ధయుగము చాల ప్రసిద్ధవహించినవి.

కుందూరి ఈశ్వరదత్తు: సరసమును, వైశద్యమునుగల శైలితో చారిత్రక వ్యాసములు వ్రాయుటయందు కుందూరి ఈశ్వరదత్తుగారు ప్రత్యేక ప్రతిష్ఠ బడసినవారు. వీరి వ్యాసములన్నియు సంపుటముగా ప్రకటితము కాలేదు.

నేలటూరివారు: "కవిష్ఠి కాధిష్ఠిత కాళిదాసః" అన్నట్లు చారిత్రక వ్యాసరచనలలో డాక్టర్ నేలటూరి వేంకట రమణయ్యగారు నిర్మిత్రులు. నిర్దుష్టమగు గ్రాంథిక రచనతో, నిండైన విషయసంపదతో నిశితమైన పరిశోధన దృష్టితో వీరి వ్యాసములు విరాజిల్లుచుండును.

సాహిత్యరంగము నందుననెగాక, ఒకే యుగమునకు సంబంధించిన చారిత్రక వ్యాసములొకే సంపుటముగ వెలువడు నవకాశము ఆంధ్రదేశచరిత్రకు, రాజమహేంద్రవరము ఆంధ్రేతిహాసమండలి వారివలన సమకూడినది. వారీ క్రిందిసంచికా సంపుటమును వెలయించిరి. ఆ సంచికల సంపాదకులు చారిత్రక వ్యాసరచనయందు దండ వేసిన చేతులేగాని, సామాన్యులు గారు. ప్రతిభాశాలురు—సుప్రసిద్ధ చారిత్రకులు.

1. రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక: సంపాదకులు కీర్తిశేషులు శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు. ఇదియొక్కటియే వినుక

"శ్రాగ్ని నోటుకులేని చెల్లుబడి కా—నా-చీటికీ గలిగినది.

"లౌకికములో నలౌకికుడు; కార్యసాధనలో కాముకుడు; రక్తిననుభోగించిన విరక్తుడు; లాలసత్వమున ప్రజ్ఞస్థాయినందిన విప్లవుడు.

"భోగియై, త్యాగియై, యోగియైనాడు.

"నేడు అమృతాంజనము తెలుగని యతుక్కాడు లేడు."

## సంపాదకీయములు

పత్రికా సంపాదకత్వమున ప్రత్యేక ప్రతిభను ప్రదర్శించిన వారిలో శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు, శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు, శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు ప్రత్యేకముగ గణనీయులు.7 నాగేశ్వరరావు పంతులుగారి యుదాత్త గంభీరశైలి, ఆంధ్రపత్రిక సంపాదకీయములు, సంవత్సరాది సంచికల ప్రస్తావనల యందును ప్రస్ఫుటమైనది. వారు సంపాదకీయవ్యాస పరమేశ్వరులు.

నేటి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో లలితముగ, భావస్ఫోరకముగ, తెలుగునేల ముటిపడునట్లుగా రేఖామాత్రముగ, సంభాషణ రీతి ప్రదర్శింపజేయుచు, తెలుగువెలుగులను దిద్ది తీర్చగల "తెలుగు వెలుగులు" శీర్షిక ప్రత్యేకముగా పేర్కొనదగినది. మచ్చునకు ముచ్చటగూర్చు నొక తునక:

"రాజాజీ రవీంద్రులను చూచి ముగ్ధుడై వారి ననుసరించటం సాగించారు. ఆ యువతిని పోషించి పెంచాలనుకున్నారు. అది ప్రమాదించింది. ఆయన కవి గాడు; కవి. సాహిత్యమందరి చరణ చారణ చక్రవర్తి. నాయకుడు గాని నాయకుడు. రాజకీయాల్లో ఒక మాదిరి ఉమంగ ధుర్యం. ముప్పరెడ్డి రేసుల రెమ్మ. పోయినదాన్ని గూర్చి విచారించక ఉన్నదాంతో సుఖించి ఆనందించెయ్యాలి; వేదాంతి."

శ్రీ ముట్నూరి కృష్ణారావు: శ్రీ కృష్ణారావు-కృష్ణా పత్రిక అవినాభావ సంబంధముగలవి. సంపాదకీయ వ్యాసములలో ముట్నూరి వారి దొక ప్రత్యేక స్థానము. వంగదేశీయ సంస్కృతి ప్రభావము, వారి రచనలలో గోచరించినను శైలి సదాత్తమై, భావబంధురమై నాటి దినము గలిగి నూతనత్వము ప్రదర్శించుచు. వీరినిగూర్చి పత్రిక లిట్లు వ్రాసినవి.

"సర్వ విషయములలోను, సర్వ శాస్త్రములలోను, సామాన్య జ్ఞానంతో కాక, సూక్ష్మ పరిజ్ఞానంతో విమర్శించేవారు. రసాస్వాదనకు రెక్కలు విప్పి వెలార్చు విహంగము కృష్ణారావుగారు. రససిద్ధి పరియడానికి విసువు లేకుండా అంచనాలు వేసిన రసికమూర్తి."

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు: ఇటు కందుకూరివారి సులభ గ్రాంధిక శైలికీ, అటు గిడుగువారి వ్యావహారిక భాషా శైలికీ సంధి చేసినట్టి నవనవ నవ్యమైనది, నవ్య విజ్ఞాన ప్రచార సాధనమైనది అయిన శైలి నార్లగారిది. అది వారి సంపాదకీయములలో, వారి వ్యాసములలో ప్రస్ఫుటమగుచుండును. కొన్ని మాటలలోనే గొప్ప సూక్తియు కూర్చగలరు. కూర్పు నేర్పుతో కోవిదుల మనము లలరింపగలరు.

## వ్యాసములు - వ్యావహారిక భాషోద్యమము

వాడుక భాషలో వ్యాసములు రచించి, వ్యాసరచన నొక కళగా దిద్ది తీర్చిన మనీషి గురజాడ అప్పారావు. వ్యావహారిక భాషలో సాహిత్య విమర్శనాత్మకరూపములైన వ్యాసములను రచించుటలో గురజాడ గురజాడయే!8

గురజాడ రచన కొక యుదాహరణ: "చిన్నతనంలో బొమ్మలాట నేర్పించడము చేత లోకమంతా రంగం—చిన్నకోటి రీతులను ఆటాడే మనుషులనే పాత్రముల సొగసునే కవిపెట్టడము నాకు అలవాటైనది—సొగసులేని మనిషే ఉండడు. స్నేహము, ప్రేమా, అనాది అయినా యెప్పటికి సరిక్రొత్తగా వుంటే రెండు వెలుగులను నగనిమీదికి తిప్పి కొంచితే వింతసొగసులు బయలుదేరుతవి—అనూయ అనే అంధకారంలో అంతా ఏకనలుపే."

గిడుగువారు: వ్యావహారిక భాషను శిరస్థాయినిగా నొనర్చి, యభినవ వాగనుశాసనులైన రామమూర్తిపంతులుగారు వ్యావహారిక రచనలో నీ వ్యాసముల వ్రాసి యాచరణకు మార్గదర్శకులైనారు. వారి "తెలుగు" పత్రికలో మొదట వ్యాసరూపములుగా వెలువడిన—ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము—అను శీర్షికతో వారి గ్రంథరూపమును దాల్చినది. వారు సూర్యరాయాంధ్ర నిఘంటు ప్రథమ సంపుటముపై వ్రాసిన సమీక్షా వ్యాసము చాలా గొప్పది. అందలి రచన మనోహరముగా చమత్కారముగా నుండును. చూడుడు: "వర్తమాన వ్యావహారిక భాషానిఘంటువులు, జనభాషా పట్టీలవలెను రైలుటిక్కెట్ల రాకపోకల ప్రకటనలవలెను, దేశపటములవలెను పువ్వులు కాయలు పండూ పంటకములు వానివలె తాజాగా ఉండవలెను. పంతులవారు విశ్వామిత్ర గోత్రులైనా సంకల్పమాత్రాన ముర్రేగారి యింగ్లీషు నిఘంటువువంటి ఆంధ్ర నిఘంటువు పుట్టించగలరా?"

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి: ఆధునిక కవులకు గురువులగు చెళ్లపిళ్ల వారు—'గిడుగా పిడుగా' అను వ్యాసముతో మొదలుపెట్టి, కీర్తిశేషులయ్యే గడియల పర్యంతము, వర్తమాన వ్యావహారిక భాషలో పరిశ్రమముగా వ్యాసములు వ్రాసియున్నారు. ఆ శైలి సజీవమైన వ్యవహార సరళిలో ఉదాత్తముగా నుండును. వేంకటశాస్త్రిగారి మూలముననే, వ్యావహారిక భాష వ్యాప్తి చెందినదనుట సత్యేతరము కాదు.9

కవి పరమేష్ఠియగు చెళ్లపిళ్ల వారి పద్యకవితాధార యెంత యఖండముగ నాంధ్రావనిని ప్రవహించినదో అదేరీతిని వారి గద్య

---

7. క్రీ. శ. 1929 న సంవత్సరమున, ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రికలను సమావేశము చేసిన సందర్భమున శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు, తమ సంపాదకీయమున సహాయధురీణులైన, శ్రీ అవటపల్లి నారాయణరావు గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, చల్లా శేషగిరిరావుగార్లను ప్రత్యేకముగా ప్రశంసించినారు.

8. గురజాడ వ్యాసరచనలను విశాలాంధ్ర వారు ప్రకటించిరి.

9. వేంకటశాస్త్రిగారు వ్రాసిన వ్యాసములు అమ్ములపొదిలో పదునైన వెలపులగునని మిత్రులవారి సన్నిహితు లొకరు చెప్పినారు. (మా. వారంగ - ఫిబ్రవరి సంచిక)

ఇక సాహిత్య వ్యాసము లీక్రింది విధరించిన సన్మాన సంపుటములలో చాల గలవు.

1. వ్యాస సంగ్రహము—శ్రీగిడుగు రామమూర్తి పంతులుంగారి షష్ఠిపూర్తి సమయమున సమర్పింపబడినది. ఇందొక భాగము తెలుగు.

2. మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారి సన్మాన సంపుటము.

3. అయ్యంకి వేంకటరమణయ్యగారి సన్మాన సంపుటము.

4. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారి సన్మాన సంపుటి.

5. తిలింగ రజతోత్సవ సంపుటము.

6. భారతి రజతోత్సవ సంపుటము.

7. శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సంచిక.

8. శ్రీ మాడపాటి హనుమంతరాయ సన్మానసంచిక.

9. శ్రీ కల్లూరి సుబ్బరాయ సన్మాన సంచిక.

వ్యాసరచన కల్పకమున కఖండముగా దోహదము గల్పించినది ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలు. 'భారతి' అనునది రెండును ననుః సత్యోక్తియే. వీనియందు ప్రకటితములైన వ్యాసములు కొన్ని గ్రంథరూపము ముద్రితమైన వాటివిలువ యింకను వినుమడించును. ఇట్టి వానిలో కొన్నికయైనవి:

శ్రీ పింగళి లక్ష్మణ బ్రహ్మణ్యశాస్త్రి గారి వ్యాసములు. సంవత్సరాది సంచికలలో – ఆస్తంబుడు – భారతిలో వేదకాలపు సూత్రకాలపు పురాణకాలపు వ్యవసాయచరిత్ర – మన ప్రాచీన వైదిక సంస్కృతిని వివరము చేయునవి.

శ్రీ ఒంగోలు వెంకట రంగయ్యగారి వ్యాసములు మన ప్రాచీన సంప్రదాయములు, సంస్కృతికి సంబంధించిన వివిధ వైజ్ఞానిక విషయము లెన్నియో యీ వ్యాసమున గాన నగును.

శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారి వ్యాసములు: నక్షత్రమండలము అనుపేర నేకొక హైందవశాస్త్ర గ్రంథములు మున్నగు వైజ్ఞానిక వ్యాసముల నెన్నియో, రాఘవరావుగారు భారతి నలంకరించిరి. వీరి వ్యాసముల యందలి విశేష మేమనగా ఖగోళ శాస్త్ర, జ్యోతిష సంప్రదాయములను, మన యాంధ్రసాహిత్యముతో సమన్వయించి చెప్పుట. సాధారణముగ మన ప్రబంధము నుండియే యుదాహరణ లీయబడుచుండును. భారతి రజతోత్సవ సంచికయందున, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రాఘవరావు గారినిగూర్చి ప్రశంసించుటయేపై వ్యాసవిశిష్టతకు తార్కాణము.

విశ్వనాథవారనగనే మనకు, 'నన్నయ ప్రసన్నకథాకలితార్థ యుక్తి' జ్ఞప్తికి రాకమానదు. మహోత్తమ సాహితీవిమర్శశైలిలో గణ్యతవహించిన యీ వ్యాసమాలిక, భారతిలోం దొలుత ప్రకటితమై యీ వెనుక గ్రంథరూపమున వెలువడినది.

పూర్వపు సంవత్సరాది సంచికలలో కొన్నికొన్ని వ్యాసములాయీ కవుల విశిష్టతను ప్రప్రథమున లోకమున కెఱుకపఱచుటకుం జాలాగాం దోహ్పడినవి. దుందుభి సంవత్సరాది సంచికయందు ప్రకటితమైన శ్రీ బండారు తమ్మయ్యగారి "పాల్కురికి సోమనాథ మహాకవి" యను వ్యాసము, ఆంధ్రగ్రంథమాల యందు బసవపురాణ పండితారాధ్య చరిత్ర ప్రకటనలకు హేతువై సోమనాథుని ప్రతిభా విశేషముల నాంధ్రదేశీయులకు వ్యక్తపఱచినది.

ఇంకను నా యీ సంవత్సరాదిసంచికలలో ప్రకటితములైన దువ్వూరి రామిరెడ్డి సాహిత్య వ్యాసములు కవికోకిల సారస్వత వ్యాససంపుటముగను, బసవరాజు అప్పారావు వ్యాసములు ఆంధ్రసాహిత్య సరిత్రముగను రూపొందినవి. ప్రసిద్ధ నాట్యము వ్యాసములు శ్రీమల్లి అప్పారావుగారి వ్యాసములు భారతిలో తొలుత ప్రకటితమై. ఆ వెనుక విజయనగరసామ్రాజ్యాంధ్రవాఙ్మయగ్రంథముగా రూపొందినవి.

చిరకాలము నిలువక, కొన్నిసంవత్సరములుమాత్రమే వెలసిన పత్రికలలోని కొన్ని వ్యాసములు నేడు విస్మృతప్రాయములైనవి.

సారస్వత సర్వస్వము: తెనుగు, ఎల్లూరుపాటి రామభద్రదయనులు గారు దీని సంపాదకులు. అమితవ్యయముతో నీపత్రిక రెండేండ్లు నడచినది. ఇందు శ్రీ ఆనంట సాంఖ్యాయనశర్మగారి ఆంధ్రసాహిత్యపరిషద్ద్వితీయోపన్యాసము (ఈ పరిషత్పత్రికలో ప్రకటితముకాలేదు. (పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి రాజశేఖర మహాకవి కావ్యమీమాంస, కాళిదాసుని నిరంకుశత్వము, జంధ్యాల శివన్నశాస్త్రి గారివి.) ఇట్టి యపూర్వవ్యాసములు గలవు. ఇంకియు భారతము లక్ష్మీపతిగారి సభాపర్వవ్యాఖ్యయు నిందు ప్రకటితము.

విభూతి: ఇదేశివశ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు ప్రకటించిన విభూతి పత్రికలో శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి రామాయణవ్యాసము మున్నగు నమూల్యవ్యాసరచనలు వెలువడినవి.

కీర్తిశేషులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి త్రిలిఙ్గ పత్రికలో (37 సంపుటములు) సాహిత్య వ్యాసములు చాల గలవు.

'ప్రతిభ' 'కిన్నెర' 'ప్రబోధిని' పత్రికలయందు ప్రాచీన, నవీన సాహితికి సంబంధించిన వ్యాసములు పెక్కు గలవు. ఇట్లు పత్రికలేగాక కట్టమంచి వారి వ్యాసమంజరి, విస్సావారి వ్యాసావళి, శ్రీ నండూరి బంగారయ్యగారి శాకుంతల విమర్శన వ్యాసావళి, బూదులవారి వ్యాసముక్తావళి మన కందుబాటులో నుండుట ముదావహము.

ఇట్లే మానవల్లి, పంచాగ్నుల, పింగళి మొదలగు మహనీయుల వ్యాసరచనలను నా వ్యాసములకు వారసులైన, ఆంధ్రపత్రిక సంపాదకులు త్వరలో నే ప్రకటింతురు గాత!

ఇంకను నా దృష్టిపథమున బడనివానిని దెలిపిన కృతజ్ఞతతో నిందు చేర్చెదను.

[10] ప్రధానముగా సాహిత్య వ్యాసముల గూర్చిన సరిత్రయే గలదు. కొలత్రకమమున స్థలాంతరమున. భాషా శాస్త్ర చిత్రలేఖన, శిల్ప సంప్రదాయములను గూర్చిన వ్యాసములను, ప్రాగ్య పాశ్చాత్య, వైజ్ఞానిక, వేదాంత, ధర్మాది విషయిక వ్యాసములను గూర్చి తెలిపెదను.

ఇట్లు వ్యాసములనుగూర్చి చెప్పబూనిన అది వ్యాస భారతమంత గ్రంథమగును. మొదట నేనాంధ్రపత్రిక భారతి మరికొన్ని యితర పత్రికలలోని వ్యాసములు వర్గీకరణముచేసి వ్రాయుటకు నుద్యమించితిని. కాని యిప్పటికి వ్యాసము పెద్దదియైనందున దానిని విరమించుకొనవలసిన యావశ్యకత యేర్పడినది. 'శతమానం భవతి' అనునట్లు నూరేండ్ల వయస్సుగల వ్యాసరచన సమగ్ర చరిత్రమును నాంధ్రలోకమున కందింపగలను.

ఇట్టి మహాకార్యమునకు బూనుకొనుటకు నాకీ వ్యాసరచన మూలమున నవకాశము గల్పించిన శ్రీ ఆంధ్రపత్రికా సంపాదకులకు నా మనఃపూర్వక కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాను.

---

10. పై కారణముచేత యీనాటి సుప్రసిద్ధ వ్యాసరచయితలను పేర్కొనలేకపోయితిని. విజ్ఞులు మన్నింతురు గాక.

డిగు > దిగ్గు, దిగు; దాగు > దాగు; డగలు > దగ్గర, మొ॥. ఇప్పటికీ కొండభాషలో డిగ్ (=దిగు), డెప్ (=దించు); డాక్ (=దాగు), డాప్ (=దాచు); డిగ్గు (=దగ్గర), అనే ఉచ్చారణలు వినిపిస్తాయి. పై నిరూపణనుబట్టి తేలిన సారాంశం: చారిత్రకంగా కొండభాషలోని వర్ణనిర్మాణం నేటి తెలుగుకన్నా ప్రాచీనమైన శాసన భాషకు చాలా సన్నిహితంగా కనిపిస్తుంది. దీన్నిబట్టి నేటి కూయి, కువి, కూవి భాషలు మాండలికాలుగా ఉన్న మూలభాషలో, కూవి మాండలికానికి ప్రాచీనాంధ్రానికి ఎక్కువ ప్రాంతీయ సన్నిహితత్వం ఉండి ఉండాలి.

## వ్యాకరణం :

### విశేష్యాలు :

ఈ భాషలోని నామపదాలను మహత్తులనీ, అమహత్తులనీ విభజించవచ్చు. పురుషవాచక శబ్దాలు మహత్తులు. తదితర శబ్దాలు అమహత్తులు. ఏకవచనంలోనూ, బహువచనంలోనూ, ఇదే పద్ధతి. తెలుగులోవలె గాక స్త్రీవాచక శబ్దాలు రెండు వచనాల్లోనూ అమహత్తుల్లాగానే ప్రవర్తిస్తాయి. ఉదా: వాన్రు వాతెన్ = వాడు వచ్చాడు; వార్ వాతెర్ = వారు వచ్చారు (పురుషులు మాత్రం); అది వాతెన్ = అది వచ్చింది (స్త్రీతిర్యగ్జడాలు); అవి వాతె = అవి వచ్చాయి (స్త్రీ తిర్యగ్జడాలు)

మహద్బహువచన ప్రత్యయాలు 'ర్, రు' వర్ణాలు. అమహద్బహువచన ప్రత్యయాలు 'క్/కు, జ్/జు' వర్ణాలు, ఉదా:

**మహత్తులు:**

| ఏక. | | బహు. |
|---|---|---|
| అనసి (= అన్న) | : | అనపిర్ (= అన్నలు) |
| కొడ్డో (=పిల్ల) | : | కొడ్డోర (= మొగపిల్లలు)<br>కొడ్డోక్ (= ఆడపిల్లలు) |
| అయెన్<br>ఎయెన్ (= ఎవడు) | : | అయొర్<br>ఎయొర్ (= ఎవరు) |

**అమహత్తులు :**

| | | |
|---|---|---|
| మరన్ (= చెట్టు) | : | మరక్ (= చెట్లు) |
| గుఅప్ (=గుర్రం) | : | గుఅప్కు (= గుర్రాలు) |
| పేని (= పేను) | : | పేన్కు (= పేలు) |
| డుకి (= గుప్పి) | : | డుకిజ్ (= గుప్పిలు) |
| ఖ్డేను (= ఎముక) | : | ఖ్డేకు (= ఎముకలు; చూ., ప్రా. తె. (పేకులు) |

ఈ భాషలో నామవిభక్తులు నాలుగు: షష్ఠి లేక ద్వితీయాది విభక్త్యంగం; ద్వితీయ-చతుర్థి; తృతీయ-పంచమి; సప్తమి. ద్వితీయాది విభక్త్యంగం ఏకవచనంలో '-తి/-ది', బహువచనంలో 'అ, ఇ' అనే ప్రత్యయాలు చేరటంవల్ల ఏర్పడుతుంది. ఈ రూపం సంబంధార్థబోధకం (షష్ఠి) కూడా అవుతుంది. ద్వితీయ-చతుర్థి ప్రత్యయం: -జ్; తృతీయ-పంచమి ప్రత్యయం: -అణ్డ్; సప్తమీ ప్రత్యయం: -ఉ. అమహత్తుల్లో ప్రథమావిభక్తి రూపాలే ద్వితీయా విభక్త్యర్థంలో కూడా వైకల్పికంగా రావచ్చు. ఉదా:

**అమహత్తు : మరన్ = చెట్టు**

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్రథమ | : మరన్ (=చెట్టు) | : మర-క్ (=చెట్లు) |
| షష్ఠి (ద్వితీయాద్యంగం) | : మర-తి (=చెట్టు యొక్క) | : మర-క్-అ (=చెట్ల యొక్క) |
| ద్వితీయ-చతుర్థి | మరన్ / మరన్-ది-జ్ (=చెట్టును, చెట్టుకు) | : మరక్-అ-జ్ (=చెట్లను, చెట్లకు) |
| తృతీయ-పంచమి | మర-త్-అణ్ (=చెట్టుచేత, చెట్టునుంచి) | : |
| సప్తమి | : మర-త్-ఉ (=చెట్టులో, చెట్టుపై) | : |

**మహత్తు :- కొడ్డో = పిల్లవాడు**

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్రథమ : | కొడ్డో | కొడ్డో-ర్ |
| షష్ఠి : | కొడ్డో-ది- | కొడ్డో-ర్-ఇ- |
| ద్వితీయ-చతుర్థి : | కొడ్డో-ది-జ్ | కొడ్డోర్-ఇ-జ్ |
| తృతీయ-పంచమి : | కొడ్డో-ది-అణ్డ్ | : |
| సప్తమి : | కొడ్డో-ద్-ఉ | : |

ప్రథమ పురుష సర్వనామాల్లో ద్వితీయాది విభక్త్యంగం '-ఇ' ప్రత్యయంవల్ల ఏర్పడుతుంది. ఉదా:- వాన్రు : వని-, వార్ : వరి- (తె. వాడు: వాని, వారు : వారి). ప్రశ్నసూచకాలున్న చోట వరియైన రూపాలు నా సేకరణలో ఎక్కడా తగల్లేదు.

ప్రత్యయాల్లో ఏకవచనంలోని -ఇ, -తి, -ది, వర్ణకాలను, బహువచనంలోని -అ, -ఇ, వర్ణకాలను, తెలుగులోని ఔపవిభక్తిక -తి, -టి; అ, -ఇ; ప్రత్యయాలతో పోల్చవచ్చు. (నాతి, ఇంటి, వారల, వారి). తమిళంలో ద్వితీయాద్యంగమైన మర-త్తు-, కన్నడంలోని మర-ద్ -రూపాలుకూడ వీటితో తుల్యాలు.

### సర్వనామాలు :

ప్రథమా విభక్తిలోను, ప్రథమేతర విభక్తుల్లోను వచ్చే సార్వనామిక ప్రాతిపదికలు:

| | ఏక. | బహు. |
|---|---|---|
| ఉత్తమ పురుష: | నాన్ : నా-(=నేను:నా-) | : మాప్ (=మేము)<br>మాట్ : మా- (=మనము : మన-) |
| మధ్యమపురుష: | నీన్: నీ-(=నీవు: నీ-) | : మీర్ : మీ-(=మీరు: మీ-) |
| ప్రథమపురుష: | వాన్రు:వని-(=వాడు:వాని) | వార్ :వరి-(=వారు:వారి) |
| | వేన్రు:వెని-(=వీడు:వీని) | : వేర్ వెరి-(=వీరు:వీరి-) |
| | అది దని-(=అది:దాని-) | అవి:దన్క-(=అవి:వాని-) |
| | ఇది:దెని-(=ఇది:దీని-) | :ఇవి:దెన్క-(=ఇవి:వీని-) |

తమిళ మలయాళ కన్నడాల్లో ద్వితీయాది విభక్త్యంగాలు ఉత్తమ పురుషలో ఎన్-/నన్-, ఎమ్-/నమ్-అనీ, మధ్యమపురుషలో నిన్-, నిమ్-అనీ ఉంటాయి. వీటితో పోలిస్తే కొండభాషలో

వర్తమానం: కూక్ సిన్-ఇ పిలుసున్న

వ్యతిరేకం: కూక్ -?-ఇ పిలవని

భూతార్థక 'త' ప్రత్యయం పరమైనప్పుడు కొన్ని ధాతువుల్లో సంధిగతంగా మార్పులు వస్తాయి. ఉదా: ఉణ్=తిను. తాగు; భూతం: ఉటన్ తిన్నాడు( <*ఉణ్-త-అన్), తద్ధర్మం: ఉణ్న్=తింటాడు (ఉణ్-న్-అన్); మన్=ఉండు; విధి: మన్?అ=ఉండు. మన్ను=ఉండండి. భూతం: మఱ్ఱన్=ఉండెను (మన్-త అన్; అలాగే, కొల్-=కొను; కొటన్=కొన్నాడు; క్గొల?అ=(తీసు)కొ ణు=కొనండి.

చారిత్రకంగా ఈ భూతార్థక -త-వర్ణం అన్ని భాషల్లోనూ కనిపిస్తుంది. ఉదా: తమిళం. శెయ్-, శెయ్-త్-అన్ (ఉచ్చారణలో శెయ్‌దన్); కన్నడం. గెయ్-ద-ను = చేశాడు; తెలుగులో చేసితిని; అంటిని, మొదలయిన చోట్ల భూతార్థక 'తి, టి', వర్ణాలలో ఉన్నది యీ ప్రత్యయమే. క్రియా జన్యవిశేషణ ప్రత్యయమైన '-ఇ' వర్ణం తెలుగు వ్యతిరేకక్రియా విశేషణరూపాల్లో, చేయని, కొట్టని, మొ. చోట్ల కనిపిస్తుంది. కొండ. గోండీ భాషల్లో క్త్వార్థక ప్రత్యయం సి జి ఉదా: గో డి. కి- = చేయు; కి-సి- = చేసి; కొండ. కి- = చేయు; కి-జి = చేసి; వెన్- = విను; వన్-జి- = విని. చారిత్రకదృష్టితో చూస్తే తెలుగులో ర, ల, న-లు చివరగల చాలా ధాతువులపై చేరిన క్త్వార్థక ప్రత్యయం 'చి' గాని, 'ఇ' కాదు. ఉదా: ప్రా. తె. ఆర-చి-, వెడ-చి-, ఒర-చి-, పిలి-చి-, నడ-చి-, తున-చి-. ఈ 'చ' వర్ణం ధాతుగతం కాక, భూతార్థక ప్రత్యయం కావటంవల్ల నే, 'ముజ్జీతులు' పరమైనప్పుడు ఇది లోపించి దీని స్థానంలో సంధిగతంగా 'వ' వస్తున్నది. ఉదా: ఆర్వన్. ఆర్వక; ఎడ్వక; ఒర్వక; పిలువన్, పిలువక, పిలు. పిలుము, పిలువుము, పిలుడు, పిలువుడు; నడవన్, తునవన్. అదీగాక సోదరభాషల్లో ఈ 'చ' వర్ణం ధాతుగతంగా ఎక్కడా లేదు. ఉదా: తమిళంలో అర్-, అఴు-, ఒర్-, విళి-, నట-, తున్ని-, అనేవే సోదర రూపాలు. తెలుగులో కట్టి, విని-, మొ.-చోట్ల క్త్వార్థక ప్రత్యయమైన '-ఇ' వర్ణ సామ్యంవల్ల, 'చి' లోని 'ఇ' క్త్వార్థంగాను, 'చ' ధాతుగతంగాను భ్రమించటంవల్లా, ప్రక్రియా సౌలభ్యం కోసమూ - తెలుగు వ్యాకరణాల్లో '-ఇ' ఒక్కటే క్త్వార్థక ప్రత్యయమన్నారు.

## పదజాలం

ఒకవైపు తెలుగుతోను, రెండోవైపు ఒఢ్రంతోను సన్నిహిత సంబంధం ఉండటంవల్ల ఈ భాషలో రెండువైపులనుంచి చేరిన ఎరవుమాటలు ఎన్నో ఉన్నాయి ఉదా:- ఒఢ్రంనుంచివచ్చిన కొన్ని:- ఉసుమ్ = వేడి, ఎక్ = ఒక, ఒని = నదిసె. కరియ = ఉప్పుని, కుమ్పిడ్ = తాబేలు, కోమ = కమలాపండు, కొజ్జేగ = ఖర్జూరం. గతిమ్ = ఎగావు. పెంపొలు, గర్ జై = ఇల్లరికం, గాట = కొండమీదిదారి, గుణో = చీర. గొజ్జయ (గుసు) = ముల్లు (గ్రి), గాయరే = తెగాగా మొ. తెలుగునుంచివచ్చిన కొన్ని మాత్రం:-అన్ దికె = అందుకే, అన = అన్న, అన్సు = అంచు, అయ్యు, ఆలు ఏడు; ఇప = ఇప్పచెట్టు. ఉసుర్, ఊపిరి = ఉసురు, ఊపిరి ఎర్క = ఎలుక, ఎణ్డాద్ = ఏండాది, ఒకో = ఒక, కోన = కోన. కొము = కొమ్ము మొ. ఒఢ్రంనుంచివచ్చింది. తెలుగునుంచి వచ్చింది తెలుసుకోటానికి వీలుకాని పదాలు మూడోరకం. అవి ముఖ్యంగా సంస్కృతసమాలు, అన్యదేశ్యాలు; ఉదా:- అనమ్ = అన్నం. అదమ్ = అర్ధం, అకగు = అఖరు, అగస్ = ఆకాశం ఆసడ్ = ఆషాఢమాసం, ఉపకరమ్ = ఉపకారం, ఉపయ్ = ఉపాయం, కోపమ్ = కోపం మొదలవి.

ఈ మూడు రకాల శబ్దాలుపోగా మిగిలిన దేశ్యశబ్దాలు. మూల ద్రావిడభాషా జన్యాలయి పరంపరగా వస్తున్నవి ఎన్నో ఉన్నాయి. మచ్చుకుకొన్ని కొండభాషలోని దేశ్యపదాలను వాటికి సరియైన తెలుగులోని సోదర శబ్దాలను. ఈ కింది 'జాబితా'లో ఇస్తాను. తమిళాది సోదర భాషల్లోను వీటికి సరూప శబ్దాలు దొరుకుతాయి గాని వ్యాపవిస్తరభీతిచేత అవన్నీ ఇక్కడ ఇవ్వటం లేదు. ఇంత వరకు వ్యాసంలోవచ్చిన కొండభాషాపదాలుగూడా మిగపోయినవి బడాయి. తెలుగుపదంతో పోలిక దూరంగా ఉన్నచోట, తెలుగు మాటకుముందు 'మా.' (=మాండు) అనే సంకేతం ఉంటుంది. ప్రాచీనాంధ్రపదరూపాలే చాలావరకు సామ్యనిరూపణకు ప్రయోగించేవి కాబట్టి అవే ఇచ్చాను. కొండభాషాపదానికి అర్థం తెలుగుపదంవల్లనే చాలావరకు తెలుస్తుంది. సంగ్దిగ్ధత ఉన్నచోట్లనే అర్థాలు ఇవ్వబడాయి:-

### నామపదాలు

| కొండ | తెలుగు |
|---|---|
| అపాస తండ్రి | అప్ప |
| అమ్మ (బహు. అపుర్క) | అంబు అమ్మి |
| అణ్డు వీణ (స్త్రీ) | అండు - |
| ఆట్వా | అటు (అట్టులు) |
| ఆలే (శక్తి) | అలవి |
| ఇని | ఏమి |
| ఇఱుక్కు | ఇఱుకు |
| ఈట్వా | ఇట్టు (ఇట్టులు) |
| ఉగ్బ | ఉడుము |
| ఎయో (ప్రశ్నార్థకం) | ఏ |
| ఒల్ జా | ఎలుగు (బంటి) |
| ఒడ్డోల్ | ఓడలు |
| కపు | కంపు |
| కటి (నల్లని) | కట్టి |
| కలమ్ కద్దమ్ | కళ్ళం |
| కాకటి | కాగ (కాయ) |
| కయు (బహు కిను) | చెయ్యి |
| కిలెడ్ | చిలుము |
| కుటు (తొడ) | కుఱువు |
| కుప (ఆకుకూర) | కూర ( <*కుసిర ) |
| కూరు | కురుపు |

| | |
|---|---|
| ఒత్తి – | ఒఱలు (విలపించు) |
| కామ్బ్ కాఫ్ – | కొఁగు, కొఁచు |
| కిన్జ్ – కిన్ – | చినుఁగు, చించు |
| కిన్ – | గిచ్చు |
| కెప్స్ – (మూయడం. కలుపు కోయు) | చూ. చెఱ |
| కోయ్ – | కోయు |
| కోల్ – / కోల్ – | కొను (చే. – కొలుపు) |
| జాతి – | జాఱు |
| డాట్ – | దాటు |
| దూన్ – | దువ్వు, దూయు, దూయు |
| డ్రెగ్ – | మ్రింగు |
| ద్రూ – | గుమ్ము |
| తి – / తే – | తెమ్ము –, తే – |
| తిగి – (అగును) | తగియు |
| తీజ్ – (మూగియు) | తీఱు |
| తుత్పు – | తుఱుకు |
| తోడ్జ్ – | తొలఁగు (నీగా, మొ.), చూ. తె. తుళిక్కు. |
| తేల్ – | తేలు |
| దూగ్ – | దూఁగు |
| నద్ది – | నఱచు |
| నిగ్డి – (పొగ) | నిగుడు |
| నూజ్ – | నూఱు |
| నో – | నొమ్ము, నోయు |
| పజ్జి – | పఱచు |
| పాజ్ – | పాఱు |
| పూ – | పూయు |
| పిజ్ – (బా పులెక్కు) | చూ. పిఱిక (=పగ్గు) |
| పిడ్లి – / ప్డేల్ – | ప్రేలు (చిల్లు) |
| ముక్ – (తిరగదిప్పు) | ముగుచు, ముగుచు |
| మడ్ – (తిరిగిచ్చు) | మఱలు |
| మర్జి – (నేర్చు) | మఱుగు |
| మడ్గ్ – (మునుగు) | మునుఁగు, ముంగు |
| మెజ్జ్ – | మెఱయు, మెఱచు |
| రాల్ – | రాలు |
| వణ్గ్ – | వణఁకు |
| వడ్ – | వడియు (నీళ్ళు, మొ.) |
| వజ్ – | ఎండు |
| వేయ్ / వె – (వేడెక్కు, కాలు) | వేఁగు (– కాగు) |
| విల్ – (వ్యతిరేకక్రియ) | లే – లే(దు). |
| సుడ్ | చూడు, చూచు |

ఈ వ్యాసాన్ని బట్టి సమగ్రమూ, నిర్దుష్టమూ అయిన ద్రావిడ భాషాచరిత్ర వ్రాయడానికి అనాగరక భాషాసామగ్రి ఎంత అవసరమో పాఠకులకు విదితమౌతుంది. ఈనాటికీ చాలామంది విజ్ఞులని చెప్పదగినవారు కూడా ద్రావిడ భాషలంటే గణింపదగినవి నాలుగేననీ (మిగిలినవన్నీ [illegible]), మిగిలిన అనాగరక భాషలు తులనాత్మక పరిశోధనలో కూడా అప్రధానమైనవనీ వాదిస్తుంటారు. అటువంటివారికి ఈ వ్యాసం కనువిప్పుగా ఉండగలదని ఈ రచయిత ఆశిస్తాం. సాహిత్య విషయంలో ఈ భాషలకు ప్రాధాన్యం లేకపోయినా, భాషాచరిత్ర పరిశోధనకు వీటిలోగల శబ్దసామగ్రి అమూల్యమైనది. భాష పారిశ్రామిక సమాజాల్లో మారినంత వేగంగా ఆదిమ (గిరిజన) సమాజాల్లో మారదు. అన్ని దక్షిణ ద్రావిడ భాషల్లోను జారిపోయిన 'ర-ఱ' ల ఉచ్చారణ భేదం కొండ భాషలో నిల్చి ఉండడం దీని కొక తార్కాణం.*

---

*ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి కోరికపై ఇటీవల ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో స్థాపించిన 'ఆదిమజాతి సంస్కృతి పరిశోధనశాఖ' కార్యక్రమం భాగంగా 1958 డిసెంబరు–1959 మార్చి నెలల మధ్య అరకులోయ ప్రాంతంలో పర్యటించి సేకరించిన 'కొండదొర' భాషాసామగ్రిలో స్వల్పభాగం మాత్రమే ఈ వ్యాసానికి విషయం. అచిరకాలంలో ఈ పరిశోధన ఫలితాలు గ్రంథరూపంలో వెలువడవచ్చు. శ్రీకాకుళం, విశాఖపట్టం ఏజన్సీ ప్రాంతాల్లో గిరిజన భాషలు పరిశోధించటానికి అవకాశాలు కల్పించిన మా విశ్వకళాపరిషత్తు అధికారులకు నా కృతజ్ఞత. కొండభాషా పరిశోధనలో కొంతకాలం నాకు సహాయకులుగా పనిచేసిన శ్రీ తూమాటి దోణప్పగారికి నా వినతి. కాని ఈ వ్యాససామగ్రిలోను రచనలోను ఉన్న తప్పులకూ ఒప్పులకూ బాధ్యత ఈ వ్యాసకర్తదే.

1959 అక్టోబరు 'భారతి'లో ప్రచురించిన 'ధ్వనిః వర్ణం' అన్న వ్యాసంలో నిరూపించిన అర్థంలోనే ఈ వ్యాసంలో 'వర్ణం' అన్న పదం ప్రయోగింపబడ్డది.

# చిన్నయసూరి

శ్రీ అద్దేపల్లి నాగగోపాల రావు

శ్రీనాకేశ కరుణా శ్రీవిలసిత ధీవిలాస! చిన్నయ సూరీ!
భావించి నిన్ను నా యెద గావించెద వందనంబు గద్యవిహారీ!

నన్నయ భారతంబున గనంబడు మేలి పసిండిపల్కులన్
వన్నెతి కొక్కమార్గమున సత్కృతులన్ ఘనకూర్చి యొజ్జవై
మన్నన లందికొన్న యనమానవిఖ్యాతన శబ్దశాసనా!
చిన్నయసూరి! సూరికులశేఖర! వ్యాకరణ ప్రభాకరా!

నేటికి నూరువర్షములు నీవు గతించి మహానుభావ! నీ
మేటి తెనుంగు కబ్బముల మేలున్నిజాడం బట్టి పాత్రముల్
కోట తెలుంగుమాటలను తీరిచిదిద్దిన వార లేరి? నీ
పాటవ మింత రాదు, సులభం బది కాదు పఠింపవాదకిన్.

తప్పులు పట్టవచ్చు, నొకతాళి యొనర్పగవచ్చుగాని నీ,
చెప్పినచొప్పునన్ రసము చిందును విందొనరించు కబ్బముల్
చెప్పగలారె వారు? నతిశేముషి ధీవరు లట్టివారి, నీ
గొప్పతనం బసూయమెయి గొందఱు చూడరు సూరిశేఖరా!

వ్యాకరణంబు పాఠకులపాలిటి భాగ్యము, నీతిచంద్రికా
లోకము సాహితీజగతిలో విరజిమ్మెడు కౌముదీప్రభల్
ప్రాకటపాండితీవిభవవర్ధకమై భవదీయ శబ్దర
త్నాకర మాంధ్రవాణికి నవాభరణం బగు జూవె చిన్నయా!

నీవు కళాతపస్వివయి నెమ్మినొనర్చితి వాక్కుచేతిపై
వేవురు సేయుకేరని పవిత్రతరంబగు సేవ సాహితీ
శ్రీవరణీయమూర్తి! రససేవధి! ధీనిధి! నీ ఋణంబు దా
కేవిధి దీర్చనేర్చెద రహీనసుధీనుత పండితాగ్రణీ!

ప్రాకృత సంస్కృతాంధ్రముల పండితుడై, ద్రవిడాంగ్లభాషలన్
జేకొని కావ్యలక్షణవిశేషము లారసి తర్కశాస్త్రవి
ద్యాకృషి జేసి భూరిమహిమాశ్రయుడై విమలార్థవేదివై
వ్యాకృతి కల్పనంబున శుభం బొనగూర్చితి తెల్గుబాసకున్.

ఈతడు వ్రాసినట్టి కృతు లిప్పటికిన్ బడి ముద్రితంబులై
చేతములన్ గరంచినవి, శిష్టమయైన యముద్రితాంధ్ర వి

ఖ్యాతిఁ గృతి ప్రయోగదశను గైకొని శిక్షకశాలయంబు వి
ద్యోతము సేయఁగా వెలయు నుత్తమరీతి మనోహరాకృతిన్.

కష్టము క్లిష్టమైన యది కావ్యకలానిధి! సంస్కృతాది భా
షాష్టక లక్ష్యలక్షణసమగ్రవిమర్శకచక్రవర్తి! నీ
వృష్టి యనన్యసాధ్యము విశిష్ట సుదుష్టము స్పష్టమింగ సం
తుష్టులపై ఘటింతుము నతుల్ నుతులున్ గయికొమ్ము నెమ్మమై.

పద్యము వ్రాయవచ్చు సరిపాటి మెయిన్ ఒకపాటివారలున్
హృద్యము నైన గద్య మది యొంటిటివారికి దుష్కరంబగున్
చోద్యము నేమియున్న గడుసొంపులు సంపెడు గద్యరీతికిన్
ఆద్యుఁడ వీవు వచస్యుతివి యన్నిట మిన్నవు నన్నతాతయా!

సెలసేటి సీటి జలజల కలకంఠకంఠస్వనంబు కలికి గీతంబుల్
పలికిల్లు వచనరచనం బలరారు నె లాతివారి కాంధ్రమునందున్.

అక్షరమాలినట్టి కృతు లందరు కూర్తురు, దాని కేమిలే
యక్షర మక్షరంబు పియమావలి కాంచలి ప్రోవఁబోక, నీ
వక్షరసంపజాలు ప్రతిభాగరిమం బది యెట్టివారికిన్
జిక్కదు కీర్తి దక్కదని చిత్తము కక్కదు పెక్కు లేటికిన్.

తెలుఁగు పసందు పిందియలును, తేనియ తేటలు, పాలమీఁగడల్
కులుకుమిటారి వేల్పులు, కోకిలపాటలు, చిల్కపల్కులున్
జిలుగు హారంగు క్రొమ్మెఱుఁగు చిన్నెలు, వన్నెలు, నిండు వెన్నెలల్
మలయు జవాజి తావియలు మల్లెలు కొల్లలు సూరి కైతలన్.

ఏమని తెల్గులోకము నుతింతు కృతజ్ఞతఁ బొంది తెల్గు గొల్వఁడన్
ఏ మెయి గౌరవింప దిటు లింతకు నీదగు సూత్రపాళియే
నీ నమ్ముతోడ బాలురకు నేర్పెడు పెద్దలు సూడ కిద్దియున్
'స్వామి! భవత్ప్రసాద' మని బాలురు గొల్తురు గాక నిన్నికన్.

నిను వంటివాఁడు భాషా జనయిత్రికి ప్రీతి సేయ జాలినవాఁడున్
గనుపింప డొండు జూచిన తెనుగుంభువి సంస్కృతాంధ్ర ధీవరులందున్.

జలనశ్యామ మనోజ్ఞగాత్రరమ భాస్వన్నేత్రయుగ్మంబు, మం
జులగంభీరగళస్వనామృతము, నాజూకైన నీ రూపు రే

కల దర్శింపని భాగ్యహీనులకు ముక్తాశ్రీఫలశ్రేణియై
తెలువారెను నీదు వ్రాలనెడు సుశ్రీగల్గె సూర్యాగ్రణీ!

ప్రతిభావంతులు నిన్నువంటి సుకృతుల్ భాషావికాసార్థమై
శతవర్షంబుల నొక్కరుం డెచటనో జన్మించి సారస్వత
స్థితిసంపన్నత మాతృదేశమునకుం జేకూర్చి, భూరిప్రభా
న్వితుడై సంస్తుతిపాత్రుడై చనెడు సందేహంబు లే దిందునన్.

తెలుగుం బాస మొసంగునంతదనుకన్ దీపించి వ్యాపించి
దిక్కులనెల్లం జరియించి వ్యాకృతియు నీకుం బేరు పేరోలగం
బుల విద్వజ్జనసత్కవిప్రతతిలో, భూపాలలోకంబులో
గలిగించుం జుమి నిక్కువం బిది మహాగంభీర వాక్సేవధీ!

శతవర్షీయ మహోత్సవంబు జరుపన్ సాహిత్యసమ్రాట్టులున్
మతిమంతుల్ గుణవంతు లాం ధవిమయామాత్యాళి, యొక్కుమ్మడిన్
జతనంబుం బొనరించి, చిన్నయకృతుల్ సద్రీతి ముద్రించి, వా
క్సతి సంప్రీతి భజింత్రుగాత కవితాకల్యాణి దీపింపగన్.

శతవర్షీయ మహోత్సవ కుతూహల తరంగ మధుర కోలాహల సం
తత సంగతి సంభృతమతి నతులిత సంప్రీతి సూరి నభినుతియింతున్.

జననము: ప్రభవ—1806. నిర్యాణము: దుందుభి—1862

కృతులు ముద్రితములు: 1. చింతామణి వృత్తి 1840. 2. పద్యాంధ్రవ్యాకరణము 1840. 3. సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణము 1844. 4. [illegible] మండనము 1845. 5. ఆదిపర్వ వచనము 1847. 6. శబ్దలక్షణ సంగ్రహము 1858. 7. [illegible] 1853. 8. నీతి సంగ్రహము 1855. 9. బాలవ్యాకరణము 1855. 10. విభక్తి బోధిని 1859.

అముద్రితములు: 1. [illegible] లా చట్టముల భాషాంతరీకరణము. 2. చాటు పద్యములు. 3. రాణిగారి మకుటాభిషేకమునకు రచించిన పద్యములు. 4. సంస్కృత బాలబోధ. 5. అక్షర [illegible]. 6. అకారాది నిఘంటువు. 7. [illegible] నిఘంటువు. 8. ఆంధ్ర [illegible] 9. [illegible] శబ్దశాసనము. 10. బాలవ్యాకరణశేషము. 11. ఆంధ్ర కౌముది. (వచనము) 12. ఆంధ్ర కాదంబరి. (వచనము) 13. [illegible]భ్యుదయము.

# ప్రాచీ ప్రతీచీ కవుల ఆదర్శంలో భేదం

శ్రీ వంగల సుబ్రహ్మణ్యశర్మ

జీవితసముద్రం అనేకరకాల అనుభూతి ప్రవంతుల సమయం. దాని లోని నీళ్ళు తియ్యగానూ ఉంటుంది, చేదుగానూ ఉంటుంది. అందులో యేభాగం తియ్యనిది, యేభాగం చేదునిది అంటే—దాని కొక ప్రత్యేకత లేదు. ఒకచోటనుండే ఒక్కొక్కప్పుడు మధుర వీచికలు వస్తయి. మరి ఒక్కొక్కప్పుడు అక్కడనుండే తిక్తతావనూ ఉంటుంది. మరొక్కొక్కప్పుడు ఒక్కొక్క అల యీ రెంటితోనూ ఉండి, స్పృశిస్తే తియ్యగానూ. ప్రక్కనే చేదుగానూ ఉంటూ ఉండటమూ కద్దు. ఇట్లా జీవితసముద్రం యిది ఫలానా అని నిర్దేశించటానికి వీలులేకుండా మధుతిక్తతల సమ్మిశ్రితమై సర్వదా ఉప్పొంగుతూ ఉంటుంది.

ఈ సముద్రం అనుక్షణమూ మనుష్యహృదయంలో ప్రతిబింబిస్తూంది. దాన్నిబట్టి మన మనస్సు వర్తిస్తూంది. తియ్యని అల మనుష్యహృదయంమీద ప్రతిబింబించినప్పుడు, సముద్రమంతా అటువంటిదే ననుకుంటాడు మనుష్యుడు. కాని మరొక్కప్పుడు ఆ హృదయానికి చేదునీటిఅల తగిలిందా వాడు నివ్వెరపోతాడు. తన పూర్వానుభూతిని గూర్చి పదేపదే స్మరిస్తూ, మళ్ళా దాని కోసమే నిరీక్షిస్తూ ఉంటాడు. ఎందుకీ నిరీక్షణం? అంటే—సముద్రం అనంతం. తియ్యనిఅల యెప్పుడు యేమూలనుండి వస్తుందో తెలియదు. అసలు వస్తుందో రాదో కూడా తెలియదు. పోనీ పోయి వెతుకుదామా అంటే యెక్కడని? యెంతని? అయినా ఒక్కొక్కడు దీని అనంతత్వాన్ని తెలియక వెతుకుదామని బయలుదేరుతాడు. కాని యెంతకూ యీ మధువు తగలకపోయిందా, వెనుక కలిగిన నివ్వెరపాటుతో పాటు నిర్వేదం కూడా కలిగి కూలబడి కుప్పబడిపోతాడు. అంతేకాని యీ రుచిభేదం యెందువల్లనో విచారించడు. విచారించలేడు. ఎందుకని? ఇతడు సాధారణుడు. సామాన్యుడు. కాని, సమన్వయనిపుణుడు యీ రెంటినీ పోల్చి చూచుకొని యేదో ఒకకొత్తను ఒకమహిమను ఒకదివ్యత్వమును తెలిసికొని, మనస్సులో నిర్ధారించుకుని, జీవితసముద్రాన్ని సుకరంగా తరిస్తాడు. అతడికీ మధుతిక్తతలలో భేదం భేదంగా తెలిసినా, తన గ్రహణతో విచారణతో నిశ్చయంతో ఆచరణతో ఉభయంలోనూ ఏకత్వాన్ని చూస్తాడు. అప్పుడతనికి యీ సాగరం ఒక సరస్సు. అనంతం, శాంతం. ఇట్లా చూచే నిపుణత ఒక ఉపకరణం. కాగా అతడు ఉభయాతీత దృష్టితో తరించి ఆనందిస్తాడు. ఈ నిపుణత లేనివాడు తివగిగ్గోలుచే కలిగిన భావపరంపరనే చూస్తూ ఉంటాడు. అతనికి సముద్రం అంటే భయం. ఆ భయం తీరేదాకా అతడికి ఆవలిఒడ్డు లేదు. మధ్యసముద్రంలోనే మునగావాం తేలావాం.

భిన్నభిన్నములైన అనుభూతులను సమన్వయించి తనొకదోవ చూచి, యితరుల కొక త్రోవ చూపిన నిపుణగలవాడే సుకవి. మన ప్రాచ్యకవులు అట్టివారే. రామాయణము రచించిన వాల్మీకి రాముడి జీవితంద్వారా లోకానికి యిట్టిదోవనే చూపాడు. రాముని జీవితంలో అనేక చేదునీటి అలలు యెగిరి అతణ్ణి నిలువునిస్తారం ముంచి వేసినట్లి వయి. అనేక విపత్పరిస్థితు లెదురొక్కన్నయి. అయినప్పటికీ రాముడు ధర్మపరుడే. సత్యవ్రతుడే. ఏకపత్నీవ్రతుడే. అతని నిశ్చయం నిశ్చలమే. దానికి తిరుగులేదు. అయితే యిట్టి రామునికి ప్రతికక్షిగా నిలిచిన రాక్షసకులమూ ప్రబలమైనది. మొక్కవోని శౌర్యంతో, కించిత్తు కూడా తక్కువకాని రాజభక్తితో ప్రజ్వరిల్లిపోయింది. రావణుడు తన సర్వవిధ బలంతోనూ రాముణ్ణి లెక్క చేయలేదు. సోదరుడు చెప్పినా వినలేదు. కేవలం తన భుజబలం చూచుకుని సీతా సౌందర్యపిపాసువై అధర్మపరాకాష్ఠను అధిగమించాడు. పరదారాపహరణం పాపహేతువనే జ్ఞానం నశించిపోయింది. ఇట్లా వాల్మీకి ధర్మ—అధర్మాలకు పోటీ కల్పించాడు. రెండూ ఉన్నత స్థానాలలోనే ఉండిపోయినవి. ఇప్పుడు ధర్మానికి జయమా? అధర్మానికి జయమా? యేది అనే వేగభావంతో పాఠకుడి హృదయం నిలుకడలేని త్రాసువలె అటూయిటూ ఊగిసలాడుతూనే వుంటుంది. కాని చివరకు ధర్మానికే జయం. భగవచ్ఛక్తి ప్రవంతిలోని తరళతరంగాలలో లీనమై శ్రీరాముని పక్షమందలి పుణ్యమయమైన రాజ్యము, అయోధ్యనుండి లంకాపురము వఱకు సుప్రతిష్ఠితమైనది. దండకారణ్యమున రాక్షసభయం నశించింది.

భారతంలో కూడా "యతో ధర్మస్తతో జయః" అని ముక్తకంఠంతో చెప్పి, అట్లే భగవదాశ్రితపక్షమైన పాండవపక్షానికే జయం కల్పించి వేదవ్యాసుడున్నూ ధర్మధ్వజాన్నే ప్రతిష్ఠించాడు. భారతంలో ధర్మపక్షమే, శ్రీకృష్ణుణ్ణి ఆశ్రయించినవారి పక్షమే ప్రబలెను. కౌరవపక్షరూపమైన మానవుల పాపచిత్రం సువిశదంగా విశదీకరింపబడింది. భగవదాశ్రితపక్షం అంతకన్న యెక్కువగా చిత్రించబడ్డది. ఈ పక్షంయొక్క ఉజ్జ్వల ప్రభముందు కౌరవపక్షమందలి పాపధ్వాంతం పటాపంచలైంది. "వెలుగుముందర చీకటి నిలవగలదా?" కనుకనే ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో పాపం భస్మమైంది.

కాగా—రామాయణం మహాభారతం వంటి పౌరాణిక గ్రంథాలు కేవలం ధర్మోపదేశంకొఱకే ఉద్దేశింపబడినవైనప్పటికీ, వాటియందు రాజనీతి సాంఘికనీతి ధర్మనీతి లోకనీతి కనబడుతాయి. ఇవి కేవలం మహాకావ్యాలే కాదు. యుగయుగములవాటి సమాదరవ్యమైన సామగ్రి వాటిలో ఉన్నది. కనుక వాటిని 'భారతవర్షేతిహాసములు' అనటం మంచిది. మాతాపితలయెడల సంతానమున కుండవలసిన భక్తి, అణకువ—. సోదరుల యెడల చూప తగిన ఆత్మత్యాగము—, ప్రజలపట్ల రాజుకు గల కర్తవ్యము, విధి—, సోదరుల విరోధం వల్ల సంభవించే దుష్పరిణా

మము—, రాజ్యేషణ—, పరదారేషణ—, అసాధారణార్థగసాయము—, ఉచిత మార్గానుసరణము మొదలైనవి యెన్నో సన్నిష్టాంతంగా వాటిలో చూపింపబడినయి. ఇట్టి యీ మహత్తర గ్రంథరాజాల ప్రభావంవల్లనే యుగయుగాలనాటి భారతవర్షపు తపస్య శాంతి ధర్మం మొదలైనవి యిప్పటికీ మనదేశంలో నిలిచివున్నాయి. కవి మార్గదర్శి కనుక గ్రంథంలో అక్కడక్కడ ధర్మోపదేశాలు కనబడుతున్నా, అంతమాత్రంతో యీ పౌరాణికక్షేత్రాన్ని యావత్తూ ధర్మోపదేశపరంగా మాత్రమే ఊహించరాదు. మానవజీవితంలోని మిట్టపల్లాలలో సుఖదుఃఖాలలో మధురిక్తతల్లో వ్యక్తికి కర్తవ్యతామూఢత్వం కలిగితే, కవి జ్ఞాని కనుక ధర్మోపదేశం చేస్తాడు. అంతమాత్రంచేత వీటిని కేవలం ధర్మోపదేశానికిమాత్రమే యేర్పడ్డ పుస్తకాలుగా పుట్టిన పురాణాలుగా ఊహించరాదు.

ఇక సాహిత్యక్షేత్రం చూతాం. కాళిదాసు భవభూతి శ్రీహర్షుడు మొదలైనవారు దానికి అధిపతులు. వారున్నూ తమ తమ గ్రంథాలలో ధర్మసూక్ష్మాలనే బోధించారు. కాళిదాసు తన నిరుపమ రచనాపాటవంతో కుమారసంభవంలో ధర్మమయమైన చిత్రాన్ని చిత్రించాడు. పార్వతి తపస్సూ హిమవంతుని శివానురాగమూ ఆరాధ్య సాధనలే. ఇట్టి మహోత్కృష్టములను అలౌకికములను సృష్టించి, కాళిదాసు అలౌకిక సృష్టికర్త అయినాడు. శాకుంతలమున ఋష్యాశ్రమంలోని పశుపక్ష్యాదులు సయితము శకుంతల యెడల మహానురాగం చూపించినయి. ఆమెను దుష్యంతునిదగ్గరకు కణ్వుడు పంపునప్పుడు శకుంతల పెంచిన లేడికూడా వెంటపడ్డది. చెట్లుచేమలు తమ తమ వర్ణాలతో దుఃఖభావాన్ని వెల్లడించినయి. మానవుడిలో వుండే త్రిగుణప్రవృత్తికి కాళిదాసు విసుగుచెంది, అథవా రజస్తమోగుణవృత్తిని సహించలేక, భగవంతుడి సృష్టికి ప్రతిసృష్టిగా కేవలం సత్వమయమైన ఒకానొక పుణ్యాశ్రమాన్ని సృష్టించుకుని, తానందులో ప్రతిపాత్రఅయి, యథేష్టంగా విహరిస్తూ యీ లౌకిక ప్రపంచాన్నే విస్మరించాడు. ఇటువంటి సత్వమయ సృష్టులను యే ఒక్క సందర్భంలో అకో కాక, రఘువంశంలో కుమారసంభవంలో శాకుంతలంలో తనివితీరా సృష్టించుకుని తన వాంఛ యిదని తెలియచేస్తూ—, యీశ్వరుడు సృష్టించిన త్రిగుణమయ సృష్టిలోని లోపం తెలియజేస్తూ, ఉండవలసిన సత్వమయ జగత్తును నిర్మించి, 'ఆదర్శవాది' అయినాడు. ఇల్లా ఇత డేవొక్కడో కాడు. అందరూ అంతే. అతడు ఆదర్శవాది. వాస్తవవాది. రసవాది. మార్గదర్శి. ఇంకా యేమన్నా ఉంటే అన్నీ. ఇక — భవభూతి తన ఉత్తరరామ చరితంలో సర్వానుతాపం చిత్రించిన విధం అద్వితీయం. దానిలో ముఖ్యంగా మూడవ అంకంలో శ్రీరాముని భగ్నహృదయం ప్రతిబింబిస్తుంది. ఆ చిత్రమవలోకించేవారికి ప్రాచ్య సాహిత్య పఠనంవల్ల కలిగే ధర్మానురాగం యింతింత కాదు. ఇట్లా మానవహృదయం కళంకదూషితమైనప్పటికీ ప్రాచ్య సాహిత్య పఠనంవల్ల యెంతటి ధర్మానురాగం కలుగుతుందో అది విడిగా వ్రాయాలంటే మామూలు కలాలకు సాధ్యం కాదు.

పాశ్చాత్యసాహిత్యం పఠించినందువల్ల వచ్చే ఫలం మాత్రం మన సాహిత్యఫలం కంటె కేవలం విజాతీయం. విభిన్నం. సాహిత్య భూషణాలు, సర్వాంగసౌందర్యజనకాలు, గౌరవదాయకాలు, ధర్మనైతిక కుంజరాలు అయిన మహాపర్వాలు ప్రాచ్యసాహిత్యంలోవలె పాశ్చాత్య సాహిత్యంలో లభించవు. అందులో మానవసంఘముల వ్యక్తుల చిత్రణములు లేకపోలేదు. ఆ వున్నవి ప్రాచ్యసాహిత్య చిత్రములవలె ధర్మగౌరవ పూరితములు కావు. ధర్మం అక్కడక్కడ చిత్రించబడినది గాని వ్యక్తులయొక్క చేష్టల అహంకృతుల అధర్మ ప్రవృత్తుల, అవినీతి సంగతులయందు మాటుమణిగి, బయటకు రాజాలక పోతున్నది. అక్కడవున్న ధర్మం వనమృగ గర్జనములలోని గండుకోయిలకూతవలె వినబడదు. ఒకవేళ వినబడినా దానికి ప్రాధాన్యం లేదు. ఏమంటే, భయంకరగర్జారావాల విరళ ప్రచారానికివలె దీనికి ప్రచారబాహుళ్యం లేదు కనుక. ఇట్లా అక్కడక్కడ ధర్మలేశాల చిత్రణంవున్నా అది ప్రస్ఫుటం కాక ప్రచ్ఛన్నమై ధర్మజ్యోతిని బయటపెట్టజాలకున్నది.

“ప్రాచ్యసాహిత్యంలో మెచ్చుకోదగ్గ ప్రకృతిచిత్రణం లేదు. మేము మంచి ప్రకృతి చిత్రకారులం” అనే అహంత అప్రాచ్యులకున్నది. వాస్తవానికి ప్రకృతి చిత్రణం రెండు సాహిత్యాల్లోనూ ఉంది. కాని వాటిరెంటిలోనూ భేదమున్నది. పాశ్చాత్య సాహిత్యంలో ప్రకృతి నగ్నమూర్తి; ఆర్య సాహిత్యంలో సాలంకృత. ఆంగ్ల సాహిత్యంలో మానవ ప్రకృతిలోని పాశవ-ఆసుర ప్రవృత్తులకు గౌరవం; ఆర్యసాహిత్యంలో కేవలం దైవీ ప్రవృత్తులకే గౌరవం. అయితే మన సాహిత్యంలో మాత్రం ఆసుర-పాశవ చిత్రణం లేదా? అంటే—యిక్కడ పాశవప్రవృత్తి మనుష్య విజ్ఞానంలో మునిగి, జయించబడ్డదై బయటకు కనబడక అడుగున పడిపోయింది. ఆసురప్రవృత్తి దైవీప్రవృత్తి చిత్రణముందర నిలువలేక పారిపోయి యెక్కడో తలదాచుకున్నది. మన సాహిత్యంలోవున్న ఆసుర-పాశవ ప్రవృత్తులు ధర్మ-దైవీ ప్రవృత్తులచేత పరాభూతాలు. కనుక వెన్నెలలో దివ్వవలె నిస్తేజస్కాలు. ప్రాధాన్యం దైవీప్రవృత్తికే.

ఆంగ్ల సాహిత్యంలో మానవ ప్రకృతిలోని పశు భావాలు, ఇంద్రియలోలత ప్రధాన వర్ణనీయాంశంగా ఉండటంవల్ల దైవ భావాలు దానిలో దాగి ఉన్నయి. బయటకు రాలేవు. కాగా ఉభయసాహిత్యాలకు రచనోద్దేశాలే వేరు వేరు. ఆంగ్ల సాహిత్య విషయంలో షేక్స్పియరును చూతాం.

షేక్స్పియరు మహాకవి. ఇతని రచనలలోని ఒక్కొక్క వ్యక్తి నిజంగా తిరుగాడుతూన్న చైతన్యయుక్తమైన మనిషి; రచనలోని పాత్రగా తోచదు. ఇట్లా సర్వమూ సజీవంగా సృష్టించి లోకానికి మహోపకారం చేసిన మహానుభావుడు షేక్స్పియరు. ఈకవి విషాదాంత నాటక రచనలో అలౌకికమైన ప్రజ్ఞావంతుడు. అందుచేత అతని సృష్టికి ప్రత్యేకత ఉన్నది. ఐనా సంయోగాంత నాటకాలుకూడా కడు సముచితతో వ్రాసిన మహామేధావి. ఏమైనా సంయోగ-వియోగాంత ఉభయరూపమైన కృతులలో అతని మొగ్గు వియోగాంతాలకే. అవే అతనికి యింతకీర్తి ప్రతిష్ఠలు తెచ్చి అతడు పోయినా చిరంజీవిని చేసినయి.

ఒకరి గొప్పతనం తెలుసుకోవాలంటె ఆ జాతియొక్క సిద్ధాంతాలు పరిశీలిస్తే వారి గొప్పతనం బయటపడుతుంది. ఒక జాతిలోని వ్యక్తి దానిని మినహాయించి విడిగా వుండలేడు. క్రైస్తవమతం “మానవు

టిలో పాపాంశం యెక్కువగా ఉన్నది. మంచి చాలా తక్కువ. రజస్తమః ప్రవృత్తు లెక్కువ. కాబట్టి చాలామంది విశుద్ధ వర్తనులు కాలేరు. కారు" అని సిద్ధాంతిస్తున్నది. అందుచేత ఆ సమాజంలోని కవిశేఖరుడు స్వమతసిద్ధాంతానుసారం రజస్తమోగుణప్రధానంగానే రచన సాగిస్తాడు. అట్లాకాక విడిగా స్వసిద్ధాంత భిన్నంగా ఉండే రచన యథార్థం కానేరదు. కాబట్టే ఒక్క షేక్స్పియరేగాక యితర పాశ్చాత్యకవిశేఖరులును తమ తమ రచనలలో రజస్తమోగుణాలకే ప్రాధాన్యం యిచ్చి వాటి వికాసాన్ని ప్రదర్శించారు. వాటినిబట్టి మొత్తంమీద ఐరోపీయ జనసంఘంలోనూ, దాని చరిత్రలోనూ విశిష్టదోషా లెట్లా వుంటాయో వాటికి అనుగుణంగానే షేక్స్పియరు రచనా సాగింది. కాగా వాటన్నిటికీ యీ రచన ప్రకృతి అన్నమాట. స్వమతసిద్ధాంతం ప్రకారం మానవుడెంత పాపియో అతని సృష్టిలోని పాత్ర కూడా అంత పాపే. అతని మత ప్రకారం రజస్తమోగుణసముజ్జ్వల ప్రభను ప్రజ్వలింపజేసి సదృష్టాంతంగా వాటి ఘోరభయానక దృశ్యాలను చూపించాడు; నరక యాతనలను సృష్టించాడు; అవి నిర్భరములని నిరూపించాడు.

### తారతమ్యం:

ఇట్లా ఒకరు నరకాన్ని సృష్టించి దానిలోని యాతన లన్నింటినీ నిరూపిస్తే, యింకొకరు స్వర్గాన్ని సృష్టించి దాని సుఖసౌందర్యాలను వర్ణించి, దాన్ని పొందాలనే భావనలకు జనాన్ని త్రిప్పటానికి చూచారు. ఇద్దరూ తమ తమ నిరూపణాకౌశలంతో రచనలు సాగించారు. కాని ఒక్క మాట. ఆంగ్లరచన చాలా కాలం క్రిందట సాగింది. దానికి కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే ఆర్య సాహిత్యం ఉదయభానుడల్లే బయలుదేరి ప్రపంచాని కంతకూ భిక్ష పెట్టింది. అప్పటికే ఆర్యకవులు వాక్కు - దాని ప్రాధాన్యము, దాని పుట్టుక, దాని సార్థక్యమూ మొదలైన శాస్త్రవిషయాలు ఆమూలాగ్రం తమ ఘనతపస్యతో సాధించి, సరస్వతీదేవి సమగ్ర మూర్తిని, ఆమె అభినుశోభను తనివితీరా చూచారు; ఒళ్ళంతా కన్ను చేసుకుని చూచారు. చూడటమే కాదు. ఆ మధువును తృప్తిగా ఆస్వాదించారు. జీర్ణం చేసుకున్నారు. కాని నేటికి కూడా పాశ్చాత్యవిద్వాంసులు వాగ్దేవి చీర కొంగు కూడా చూడ లేకపోయినారు. మనవారేనాడో చూచి ఊరుకోలేదు. ఇప్పటికి యింకా ఆమెను దర్శిస్తూనే ఉన్నారు. ఆ దేవితో తమ ఉదంతం చెప్పుకున్నారు. చివరకు ఆ దేవి 'వీళ్ళే మనకు శరణ్యం' అని నమ్మింది. ఒకప్పుడు తనను అమ్ముతారేమోనని భయపడ్డది. అల్లాగే సామాన్యకవులు ధనలోభంతో కుక్షింభరులై కొంతఱను ఆశ్రయిస్తే. పాపం ఆదేవి వచ్చి మన పోతన్నగారితో మొరపెట్టుకున్నది. ఆయన 'కాటుక కంటినీరు...నమ్మ భారతీ!" అని అభయం యిచ్చాడు. మరొక ప్రౌఢకవి యీ దేవిని పవిత్రవాణిని యింకో కళ్ళు తాకకుండా పిచ్చిపిచ్చిగా మాట్లాడకుండా చివరకు మనసా కూడా స్మరించకుండా చేయుటానికా అన్నట్లు "వాణి నారాణి" అన్నాడు. అత డర్ధనారీశ్వరుడైనాడు. ప్రకృతిపురుషులు కలుసుకున్నారు. అంతే. జగదుత్పత్తి ప్రారంభం.

పాశ్చాత్య కవిలోకంలో యిటువంటిదేమీ కనబడదు. ఎంత వఱకు 'మానవుడు—అతని రజస్తమోమయ ప్రవృత్తి—దాని విలయ

తాండవం—దానివల్ల వచ్చే దుష్ఫలితాలు' యివే కనబడేది. కాగా మన ఆర్యసాహిత్యంలోని సత్వసంపద క్షమ జిజ్ఞాస దయ దాక్షిణ్యం ధర్మప్రవృత్తి యివేవీ అనార్యసాహిత్యంలో కనబడవు.

మొత్తంమీద షేక్స్పియరు సామగ్రి అతని సృష్టికి అనుకూలంగా ఉన్నది. అతని వియోగాంత నాటకాలు అతని రచనా ధ్వజాలు. వాటిలో అతను ఘాతకులు సృష్టించాడు. నరకాన్ని తోడిపోశాడు. వాటి రెంటిలోని దుఃఖాగ్నులను కళ్ళకు కట్టేటట్టుగా చేశాడు. కాగా అసురసృష్టికి ఆ నాటకాల్ని ఉపకరించేటంతగా దైవిసృష్టికి కావు. సామాన్యంగా లోకంలో మామూలు పామరజనంలో వుండే పశుప్రవృత్తుల ప్రబలరూపం యీ నాటకాల్లో కనబడుతుంది. వాటి అంత్యపరిణామం రక్తపాతం. ఒథెల్లో నాటకంలో యిల్లాగే జరిగింది. రక్తపాతం అన్నాను కనుక ఉదాహరణకు ఒథెల్లోనుంచే యెత్తి చూపుతాను. ఏమీ యెరుగని అమాయకురాలు డెస్డిమోనాను వ్యభిచరించిందని అనుమానించి ఒథెల్లో చంపటానికి వస్తే,

"Des:—O! banish me my Lord! but kill me not.

Othe.—Down, Strumpet.

Des:—Kill me tomorrow. Let me live to-night.

Othe:—Nay, if you strive.

Des:—But, half an hour.

Othe:—Being done, there is no pause.

Des:—But while I say one prayer.

Othe:—It is too late"

అని నులిమి చంపుతాడు. ఇల్లా వాళ్ళిద్దరికీ సంభాషణ జరిగి తుదకు పశుబలం జయించింది. మొదట ఒథెల్లోలో పశుప్రవృత్తి ప్రబలంగా చెలరేగి చివరకు రక్తపాతం చేయించి తీరింది. అయితే యీ రక్తపాతానికి యింకా అనేక కారణా లుండవచ్చు. లోభమో ద్వేషమో స్త్రీ యెడల సంశయజనిత క్రోధమో యింకా ధనాశయో యిట్లాగే యింకేమున్నాయో. అందులో యిక్కడ స్త్రీ యెడల సందేహం. ఇది బజారు మనుష్యుల్లో సాధారణంగా జరుగుతుండే ఒకానొక సామాన్యమైన లౌకికావస్థ. ఇట్టి అవస్థను చూచే కవి విషాదాంతనాటకాలూ, ఒథెల్లో - మేక్ బెత్ - ఇయాగో-రోమియో మొదలైన అమానుష పాత్రలూ సృజించాడు. వీటిలో అనగా యీపాత్రలలో వున్న విశేషమేమంటే, వంచకత, హంతకత, ఆతతాయిత, వీటివల్ల కలిగే యమనరకం, దుఃఖాగ్ని కాగా - యీరచనలలో సృష్టించింది మామూలు మానవులనే అయినా, వారికి అంతశ్శత్రు ప్రాబల్యం మామూలు జనులకంటె వేయిరెట్లెక్కువై, మనుష్యత్వ సీమలు దాటి ఆసురలోకంలో ప్రవేశించినాయి. వారి ప్రకృతికి హద్దులేదు. లోభము మొదలైనవి సామాన్యజనుల్లో కొంచెం యెక్కువే అయినా, అక్కడ వాటికి కొంతవరకైనా హద్దుంటుంది. ఇక్కడది లేదు. పాశవభావం మొలకెత్తి పెరిగి, పెద్దదై, నానా చింకరబొంకర జరిగి, రాక్షసకృత్యమైన స్త్రీవధకు ఒకానొక మహాయోధుడు పాల్పడాడంటే యిక నా పాత్రను గూర్చి విచారించటం సమయం పాడుచేసుకోవటమే.

ఇటువంటి స్త్రీవధే కాదు గాని, స్త్రీ మానభంగ ప్రయత్నమే భారతంలోనూ జరిగింది. రథులూ, అతిరథులు, మహారథులు, యోధులూ, మహాయోధులు మొదలైన క్షాత్రప్రభతో నిండివున్న నిండుసభలో తమ్ముడు అన్న ఆజ్ఞతో ద్రౌపదికి మానభంగం చేయటానికి పూనుకున్నాడు. సభలో ఒక్కరూ 'యిది తప్పు' అని అనరు. అనలేదు. అనలేరు. అయినా ద్రౌపది త్రికరణశుద్ధిగా శ్రీకృష్ణభగవానుని ప్రార్థించగా ఆయన వస్త్రదానం చేసి భారత వనితా మానసంరక్షకుడైనాడు. అధర్మం తలయెత్తింది. కాని దాన్ని ధర్మం జయించింది. ధర్మప్రతాపం ముందు అధర్మం దూదివలె మాడిపోయింది. ఆర్యులకు అనార్యులకు యింత తేడా ఉన్నది.

ఇక మేక్ బెత్ రాణిని ఒక జర్మను విమర్శకుడు (హెగెల్) 'రంకులాడి' అన్నాడు. దానిలో ఉన్న కృతఘ్నత సాహసము నిర్దయ యిత్యాదివి రాక్షసులకు చెల్లును గాని మానవులకు కావు. చూడండి. "అవసరమైతే నేను పాలిచ్చి పెంచిన పసిపాపశిరమైనా ముక్కలు ముక్కలుగా చెక్కగలను' అని ఒకచోట మేక్ బెత్ అన్నది.

అయితే, మనకూ భాగవతంలో పూతన ఉన్నది. వీరిద్దరిలో కృతఘ్నత నిర్దయ ధర్మద్రోహమూ సమానాలే. ఇయాగో సామాన్యకారణప్రేరితుడై తనకు అన్నదాత, ప్రభువు అయిన ఒథెల్లో చేత స్త్రీవధచేయించి, మానుష సీమనుండి భ్రష్టుడై రాక్షస సీమల్లో కాపురమున్నంతపని చేశాడు. ఇటువంటివే మిగిలిన పాత్రలూనూ.

అయితే, మన భారతంలోనూ గదనుధరించి అసురప్రకృతి దుర్యోధనరూపంగా తాండవించింది. తన ఆవేశంతో మహాత్ములయిన ద్రోణకర్ణులను కూడా సూదంటురాయి యినుమునల్లే ఆకర్షించి, వారి నీతిని ప్రతాపాన్ని యుద్ధంలో నాశనం చేసింది. తల్లిగాని తండ్రిగాని భీష్ముడుగాని హితం బోధిస్తే దాన్ని పెడచెవిని పెట్టింది. తనకు తోచినంత చేసి పోరుకున్నది. దానితో దేవద్రోహం గురుద్రోహం జనద్రోహం జరిగింది. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలోనే మహాభీషణ సంగ్రామం సంకల్పించి, భూమండలాన్ని యావత్తూ గజగజలాడించింది. అయితే చివరకు వంశనాశనమైంది. మళ్లా ధర్మభానుడు ఉదయించేసరికి అధర్మాంధకారం యెక్కడెక్కడికో పారిపోయి, తలదాచుకు పెందుకుకూడా చోటు లేక సర్వాత్మనా నశించింది. ఇటువంటి దీనికి ప్రతిగా ఆంగ్లసాహిత్యంలోనూ "పారడైజ్ లాస్ట్" ఉన్నది. ఈ రెంటిలోని విషయాలకు తౌల్యమూ ఉన్నది.

# అడ్డదారి

### శ్రీ "శండిల"

జనతా ఎక్స్‌ప్రెస్ పిఠాపురం స్టేషన్ వదిలిపెట్టేసరికి తెల్లవారుజామున అయిదుగంటలయ్యింది. తెల్లగా వెలుగు రావడానికి ఇంకా ఒకగంట పడుతుంది. రైలునుండి అందరికంటె ఆలస్యంగా దిగినవారు అవతారంగారే. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ పిఠాపురం చేరువన కుమారపురంవైపు సాగుతున్నారు. కుమారపురానికి రోడ్డునబడి వెళ్లాలంటే రెండు మైళ్లు నడవాలి. అడ్డత్రోవవుందికూడా; అవతారంగారికి ఆ దారి సుపరిచితమైనదే. రెండుతోపులు దాటి మళ్లగట్లు పట్టుకొంటే అర్ధగంటసేపటికి ఇల్లు చేరుకుంటారు. ఆ తోపులలోను ఒకటి తెల్లవారితోట. రెండవదానిలో సమపాళంలో ఏపుగా పెంచబడ్డ మామిళ్లు, నారింజలు, పనాటాలు ఉంటాయి. మామిళ్లు పూతమీద వున్నాయి. పనాటాలు పరువుకొస్తాయి — ఎటొచ్చీ నారింజలే పుష్కలంగా ఫలించి ఆ శీతగాలికి చక్కని ఫలాల్ని అక్కడక్కడ రాల్చి భూదేవి ఉపరితలానికి శోభ కూర్చుతున్నాయి.

అవతారంగారు తోటలో అడుగు పెట్టేసరికి ఇంకా చీకటివుంది. ఆ చీకటిలో క్రిందపడిన నారింజపండ్లు స్పష్టంగా కనబడుతున్నాయి. తోటను చిందరవందర చేస్తూ కొన్ని కోతులు అటూ ఇటూ చెట్లమీదికి గెంతుతూ కిచకిచలాడుతున్నాయి. ఎవ్వరూ లేనిది అవతారంగారు అక్కడ కొంచెం దురాశకు అతిగా లొంగిపోయారు. ఒకటి రెండుపండ్లు తీసుకొని చేతిసంచిలో వేసుకొందామనిపించింది. చుట్టూ కలయజూచి ఎవ్వరూ లేరు గదా అని తనకు తానే గుణించుకొని రెండుపళ్లు పైకితీశారు. చిక్కని రంగుతో చితచితలాడుతూ ఆ నారింజలు ఆయన్ను ముగ్ధపరుస్తూ లోలోపల ఆశను కొంచెం లోతుగా రగిల్చాయి. అనేకలాగు అనిపించి ఒక పండును ఒలవడం ప్రారంభించారు. గోటిని చొనిపి చొనపగానే మెత్తగా దాని తోలు విడిపోతోంది. ఇంతలోనే సుంత మనుష్యులు వచ్చే అలికిడయ్యింది. అప్పటిదాకా ఆ ధ్యాసలో లేని అవతారంగారు తల ఎత్తి అటు చూశారు. ఇద్దరు వ్యక్తులు ఆయనవైపే తదేకంగా ఆయన్ని ఒక దొంగను చూస్తున్నట్లు పరకాయిస్తూ రావడం పసిగట్టారు. తక్షణం ఆయనకో ఊహ తట్టింది. ఏమీ ఎరగనివానికిమల్లె ఆ రెండు నారింజపండ్లు క్రిందికి జారవిడిచారు.

"ఆగలాగ! ఎవరు నువ్వు? తెల్లవారింటా దొంగతనానికి?" అంటూ అవతారంగార్ని ఎదుర్కొన్న ఇద్దరిలో ఒకాయన ఉరిమినట్లు గర్జించాడు. ఆయన ప్రక్కనేవున్న వేరొకడు — బహుశా ఆయన తాబేదారు కావచ్చు— పోతంగా ఆయనకు మద్దతు ఇచ్చాడు. అవతారంగారు అదోకవిధమైన తత్తరలో చిత్రయుక్తి ప్రయోగించారు. కాని ఆ పాచిక పారుతుందా పారదా అని నిశితంగా ఆయన యోచనాపటిమ ముందుకు వెళ్లలేకపోయింది.

"అదేమిటండీ అలాగంటున్నారు? నేనేమీ దొంగతనం చేయలేదే — మా వూరికి ఈ తోపుమీదుగానైతే రెండుపుంజీల అంగలు కలిసివస్తాయని ఈ దారిన వస్తున్నాను" అంటున్న అవతారంగారిని మిర్రుగా చూశాడు యజమాని. ఇంతలోనే ఆయన ఉద్దాగడు — క్షణం క్రితమే — విరగబూచిన అంటుమామిడి గున్న క్రింద అవతారంగారిచే చల్లగా జారవిడవబడ్డ రెండు నారింజల్ని ముందుకు పట్టుకొచ్చి "అబద్ధా లెందుకు బాబూ? తమరిప్పుడే కాదూ ఈట్ని చల్లగా జారవిడిచారు? చూడండి—ఒదానికి తొక్క కూడా దీసినారు—కొంత కొంచెద్దామని గాబోలు" అన్నాడు పళ్ళికిలిస్తూ.

"ఏమో, అది నాకు తెలియదు. నేనేమీ ఎరుగను" వ్యర్థంగానే దబాయించారు అవతారంగారు.

"పురాగా దొరికికూడా బుకాయిస్తావేమయ్యా. పెద్దమనిషివి. ఎక్కడైనా జీతపెందురా తొడిగిన మామిళ్ళు నారింజల్ని రాల్చుతారా? అందులోనూ పళ్లను ఒలిచి పడేస్తారేమిటి?" తనపక్షం పిలిచిపెట్టాడు ఆసామీ.

మాకు అవతారంగారు మళ్ళీ క్రిందపడికూడా పైచేయి వాడే అనే రకపుచ్చుకుంటె ఇంకా మొరాయించి "అయితే తోటమీది గదా అని మీ మాట చెల్లాలన్నమాట. ఆవరణ కోతులు అంతా హంగామా చేస్తున్నాయి. తెల్లవారుజామున రెండుపళ్ళు కోసుకొచ్చి పడవెయ్యడం ఇక్కడ వాటికి ఏమైనా ఘనకార్యమా?" అన్నారు.

"ఔనౌను. మనుష్యులుకూడా కోతులే. కోతులు క్రమక్రమంగా మనుష్యులయ్యారంటూ మనుష్యులు క్రమక్రమంగా కోతులౌతున్నారు. ఎందుకండీ అంత సత్తెకాలం? మీ కుడిచేయి ఇటు చూపండి. మీ గుట్టు అదే బట్టబయలు చేస్తుంది." అంటూ ఆసామీ, అవతారంగారి చేతిని చివాలున లాక్కొని తన ముక్కుదగ్గర పెట్టుకొన్నాడు. ఘుమ్మని నారింజకాయ వాసన ఆయన ముక్కుపుటాలకి సోకింది. అవతారంగారి బొటనవ్రేలిమీద చముర్ల చారికలు ఇంకా ఆరనే లేదు. ఆయన మొగం వెలవెలబోయింది. కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు నుదుటిపై. నోటిమాట పెకలడం లేదు. మౌనంగా తల వాల్చేశారు.

"లేచినవేళ మంచిదిగాదు బాబూ. పాసిక పారలేదు. పెద్దపెద్ద మారాజులే సిన్నకి సితక్కి కక్కుర్తి పడతావుంటే మా నాటోళ్ళకొచ్చిందా? ఇయన్నీ యెరక్క మా యజమాని మన్నోళ్ళి దుమ్ము దులుపుతూంటాడు." హేళనగా మళ్ళీ సకిలిస్తూ వెక్కిరించాడు అవతారంగారి అవసను తాబేదారు.

"చాలు పదండి ఈపాటికి. జాగ్రత్తగా మసులుకుని ఇల్లు చేరుకోండి." అని ఆ యజమాని, ఉద్దారుడు తోటలో తమ మక్కాం

వైపు మళ్ళిపోయారు. అవతారం గారికి తమ ఎదుట నంతా శూన్యముగా వున్నట్లు, కళ్ళు చీకట్లు గమ్మినట్లు ఏమీతోచక బరువుగా అడుగులు ముందుకుపడ్డాయి.

## 2

తెల్లగా తెల్లవారింది. సూర్యోదయానికి ఇంకా ఒక అర్ధ గంటకు పైగా వ్యవధి వుంటుంది. అవతారంగారు ఇంకా ఆ నారింజ తోటను పూర్తిగా అధిగమించి బయటపడలేదు. ఆ తోపు ఆయన్ను బయటకు పోవలసినదిగా ఎంత వేగిర పడుతున్నా ఆకర్షణనుంచి తప్పించుకోలేక పోతున్నాడు. పదిబారల దూరంలో తోటకు కంచె కనబడుతోంది. అది దాటితే మళ్ళీ ఇట్టు తిరుగుతుంది. ఇంక అక్కడకు అంది పుచ్చుకున్నట్లు వుంటుంది కుమారపురం. అయితే ఈ కాసేపటిలోను అవతారంగారికి గొడవ మళ్ళీ ఎక్కువైనట్లుంది. చెట్లక్రింద రాలిపడిన నారింజపండ్లు చితచితలాడుతూ కొట్టవస్తున్నాయి. నిజంగా ఒక్క పండునయినా అంటుకోకుండా వుండటం మనిషితరం గాదు. కాని అవతారంగారు మళ్ళీ ఆ పళ్ళను ముట్టుకో తలచిన మాట కాదు.

అయితే అవతారంగారూ మనిషి. రక్తమాంసాలు గల మనిషి. ఆశాపాశం చేత బాధింపబడ్డ మనిషి. అసలు కోరిక తీరే అంత. అది తీరేవరకు నిద్రపోదు. మనసు నిద్ర పోనివ్వదు. తాత్కాలికంగా ఎట్టి తీరుయినా తలపెడదానికే మానవ ప్రవృత్తి పూనుకొంటుంది గాని ఇది మోహపాశమని గాని, భ్రాంతి అని గాని వదిలిపెట్టదు కదా! కొలనిలో తామరతూడుకై ఎగబడే ఏనుగ మొసలి ఉంటుందని తెలిసీ కూడా దాన్ని లక్ష్యపెట్టదు.

ఇక్కడ ఇంకొక వైపరీత్యం సంభవించింది. కోరికకు ప్రత్యర్ధైన ప్రతీకారంకూడా జతపడింది. అది కేవలం అనవసరం; కాగా మూర్ఖత్వం. అవతారంగారనుకొంటున్నారు. "ఈ నాలుగు బారల్లోను ఇంతలోకే ఎవరు వచ్చి చస్తారు? కాకపోయినా మనిషంత మనిషిని పట్టుకొని, వెధవది, రెండు పండ్లు తీసుకొంటేమాత్రం — దానికింత యాగీనా? ఇప్పుడు ఎవడొస్తాడో చూస్తాగా? సంచినిండా ఎత్తుకొని కంచె దాటేస్తాను. వాళ్ళు ఒకవేళ ఆ మూలనుంచి చూచినా ఇక్కడకు వచ్చేసరికి నేను ఆ తలవాకిట్లో వుంటాను. అప్పుడు ఇది తమ పళ్ళని ఎలా రుజువు చేస్తారు? పొరుగూరివాడు ఇక్కడకొచ్చి తోటకొచ్చానుగదా అని ఇంత పొగరా?"

మనస్సు ఒక నిశ్చయానికి వచ్చేసరికి పనిని చెయ్యడానికి శరీరం దానంతటదే ఉరకలు వేస్తుంది. మరి కాసేపటికి అవతారంగారు వంగి చెట్లక్రింద రాలిన చెంబెడేసి నారింజపండ్లు అరడజనుకుపైగా సంచిలో వేసుకొన్నారు. అక్కడితో ఆగాలా? చేతులోనే వున్న ఇంకొక చెట్టుక్రింది పళ్ళు ఆయన్ను మరీ బలంగా లాక్కున్నాయి. అవతారంగారు ఇప్పుడు జాగ్రత్తపడినా బాగుండేది కాని ఇది మన భ్రమ. లేకపోతే చోసకందూరం శరవేగంతో కోరికవల్ల ఈడ్వబడ్డ మనం అది త్రోసివేసి సుడిగుండంలోంచి బయటపడగలమా? మహామహులు సుడితలో పడిపోయారు. మనమూ అవతారంగారూ ఒక లెఖ్ఖా? అంతే. ఆయన రెండవచెట్టుక్రింది

కాలంలో అమోఘమైన చికిత్సలుచేసి అవతారంగారు ఆనాటి కింతకు అర్నెల్లు తిరక్కుండా అద్భుత వైద్యుడై కూర్చున్నారు.

వర్షఋతువులో చివరి రోజులు. అప్పుడే శీతగాలి ఒకటి రెండుసార్లు తొంగిచూడ్డానికి అనువపడింది. ఆ వేళ ప్రొద్దుట పది గంటలౌతుంది. నిర్ణీత సమయప్రకారం అవతారంగారు ఇంకొక గంట మాత్రమే రోగుల్ని పరీక్షిస్తారు. అయినా ఆయన్ను చూడ వచ్చినవాళ్ళ సంఖ్య సమయానికి మించిన అనుపాతంలో నే వుంది. ఒక్కొక్కరే రోగులు లేచి వరుసక్రమంలో వారిని ప్రత్యేకంగా పరీక్షించేందుకు అవతారంగారు ఏర్పాటుచేసిన గదిలోకివెళ్ళి ఆయన్ను చూచి తమ తమ రుగ్మతలను ఏకరువుపెట్టి మందులు వ్రాయించుకొని కేకలకు వస్తున్నారు. హాలులో ఇద్దరు కాంపౌండర్లు వారికి మందులు పొట్లలుగట్టి ఇస్తున్నారు.

"డాక్టరుగారు ఏదో అర్జంటు కేసు చూడ్డానికి పోతూపోతూ వెళ్ళాలి. కనుక మీరందరూ ఇప్పటికి వెళ్ళిపోయి మధ్యాహ్నం రండి." అవతారంగారి గదిలోంచి హాల్లోకి ఆజ్ఞ వినవచ్చింది స్పష్టంగా. కొంతమంది రోగులు లేస్తున్నారు. వారి వరుసలో చివరనున్న ఒక ఆసామీ అంటున్నాడు. "అయ్యా! మాది పొరుగూరు. చాలా దూరం. కళ్ళకు కాని జబ్బు వచ్చింది. రెండుమాసాలనుంచి చూపు ఆనడంలేదు. ఎందరిచేతనో వైద్యం చేయించుకున్నాను. రోగం ముదిరిపోతోంది గాని తగ్గడంలేదు. బాబుగారు దయదలిస్తే ఆ అక్కౌషధం తీస్కొని స్వగ్రామానికి వెళ్ళిపోతాను ఇంటికి. కళ్ళు విపరీతంగా పోటు పెడుతున్నాయి. కనికరించాలి." అని దీనాతి దీనంగా ప్రార్థిస్తున్నాడు. వాడిస్వరం కొంచెం బిగ్గరగా రావడంవల్ల, అది క్రమంగా అవతారంగారి గదికి సోకడంవల్ల "రమ్మని చెప్పు లోపలికి. ఆ కేసు ఒకటే చూసి వెళతాను." అన్నారు డాక్టరుగారు. కూడావచ్చినవారు అతన్ని లోపలికి తీసుకువెళ్లారు.

అవతారంగారిగది అంతా నిశ్శబ్దంతో నిండి స్వచ్ఛంగా, శుభ్రంగా వుంది. బయటకూడా రోగులు హాలును ఖాళీచేసి వెళ్ళిపోవడంతో ప్రశాంతత వ్యాపించింది. వీధిలో చిన్నతుషారం పడుతూ యీదురుగాలి వీస్తోంది అప్పుడప్పుడు వాడిపోయిన ఆకులు ఒకటి, రెండు తిరుగుతూ ఆముప్పతి వరండామీద క్రొత్తగా కప్పగా పరపింపబడ్డ ఆస్బెస్టాస్ రేకులపైబడి టపటపలాడుతూ గాలివవ్వడికి తాళం వేస్తున్నాయి. అవతారంగారు తమ కళ్ళజోడును సుతారంగా శుభ్రంగా తుడుచుకొని ఠీవిగా పెరుగుతున్న తమ గడ్డాన్ని సవరించుకొని ఆ రోగి నేత్రాలపై కట్టబడ్డ దళమైన అట్టను విప్పిస్తూ ఆ ఆసామీని లోపలికి తీసుకువచ్చిన ఇద్దర్ని ఉద్దేశించి "మీరు అవతలకు వెళ్లి హాల్లో వేచియుండండి ఈయన్ను పరీక్షించి పూర్తి అయ్యాక మిమ్మల్ని కేకవేస్తాను." అని వాళ్లను సాగనంపారు.

రోగిని చెయ్యిపట్టుకొని డాక్టరుగారు ప్రక్కగదిలోకి తీసుకువెళ్లి బల్లమీద వెల్లకిల పడుకోబెట్టి తలుపుల మూసివైచి టార్చిలైటు వేసి కళ్లు జాగ్రత్తగా పరీక్షచేస్తున్నారు. మధ్యమధ్య రోగిపేరు, వయస్సు వృత్తి ఇత్యాదులను తమ రిజిష్టరులో నమోదు చేస్తున్నారు. "ఇల్లాపు రామస్వామి... వయస్సు 48... స్థలం... రాజమండ్రి...పురుషుడు...వృత్తి...కమీషను వ్యాపారం..."

"అంటే ఏం చేస్తుంటారు?"

"అపరాలు, పళ్ళదినుసులు కొని లాభానికి ఇతరులకు అమ్ముతుంటాం."

"మీకు తోటలుకూడా నే అలవాటుందా?" రోగి తొడుక్కున్న ఊలు స్వెట్టరులోపలి అంచు మల్లుగుడ్డమీద ఒకమూల ఎర్రదారంతో స్పష్టంగా నగిషీలో కుట్టబడ్డ 'అ' అనే హిందీ అక్షరాన్ని కనిపెట్టి తాకుతూ అవతారంగారు అడిగే యీ ప్రశ్నకు రోగి తనకు తెలియకుండానే అదిరిపడ్డాడు.

"ఔనండీ అప్పుడప్పుడు మామిడితోటలు. నారింజ, సపోటా తోపులు మేం గుత్తకు కొంటూంటాం."

"ఆ—మీ రెప్పుడైనా ఈపూరికి పిఠాపురానికి సరిహద్దులోనున్న నారింజతోపు కొన్నారా?"

"కొంటే కొనివుండవచ్చు. అది మూడేళ్ళ క్రిందటిమాట."

"ఈ స్వెట్టరు చాల బాగున్నదండీ. లేదంటే పదిహేను రూపాయలు ఖరీదుంటుంది. ఎక్కడ తీసుకున్నారు?"

"డాక్టరుగారూ! మీరు రోగుల్ని పరీక్షించే తీరు ఇదేనా? కంటిజబ్బు వాణ్ణి ఒంటి బట్టలు గురించి అడుగుతారేం!"

"అవ్వే-పరీక్ష సాగుతూనే వుంది. కేవలం ఆవిషయంమీద నే నాదృష్టిని కేంద్రీకరిస్తే రోగం లెక్కల బాధపడతారని ఏవో ఇలాంటి పిల్లరమల్లర విషయాలు ప్రసావిస్తూంటాం. అదీకాక మేము చేసే రోగనిర్ణయ విధానపుతీరే అంత ఫలితాలనుబట్టి గాక కొంతవర్కు బట్టి మందు నడుపుతాం."

"సరే—ఇక కొన్ని ప్రశ్నలు గుగు. సరిగా మూడేళ్ళ క్రిందట ఒకదుర్మార్గుడు ఘరానాగా మాకళ్ళయెదుట మాతోటలో నారింజపండు దొంగిలించి పారిపోతూంటే పట్టుకొని వాడికి ప్రాయశ్చిత్తం చేయాలని వాడిస్వెట్టరు లాగుకొని ఏదో మహాఘనకార్యం చేసినట్లు నాలోనేనే అనుకుంటూ అప్పుడప్పుడు తొడుక్కుంటూ గొప్ప ననుభవిస్తూంటాను"

ఆమాటలు వింటూ ఈనాడు పూర్తిగా మారిపోయిన వ్యక్తి సంస్కారంపొందిన మానవుడుగా గాక వెనకటిమనుష్యుడిలాగే అవతారంగారుండివుంటే ఆపాటికి ఆ రుసయొక్కు కాలి చెప్పుదెబ్బతో ఆ కంటిరోగి కుడిదౌడలోనిపళ్లు ఊడి ఇవతలకు రాలిపడి ఉండేవి. పరోక్షంగా తనకు తెలిసిన ఆ ప్రహారాన్ని వైద్యుడు మందహాసంతో స్వీకరించి 'ఓహో - అలాగా - నేరస్తుడు చేసిన తప్పిదానికి జుల్మానా విధించిన న్యాయాధిపతి ముద్దాయి చెల్లించిన అపరాధపు సొమ్ముతో పండుగ చేసుకుంటున్నాడన్నమాట." అని మాత్రం అనగలిగారు.

"అసంతా ఎందుకంట! ఇంతకీ మీరు నా రోగానికి మందు ఇచ్చేటట్లా లేనట్లా? ఈ వ్యర్థప్రసంగమంతా ఎందుకూ! రెండు నెల్లనుంచి బొత్తుగా ఆనడంలేదు. రాత్రీ పగలూ ఏం పొట్టుం మనవున్నకు శాంతిలేదు- తెగ నీళ్లు కారుతూంటాయి—నన్ను వీళ్ళమ్మా ఇలాగ వేధించి చంపుకు తినకుండా ఈ కళ్లు రెండూపోయినా బాగుండును..." "పరీక్ష అయిపోయింది లెండి. [illegible]

కంగారు పడకండి. మీ రోగం పూర్తిగా నయమౌతుంది. ఏమీ ఫర్వాలేదు." అని అవతారంగారు ఆయనకు చేయూతనిచ్చి హాల్లోకి తీసుకువస్తూ మెల్లగా మెల్లగా ఇలాగన్నారు. "రామస్వామిగారూ- చూడండి. భగవంతుడు ఎవ్వరికీ ఇవ్వని ఒక గొప్ప గుణం మానవునకు ప్రసాదించాడు. అదే క్షమ. దయ. మనం చేస్తున్న పని మంచిది కాదని ఒకమూలనుంచి మన అంతరాత్మ చెబుతూనే వుంటుంది. కాని మనం వినం. దేవదత్తమైన ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోకపోతే అపరాధం కేవలం మనదే. మూర్ఖుడైనా సరే, దీన్ని ఆచరణలో పెట్టడానికి అవకాశాలు కల్పించబడుతూ వుంటాయి. అవి అరచేతికి చిక్కినప్పుడు ఆ అపూర్వావకాశం చూస్తూ జారవిడుచుకొన్నప్పుడు వారియందు జాలిపడ్డ మనకు ఇంకేమీ కలగదు. అంతే...."

"డాక్టరుగారూ- మీరు ఆ మాటలు అనుభవంమీద చెబుతున్నట్లుంది. అవి కేవలం నగ్నసత్యాలు. వాటిని వినక నేను తెలుసుకోవాలని కొనితెచ్చుకొన్నాను." అన్నాడు రామస్వామి. ఇద్దరూ హాల్లోకి వచ్చేశారు. అప్పుడే కాంపౌండర్లుగూడా ఇళ్ళకు వెళ్ళిపోయారు. డాక్టరుగారే స్వయంగా మూడుపొట్లాలు అతని చేతిలో వుంచి 'వీటిని మూడురోజులు రాత్రి పడుకొనేటప్పుడు వేసుకోండి. పదిహేను రోజులలో మీకు చక్కని దృష్టి ప్రసాదించబడుతుంది. కాని ఒక్కటి మరువవద్దు పది రోజుల పాటు మీ వ్యాధి లక్షణాలు బాగా ఉద్రేకిస్తాయి అయితే మనసులో ఏదో మూలనుంచి మీరు తేరుకొంటున్నట్లు మీకు తోచబడుతుంది. మనం తెలిసి చేసినా తెలియక చేసినా పాపానికి శిక్ష అనుభవించకుండా ఎదో అడ్డదారినబడి పోదామని భ్రమించడం పొరబాటు. దానివల్ల రోగం దాచబడుతుంది గాని పూర్తిగా నయం కాదు—"

డాక్టరుగారి వద్ద శలవు పుచ్చుకొని ఆరోగిని తీసుకువెడుతూ వెంటనున్నవారిద్దరూ రామస్వామి కండ్ల జబ్బును గురించి సూక్ష్మంగా అవతారంగారికి పరిచయంచేశారు. "ఆరుమాసాల క్రితం అతడు నడిచిన తప్పుదారికి, నీతిబాహ్యంగా సంచరించినందుకు అతడు ఈ విధంగా శిక్ష అనుభవిస్తున్నాడు. తాను చేసేది తప్పు పని అని అతనికి తెలుసు. ఐనా పొగరు కొద్దీ కన్ను గానక చెడుపని చేసినందుకు ఆ కళ్లే బాధపడుతున్నాయి.

## 4

అవతారంగారు తన చిన్న బల్లని మందుల పెట్టెతో పొరుగూరిలో వున్న చలంగారి మకాం చేరుకొనేసరికి మధ్యాహ్నం మూడు గంటలయ్యింది. చలంగారు నూటపాతికెకరాల పైచిలుకు ఏటి క్రింద పల్లం భూమిగల పెద్ద కాపు. తరచు వారింట్లో ఎవరికి కాస్తంత నెప్పిగా వున్నా అవతారంగారికి కబురు వస్తుంది. చలంగారికి ఆయన మీద మంచి గౌరవము, భక్తి వున్నాయి. ఈయన కూడా ఆయన మాట తీసివెయ్యడం జరగదు. ఇవాళ చలంగారు బావి దగ్గర చెరకు గానుగ మకాంలో వున్నారు. "ప్రొద్దుట మీరు కబురంపగానే వచ్చేసే వాణ్ణి. అయితే ఈ రోజు రోగులు చాలా మంది రావడం, విశేషించి ఒక చిత్రమైన కంటి జబ్బుతో బాధపడుతున్న ఒక ఆసామీని పరీక్షిస్తూ కొంచెం తర్కంలోకి దిగడమూ కారణంగా త్వరగా రావీలింది గాదు. రెండు గంటలకు భోజనం చేసి ఈ వేళకి ఇక్కడకు చేరుకోగలిగాను" అంటూ తాపీగా ఒక రకమైన సంజాయిషీ వంటిది చలంగారికిచ్చుకున్నారు అవతారంగారు.

"ఆం—దానికేమిలెండి. మీకు కబురుపెట్టాను ఒక ప్రత్యేకం పనికలిగి. మా పెద్దపాలేరుకు సుమారు నెలరోజులనుంచి విచిత్రమైన వ్యాధి ఒకటి సంప్రాప్తించింది. మొదట్లో గొంతున ఎదో పుండు వున్నదన్నవాడు. క్రమేపి స్వరపేటిక పూడుకుపోయింది. ఇప్పుడు వాడికి మాటరాదు. అదొక చిత్రమైన లక్షణం. నొప్పిలేదు. వాపులేదు. పుండులేదు. భోజనం సుష్టుగా చేస్తుంటాడు. మరొక విశేషం. ఎప్పుడూ పనిలో బాధపడే వానికివలె కాలువాగప్పుకొని వుంటాడు. వీడు మా పాలేర్లలో కెల్ల మంచి నిఖార్సైనవాడు. నిజాయితీపరుడు" చలంగారు ఇంకా చెప్పబోతున్నారు.

డాక్టరుగారు అర్థవంతంగా మందహాసంచేశారు. దానికి కొద్ది వ్యాఖ్యానంకూడా చేసుకోవచ్చు. "బాగానేవుంది. అది ఒక చక్కని కేసు వైద్యుని మంచితనాన్నీ, రోగి తత్వాన్నీ ఈ సంఘటన పట్టిచూపుతుంది. పదండి వాణ్ణి చూసివద్దాం." అవతారంగారు, చలంగారు లేచారు. ఇద్దరూ తోటవైపు నడిచి వస్తున్నారు. ఎన్నడూ లేనిది ఆయన అనేకరకమైన ధోరణిలో ప్రసంగిస్తూండడం చలంగార్ని విపరీతమైన ఆలోచనపైపురేపింది. "మీ మాటకడ్డు వచ్చాను. ఏమీ అనుకోవంటే మనవిచేస్తాను. మీ దృష్టిలో ఆ పాలేరు మంచివాడు కావచ్చు. యజమానికి తగిన ఉద్ధారుడు మాత్రం కాడు. అట్టివాళ్ల విషయమై ఏవంటే వారు జాగ్రత్తతో మసలడం అవసరం."

"వైద్యమే గాకుండా మీరు జోస్యంకూడా చెప్పగలరా! కాకపోతే మీరు అనేదేమిటి? వాడ్ని చిన్నప్పటినుంచి నే నెరుగుదును." హేళనగా ముడితో అడ్డుకున్నారు చలంగారు.

"కొంచెం శాంతించండి. యజమాని చేస్తున్న ప్రతిపనికీ తాళం వెయ్యడం సేవకవృత్తికి తగినపని అని మీరంటారని నేననుకోను. యజమాని తప్పుచేస్తున్నప్పుడు, సూచనమాత్రంగానైనా సరే సేవకుడు గ్రహించినప్పుడు స్వామిని కొంచెం దారికి తీసుకురావాలి. అంతేగాని ఆయనతోబాటు తనూ ఒకదారి దొరకుతుంది గదా అని 'సై' అంటే అతని విధి నిర్వహణలో లోపం జరిగినట్లు కావంటారా?"

"అబ్బెబ్బె—అలాంటివాడు కాడే."

"ఉదాహరణకు చెబుతాను మీ గానుగదగ్గర ఒకడు బాహాటంగా చెరకుగడలు దొంగిలించి మీకు దొరికిపోయాడనుకోండి. మీరు దొంగకు నాలుగు రూపాయలు జుల్మానా విధిస్తారు. ఆ పాలేరూ తాను వసూలుచేసి మీకు రెండు తీసుకొని వాడ్ని సంగతి తీసుకోకుంటే, పట్టుకుపోతే, వాడు చేసినది ఖచ్చితమైన పని ఎలాగౌతుంది?"

"ఓ...అదా..." చలంగారు సంభాషణ ముగించేశారు. ఇంతలో వారి పాలేరు ఉంచబడ్డ పాక దగ్గరకు వచ్చారిద్దరూ. అవతారంగారు వాడ్ని చూశారు. ఇప్పటివరకు తమ్ముడు చలంగారు.

చెప్పుకొన్న కథలోని సేవకుడు వాడే—నూటికి నూరుపాళ్ళు వాడే అని వాడు కప్పుకొన్న అవతారంగారి శాలువా వాళ్ళకి నవ్వుతూ చెబుతున్నట్టు కదుల్తోంది. శాలువా కప్పుకొన్న పాలికాపు వణుకుతున్నాడు. పాపం చేసినవాడు భగవంతుని చూడలేక గడగడ వణికే దుర్దశను కురుడు తెస్తున్నాడు. తనను, ఆ శాలువను, వాడికీ తక్క అన్యులకు గురూహంగా వున్న మూడు సంవత్సరాల క్రిందటి కథ అవతారంగారి కళ్ళల్లో మెరుస్తోంది. ఆయన చలంగారి వైపు తిరిగి ధర్మోక్తిగా "ఏమండీ—ఈ శాలువా 'లాల్—ఇమా' కంపెనీవారిది. లేదంటే ముప్పై రూపాయలకు తక్కువ చెయ్యదు. మీరు దీన్ని బహూకరించారని గాని, వాడు కొనుక్కున్నాడని గాని నేనెలాగనుకోగలను?" అన్నారు.

"కొంచెం మిణుమిణుకుగా కపోయినా అంతను దగ్గరదే. అది ఓబాపతుగా వాడికి దొరికింది. వెనక వాళ్ళు ఒకతోట పాడేరు. దానిలో ఒక ఘరానా దొంగ నారింజకాయలు ఎత్తుకుపోతూ దొరికిపోయాడు. ఇలాగ్గాదు—ఈ వెధవకు తగినశాస్తి చెయ్యాలని వాడి జుబ్బా ఒకటి. శాలువా ఒకటి ఊడలాక్కుని [illegible] పంచుకొన్నారు. ఆ రీత్యా వీడికి ఇది దఖలు పడింది." అవతారంగారు నిష్ప్రియమైన చిరునవ్వుతో దీన్ని స్వీకరించి "అదే. అదే—నేను ఇందాకటినుంచీ చెబుతూంది. భగవంతుడు ఎవ్వరికీ ఇవ్వని ఒక గొప్పగుణం మానవులకు ప్రసాదించాడు. అదే [illegible]. మనం చేస్తున్న పని మంచిదికాదని ఒక మూలనుంచి మన అంతరాత్మ చెబుతూనే వుంటుంది. కాని మనం వినం. దేవదత్తమైన ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోకపోతే ఆ దోషం కేవలం మనదే. మూర్ఖుడైనా పరే దీన్ని ఆచరణలో పెట్టడానికి అవకాశాలు కల్పించబడుతూంటాయి. అవి అరచేతికి చిక్కినప్పుడు ఆ అపూర్వావకాశాన్ని జారవిడుచుకొన్నప్పుడు వారియందు మనకు జాలి దక్క ఇంకేమీ గలగదు. అంతే."

"ఇంతకీ ఈ జబ్బు పేరేమిటి అంటారు?" అవతారంగారి వ్యాఖ్యను విని గూడా అర్థం చేసుకోలేని చలంగారు ప్రశ్నించారు.

"ఏం చెప్పమంటారు—పురాకృత సుకృతం. కర్మ—సరి. దాని కేంలెండి. జరిగిందేదో జరిగిపోయింది. ప్రస్తుతం ఆలోచిద్దాం. ఇప్పుడు రెండు మోతాదులు మందిస్తాను. ఒక వారంరోజులపాటు వ్యాధి ఉద్రేకిస్తుంది. తర్వాత క్రమంగా తగ్గిపోతుంది. చేజేతులా తప్పుచేసుకొని హాయిగా రోజూ వెళ్ళబుచ్చుకుందామంటే ఎలాగ కుదురుతుంది? వీడు సరిగా మాట్లాడడానికి ఒక నెలరోజులు పడుతుంది. వారానికి మూడు మోతాదుల చొప్పున మందు వాడండి." అని చలంగారితో చెప్పి అవతారంగారు శెలవు తీసుకొంటూంటే పాలేరు అశ్రువుల్ని వెలువరించే నయనద్వయంతో ఆయన్ని చూచి ఎంతో బాధపడ్డాడు. వాడు తన వైద్యుని గుర్తుపట్టలేకపోయాడు. లేకుంటే ఈ పాటికి ఎప్పుడో ఆ కన్నీళ్లు ఆయన పాదాల్ని అభిషేకించి వుండేవి. వాని యజమానే తెలుసుకోలేకపోయాడు—పాలేరుగా ఎంతైనా శుద్ధ మూర్ఖుడు!

## 5

కుమారపురంలో అవతారంగారి హోమియోపతీ వైద్యాలయం ముందు ఎన్నడూ జరిగివుండని ఒక విచిత్రమైన గందరగోళం జరుగుతోంది. ఇద్దరు ముగ్గురు ఘరానా పెద్ద మనుష్యులనుండి వెలువడుతున్న నేరారోపణలు సూటిగా డాక్టరుగారిపైనే ప్రయోగించబడుతూండడం చూస్తూన్న రోగులు, చుట్టుప్రక్కల మూగిన జనం ఎంతో విస్తుపోతున్నారు. ఒక పెద్దమనిషి అవతారంగారివైపు కోపంగా తన బలమైన చేతిని జాడిస్తూ "పగబట్టినవాళ్ళను చాలా మందిని చూశాంగాని ఈ వృత్తిలో క్రొత్తచుక్క క్రొత్తచేనీ, నీవు నీవే నాటి దొంగతిరుగుడు వాదాలు, చల్లచల్లని కల్లబొల్లి కబుర్లు చెబుతూ, కమ్మగా మాట్లాడుతూనే తియ్యని పంచదారలంత లేపి మాత్రలలో కాలకూట విషం రంగరించి కసితీర్చుకోవడానికి పూనుకొంటావని కలనైనా అనుకోలేక మావాడి కళ్లు నీకు చూపించాం. కొరవితో తలగొక్కొన్నట్టు, కోతి పుండును బ్రహ్మరాక్షసి చేసుకొన్నాం. ఎక్కడ మూడేళ్లు? ఏమి నారింజతోట గొడవ? వెధవ జుబ్బాకోసమై విషం ప్రయోగించి నిలువునా నిండు ప్రాణం తీయడానికి సిద్ధపడావా?" ఇంకా ఏమేమో వదరుతున్నాడు. అవతారంగారు నతమస్తకులై నిల్చున్నారు. హిమవత్పర్వతం మీద వడగండ్లవాన కురుస్తున్నట్టు అసహ్యమైన ఆ నిందలు ఆయనపై పడుతూన్నాయి. ఈ విషమావస్థను చూచి సహించలేని అవతారంగారికి సుపరిచితుడైన ఒక మర్యాదస్తుడు ముందుకు దూసుకవచ్చి తూలనాడుతున్న పెద్దను ఆగమని సంజ్ఞ చేసి "మీరు కొంచెం తమాయించండి. అవతారంగారికి జవాబు చెప్పడానికైనా అవకాశం ఇవ్వరేం? అసలు ఆయన ఎందుకు అంతగా మౌనం దాల్చారనైనా ఊహించారా?" అని ప్రశ్నించాడు. అతగాడు అవతారంగార్ని వదిలి ఆయనపై విరుచుకు పడుతూ "చేసినదంతా కిమ్మనకుండా కానిచ్చి ఇంకేమి సమాధానం చెబుతాడండీ. సరిగ్గా పదిరోజులవుతుంది ఈయనకు రోగిని చూపించి. మాత్ర వేసేటప్పుడే అవాకరమైన వింత ధోరణి ప్రారంభించాడు ఈయన. అసలు కథ మావాడు ఇంటికి వెళ్ళిన తర్వాత వివరంగా చెప్పినప్పుడు గాని మాకూ తెలియలేదు. పాతపగను కడుపులో దాచుకొని వాడి ఎండిల్లో ఈయన నిద్రపోతున్నాడని కొనుక్కోలేక పోయాడు. కాకపోయినా వాడు చేసిన తప్పుకు పనికి కళ్ళ జబ్బు గూడా అలాగే నాపురించింది. నిజంగా వాడికేమనుక రవ్వంతైనా అనుతూంటే ఈయన వలలో పడేవాడు గాడు. అబ్బో—వాడూ అఖండుడు. దేవాంతకుడు. కాని కర్మ కూడివచ్చింది. మందు కొంచెం ఉద్రేకం చేస్తుందంటే మేమూ ఫర్వాలేదు అనుకొన్నాం. కాని ఇంత కొంప మునుగుతుందని అనుకొన్నాం గాదు. ఇప్పుడేమనుకుని ఏం ప్రయోజనం? ఎవర్ని తిడితే ఏం లాభం? ఆ పామే ప్రాణం నిలబడుతుందా? ఇప్పుడు వాడికి వళ్లు ఉబ్బిపోయింది. కళ్ళలో పోట్లు ఎక్కువైపోయాయి. మనిషి కదల్లేకపోతున్నాడు. ఒక దురద. దానికితోడు ఈ ఉదయంనుంచి విరేచనాలు మొదలు, ఇంక వాడు పడే బాధ వర్ణించలేం. ఎక్కడికైనా తీసుకుపోదామా అంటే, మాకు కాళ్ళాడ్డం లేదు." అతగాడు ఇంకా పరిపరివిధాల ఇల్లాపు రామస్వామి గురించి చెప్పుకుపోతున్నాడు. అవతారం కళ్ళు కాంతితో తళతళ మెరిశాయి. అది శుభ్రమైన, నిర్మలమైన, దివ్యమైన తేజస్సు అని ఒక్క సద్బ్రాహ్మణులకు మాత్రమే అవగతం కాగలదు. తక్కినవాళ్ళు ఆయన మందహాసాన్ని అపార్థమే చేసుకుంటారు.

ఈ దఫా అవతారంగారిని ఆగుకోవాలని వచ్చిన పెద్ద, పాలుగూరి అసామీ ఇద్దరూ ఏకమైనట్లు ఒకే గొంతులో

"ఇప్పుడేం చెయ్యమంటారు మరి? ఏదో దారి మీరే చెప్పండి." అన్నారు. అవతారంగారు ఎంతో శాంతంగా సమాధానం ఇస్తున్నారు. "హోమియో సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రాణాలను హరించి అర్పించడానికి నను కొడుని తల్లికి తల్లి అనుభవాల్లో వసూదామని ప్రయత్నిస్తున్నాను. మీ రేమనుకున్నా నా నిశ్చయం ఒకటే. మీరు చెప్పినవన్నీ రోగం తప్పకుండా నయమైపోతుందని ధైర్యంగా ధిక్కరించడానికి శుభసూచనలు. బాగుపడడంకూడా అతిత్వరలోనే జరుగుతుంది. బహుశా మీరు ఇంటికి చేరుకొనేసరికి నా మాటలలోని యదార్థం అనుభవంద్వారా గుర్తించగలుగుతారు. ఇంతకు మించి నేనేమీ చెప్పను." మరి కాస్సేపటికి ఆసుపత్రిలో క్రమక్రమంగా నిశ్శబ్దం వ్యాపించడం ప్రారంభించింది. తీసుకు వచ్చిన పొరుగూరి పెద్దలు వేడిగా గొణుక్కుంటూ వెళ్ళిపోయారు. ఇతరులు తనను గురించి ఏమనుకొంటున్నారు? అనే విషయాన్నైనా పట్టించుకోకుండా స్థితప్రజ్ఞునికిలాగే అవతారంగారు మామూలు పనిలోకి మళ్ళిపోయారు.

ఆ వేళ సాయంకాలం మరొక విపరీతమైన సంఘటన సంభవించింది. అదీ అంతరకు అనూహ్యమైనదే. మరొకసారి అవతారంగారికి మహత్వపూర్ణమైన మందహాసాన్ని పుట్టించింది. చలంగారి నుంచి ప్రత్యేక నౌకరుద్వారా అవతారంగారికి ఒక లేఖ పంపబడడమే ఆ వైపరీత్యం.

"శ్రీ అవతారంగారికి...వినయపూర్వక నమస్కారోపరి... నేను తమకిలాగ లేఖ వ్రాస్తున్నానని మీరేమనుకొన్నా నేను బాధపడను. కారణం మీరు చేసినపని. ఇందు కేవలం మీరు మీ ప్రతీకారేచ్ఛ నెరవేర్చుకొన్నారు గాని తత్ఫలితంగా నా మానమర్యాదల భవిష్యత్తు ఎలాగుటుందనైనా యోచించలేదు. నేను ఇప్పటి వరకు మీలో అంతా మంచినే చూచాను. మహా లేక, మీరు నిగ్రహులే కావచ్చు. కాని నా కారణంగా మీరు వాణ్ణి చూడానికి రక్షించబడారన్నది మీ గెంతిమాత్రం లక్ష్యపెట లేదు. మీపగ మీరు తీర్చుకొన్నారు. నాకు అతిపూర్వమే మీకూ నానికీ మధ్య మూడేళ్ళక్రిందట జరిగిన స్పర్థవిషయమై చూచాయగానైనా తెలిసి వుంటే మీకు వాణ్ణి చూపించి ఉండేవాణ్ణిగాదు. చేయి జారిపోయిందనుకొని నేనూ వాడూ ఇప్పుడు విచారిస్తున్నాం. వాడు మరణశయ్యపై వున్నాడు. పోయిన గొంతుమాట దేవుని కెరుక. వాడి వొళ్ళంతా పుండ్లుపట్టి రసికారుతూ భరింపరాని దుర్వాసనతో వాడు బాధపడుతూ వాంతులు చేసుకొంటూంటే మేం చూడలేకపోతున్నాం. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు మేం చేయగ సిందేమైనా వుంటే ఈ జవాను ద్వారా వర్తమానం చేయండి. లేకపోతే మాదారి మేమే చూసుకొంటాం...

భవదీయుడు చలం"—

ఉత్తరం చదువుతూ అవతారంగారు మరొకసారి నవ్వుకుంటూ ఆ పాలేరుతో "నాయనా! నీవు త్వరగా వెళ్ళు. అతనికేమీ ఫర్వా లేదు. దేవుడు తను పాలేరును కరుణించాడని చలంగారితో చెప్పు." అన్నారు. అతడు ఆయనకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఇది జరిగి వారం రోజులు దాటుతుంది. ఆనాడు అవతారంగారు కొన్ని కేసులు చూడ్డానికి పొరుగూరువెళ్ళి ఇంటికి రావడం చాలా ఆలస్యమయ్యింది. ఇంట్లో కూడా ఆసమయంలో ఎవరూ లేనట్లు, ఉన్నా అలికిడి ఎంతమాత్రము కానట్లు నిశ్శబ్దం తాండవిస్తూ ఉంది. చరాచరా ఆయన లోనికి అడుగుపెట్టి కాళ్ళజోడు దిగ విడుస్తూ హాల్లో వున్న రెండు అందమైన పెద పండ్ల బుట్టలను చూస్తూ ఆశ్చర్యంతో ఆనంద పరవశులై సంతోషం పట్టలేక "లోపల ఎవరూ? ... మాట్లాడరేం? ఈ పండ్లు ఎవరు తీసుకొచ్చారు?" [illegible] బింకంగా ప్రశ్నించారు. వంటింట్లో నుంచి డాక్టరుగారి సతీమణి కిలకిల నవ్వుతూ ముందుకొచ్చి "మా డాడీ! ఈ నారింజ పండ్లు ఎంత బాగున్నాయో! చూస్తుంటేనే నవులూరుతున్నాయి. ఇంక తింటే ఎలా వుంటుందో. చేతికి నిండుగా చెంబెడే కాయ దానికి తగ బరువు-పిండితే ముంతెడు రసముంటుంది." అని ఇంకా ఆ లేత యిల్లాలు నారింజపండ్ల సొబగు నగడిస్తూంటే పకపక నవ్వుతూ అవతారంగారు శ్రీమతికి జవాబిచ్చారు "ఔనౌను. తల్లీపిల్లా కలిసి వచ్చినపుడు తగని ఆనందం కలుగుతుంది. అవి గాదలవినప్పుడు, ఆ ... వినప్పుడు వస్తాయి గాని మనం ఎత్తుకొద్దామంటే వీలౌతుందా?"

"ఇవి శ్రీవారి ఘనవైద్యానికి సముచిత సత్కారాలు. ఒకరికి కళ్లు ఇచ్చారట! మరొకరికి కంఠం ప్రసాదించారట! వేరొకరు గంపెడు పళ్ళు పంపించారు. పాపం! వారిమనుష్యు లిప్పటివరకు తమకై నిరీక్షించి వెళ్ళిపోయారు. మరొక శుభదినాన ఆరోగ్యులైద్వయా తమను స్వయంగా దర్శించుకొని ఇతోధికంగా తమకు పారితోషికం సమర్పించుకొని తమపాదాలపై వాలి కృతజ్ఞత చెప్పుకొంటామని మరీ మరీ తమతో మనవి చెయ్యమని విన్నవించుకొన్నారట."

"ఏమిటీ ధోరణి? వాళ్ళతరపున నీవు నాకు భట్టుమూర్తిగా తయారౌతున్నావు."

"అబ్బే. వాళ్ళు పడిపడి దణ్ణాలుపెట్టి చెప్పినదాన్ని ఆకాడికి నేను కుదించగలిగాను అంతే."

భార్యాభర్తలిద్దరూ నవ్వుకొని లోపలికి వెళ్ళారు. ఆమె ఆయనకు భోజనం వడ్డించడానికి సిద్ధపడుతోంది— ఈలోగా అవతారంగారు ఆ గంపలను ఒక్కటొక్కటే ఎత్తలేక ఎత్తి తన పడకగదిలోకి తీసుకువెళ్ళి ఒకమూలను ఆ సబ్బు గుమ్మరించారు. రెండుగంపలనుంచీ రెండువస్తువులు చక్కని శుభ్రమైన కాగితంలో పొట్లంగట్టబడి వుంచబడినవి. అవతారంగారి విపరీతమైన ఆశ్చర్యంలో నుంచి తేల్చడానికి తొందరపడి విఫలమైపోయినట్లు విడిపోయాయి. ఒకే ఒక సమయంలో, ఒకే ఒక స్థలంలో, ఒకే ఒక తావునుంచివచ్చి విడివడిన—అవతారంగారి అతిప్రియమైన వస్తువులు ఆయన స్పృహకు రాలేవ—తిరిగి ఒకే సమయంలో వివిధ స్థలాలనుంచి తమ తమ నెలవులు చేరుకొన్నాయి. ఒకేకొండమీద కురిసిన వర్షధారలు రెండుపాయలుగా ఏర్పడి, మహారణ్య మధ్యంలో విశాలమైన మార్గాన్ని అధిగమించి, తుదకు ఒకే ఒక సుముహూర్తాన సముద్రంలో కలసిపోతుంటాయి. ఆ రెండంటే ఇద్దరు శ్రీమతుల కమ్మదనం వాసన చూస్తూంటే ఆయనకడుపు నిండిపోయినట్లైంది. మూడేళ్లు బానిసత్వం వెలిగించి తమయజమాని సుకృతం కారణంగా తిరిగి స్వేచ్ఛనుపొందిన ఆ రెండు స్వరూపాలు యథాతథంగా తమ మామూలు పెట్టెలో ఇరుక్కొని తృప్తిపడ్డాయి.

అవతారంగారు పీటమీద కూర్చున్నారు. అన్నం తినడం మొదలుపెట్టారు. అయితే ఆ భోజనప్రతీక ఆయన భార్యకు ఎంతో ఆశ్చర్యం కలిగించింది. "ఏవు గావురుమంటూ కడుపెకు ఆకలితో కాలుపెట్టారు లోపల. మరికంచెడు అన్నం వడ్డిస్తే నే, ఒక ముద్దకూడా తినరేం?" అన్న ఆమెకు అవతారంగారి ప్రత్యుత్తరం "నారింజపండ్లు చూస్తూంటే, అవి మనయింటికి వచ్చిన తీరు తలంచుకొంటూంటే ఎంత సంతోషం కలుగుతోందో! నిజంగా చెబుతున్నాను. నాకు ఇపుడు మృష్టాన్నంగా కడుపునిండా భోజనం చేసినంత తృప్తిగా వుంది. ఇంక నాకేమీ అక్కర్లేదు" అని జవాబిచ్చి పీటమీదనుంచి లేచి చెయ్యి కడుక్కొన్నారు. "ఔనౌను—మీ కెవన్నమాటే మీది? నాకూ అలాగే అనిపించింది. అవి నిజంగా అలాగే ఉన్నాయి." అని శ్రీమతి మళ్ళీ తన ఆనందాన్ని వ్యక్తం చేసింది.

వీరము — ఈ మొదలుగా నెన్నింటినైనను కల్పింపవచ్చును. కాని యావసరము లేదు — బలము గర్వమునకు జనకస్థానమగుటవలన తన బలమును గూర్చి చెప్పుకొన్న గరుత్మంతునిమాటలు గర్వోక్తులా యని శంకింపవచ్చును. కాని అవి గర్వోక్తులు కావు. ఏలనగా గరుత్మంతుడు ఉత్తమప్రకృతి. గర్వోక్తు లాడువాడు కాడు. అందుకే గరుత్మంతునకున్న తన బలము యొక్క వినియోగమునందలి దృష్టి స్పష్టము చేయబడినది. అందువలన ఆ వాని ధర్మవీరోత్సాహ లక్షణము చూపబడినది. కనుక బలవీరమన్నది ప్రసక్తి సిద్ధమైన అస్తిత్వము లేనిది క్షమావీరమును వలెనే ధర్మవీరమునందే అంతర్భవించుచున్నది — ఒకవిధముగా చూచినచో యీ వీరములోని బలము మొదలు భౌతికమే కాదు. తపస్థితిని పొందుటకు ముందది చిత్తవృత్తి విశేషము కాకయుండదుగదా! బలము శరీరమునకు సంబంధించినది అది భౌతికము కాన్ను తాను పేర్కొనిన ముప్పదివాల్గు భావములలో పండితరాయలవారు బలమును చెప్పలేదు. ఆ మనవయే కాను మరియే యితర ఆలంకారికుడును బలమును చిత్తవృత్తి విశేషముగా చెప్పలేదు. చెప్పుటకు వీలుకాదు గనుకనే ఎవరుగాని చెప్పలేరు. దానము — దయ — క్షమ ఈ మొదలైనవొకరకముగా చిత్తవృత్తి విశేషములు. అనగా మనోవ్యాపారములు. బలము మనోవ్యాపారము గాదు. ఈ ఫలానా పని చేయగలిగినంత బలము నాకున్నదన్నచో ఆ శక్తి యొక్క ఆ పనిని చేయగలయునన్న ఇచ్ఛను ప్రతియమానము చేయును. అపుడది చిత్తవృత్తి విశేషము. అహంకారము వచ్చినచో పతికోణమున నిఖిల జగతును వహించుచున్న గరుడుని చిత్తవృత్తి యేది? జగత్తును వహించుచున్నా. ఆ యున్న ఆ బలమువల్లగదా కలిగినది? అందువలన బలవీరమునవచ్చునన్నచో దానవీరుడైన బలి వామనునితో "కరచేలంబులో నూపులో—" ఇత్యాదిగా నన్నంగున విశ్వైశ్వర్యవీరము వ్యక్తమగుచున్న దనవచ్చునా? — అన్న ప్రశ్న పుట్టి తీరును. ఇది అనరానప్పుడు అదియు బలవరాను బలికి తన యైశ్వర్యమునందుగాని, గరుడునకు తన బలమునందుగాని తాత్పర్యము లేదు. వినియోగమునందున్నది అనగా బలికి దానరూప ధర్మమునందు బుద్ధి యున్నది. గరుడునకు భూవహన ధర్మమునందు బుద్ధి యున్నది. రెండును ధర్మమునందంతర్భవించునవియే. కనుక బలవీరము లేనే లేదు.

పాండిత్యవీరము విషయమును నిట్టిదే. జగన్నాథులు పాండిత్యవీరము గర్వమునకంటె భిన్నమైన చిత్తవృత్తి విశేషమన్నారు. సూక్ష్మముగా విచారించినచో భిన్నము కాదు. పాండిత్యవీరమునకిచ్చిన యుదాహరణ శ్లోకమున పండితుడు గిరాంపతి పలికినను వాగధీశ్వరి పలికినను హా హానన స్మరణోల్లంఘిత వాఙ్మయాంబుధియైన తాను ముందున్నా నన్నాడు. అనగా వారందరితోను వాదించి గెలువగలిగిన పాండిత్యము తనకున్నదని పండితుని తాత్పర్యము. పండితరాయలవారు గర్వమున్న భావమునకిచ్చిన యుదాహరణ శ్లోకమున ఈ మహీతలమున తనకంటె యతిశయుడు పండితుడు లేడన్న తాత్పర్యములో నన్నాడు పండితుడు. ఈ లోకమునందలి పండితులను తిరస్కరించి స్వోత్కర్షను వెల్లడించుకొనుచున్న పండితుని భావము గర్వమే. ఈ లోకమునందలి వారిని వదలివేసిదాకా పోయిన పండితుని భావము మరొకటి యెట్లగునో స్పష్టపడకున్నది. వాగీశ వచ్చినను నామెతో వాదించి నిలువగలనన్న వాని విషయమున గర్వమింకొకమెట్టు పైకిపోయినదే గాని మరొకటి కాదు. అనగా అది పాండిత్యవీరము గాదు అదియు గర్వమున్న భావమే.

అవసరమునచ్చి కుబేరుడువచ్చి యడిగినను యిచ్చుటకు సాధ్ధ ధనమున్నన్నవాని విషయమున ధనగర్వ మెట్లభివ్యక్తమగుచున్నదో, శాస్త్రవచ్చినను వాదించుటకు సిద్ధముగానున్నానన్నవాని పాండిత్యగర్వ మట్లే వ్యక్తమగుచున్నది. పాండిత్యవీరమున్నచో ధనవీరమునున్నది. ధనవీరము వీరముగాక గర్వమైనట్లే పాండిత్యవీరమును వీరముగాక గర్వమే యగుచున్నది. పాండిత్యవీరోదాహరణమున గర్వము గుప్తముగ నుండి ఉత్సాహము ప్రధానముగా ధ్వనించుచున్నదని పండితరాయలవారనిరిగాని, ఆమాత్రపు టుత్సాహము గర్వోదాహరణ శ్లోకమునందును స్ఫురింపక పోవుట లేదు. మరియు కుబేరునకుకూడ పెట్టుబడి పెట్టగలనన్నవాని విషయమునను నుత్సాహము స్ఫురింపక పోవుటలేదు — ఇవన్నియు వీరములుగావు. గర్వమున్న భావములు. అందువలన పాండిత్య వీరమని వేరుగాలేదు.

మరియు దయావీరము దానవీరమునందును, దానవీరము ధర్మవీరమునందును నంతర్భవించుగుణము గలవి. అట్లే సత్యవీరమును. ఈ విషయమున జగన్నాథుల కాక్షేపణలేనట్లు వారి సిద్ధాంత వైఖరి స్ఫురింపజేయుచున్నది. దయావీరమునకు శిబిచక్రవర్తి కపోతశ్యేనముల కథ నుదాహరించి దయాదాన వీరముల కేక మొనర్చినట్లు రసగంగాధరమున నున్నది. నిజమున కారెండును ధర్మ స్వరూపములే కదా! అదియును గాక వారెండింటికిని గల భేదమేమి? దాన వీరుడడుగబడును. దయా వీరుడడుగబడడు, అంతే. ఇదియొకను సర్వత్ర యుండునది గాదు. దాన వీరుడును అడుగబడకయే దానము చేయుటయం దుత్సాహము చూపుట సంభవము. లోకమునందున్నది. జగన్నాథులు శిబిశ్యేన కపోతములకథ నుదాహరించినది దయావీరనిరూపణ సందర్భమున. అసలలో నా దానమున్నది. అనగా దానమునకున్న స్వయంసంపూర్ణత దయకు లేదన్నమాట. ఉన్నచో కర్ణపరముగా దాన వీరము నుదాహరించినపుడు దయావీర ప్రసక్తి వచ్చియుండెడిది. అసలు రహస్యమేమనగా దయ దానముగా పర్యవసించు గుణము కలది. ఈ గుణము నాగానందనాటకమున లెస్సగా ప్రపంచింపబడియున్నది. మలయవతీ జీమూతవాహనుల పరిణయరూప ఫలాభిముఖముగా సాగిన మొదటి మూడంకములు నదలి మాటాడుచున్నాను. నాగానందమునదయావీరము రసమని సామాన్యముగానమకొనబడుచున్నది. కొందరు శాంతి మేరసమని యనుటయు కలదు, అది వేరువిషయము. నిజము మాటాడినచో నాగానందమున నున్నది దానరూపముగ నూర్జితించినదయ. జీమూతవాహనుడు శంఖచూడునకు బదులుగా వధ్యశిల నెక్కుట కుత్సహించుచో వానికసలు దయపుట్టినదో లేదో గూడ తెలియుటకు వీలుపడదు. దయకు బదులుగా కరుణ యనవచ్చునా? సూక్ష్మముగా విచారించినచో ననరాదు. కరుణనుండి దయ పుట్టును. పరగతకష్ట నష్టరూప దుఃఖము సహింపలేని ద్రుతప్రథమమైన మనోవికారము కరుణము. అయ్యో పాపమనుట కరుణముయొక్క అభివ్యక్తి. ఈ దుఃఖనిరాస మెట్లగును? అందుకు నేమి చేయగలను? ఇట్లు చేయుదునా? — అనునది మొదలైన మనోవ్యాపారము దయారూపము. దయ చూపించినాడనగా ఏదో వినమైన మనోలక్షణ మూవాని కన్నులయందు ముఖమునందు వ్యక్తమైనదని యర్థము. జీమూతవాహనునకు దయ కలిగినదనగా నేదంవిధమైన స్థితి కలిగినదని. ఆ మాత్రము దయపుట్టుట లోకమున సామాన్యము. జీమూతవాహనుని గొప్పదనమందులో లేదు. మరియు స్వశరీరత్యాగమునకు తద్ధ్రమై యుత్సహించుటలో నున్నది. తదర్థమనగా శంఖచూడుని బ్రతికించుటకొరకు. ఇచట ఇట్లనవచ్చును. జీమూతవాహనుడు శరీరత్యాగ విషయమున నుత్సాహము చూపినవాడు కాగా, దాన వీరుడు కావలయునుగాని దయావీరుడనుట యెట్లు పొసగును — అని. నిజమే. కర్ణుడు దానవీరుడు. ఇంద్రునిచే, యడుగబడుట కర్ణుడు ఎట్లు దాన వీరుడగుట కుపస్కారకమైనదో, అట్లే జీమూతవాహనుని విషయమున శంఖచూడుని యొక్కయు ఆ వాని తల్లియొక్కయు దైన్య ముపస్కారకమైనది. అందువల్ల నే అడుగబడుటయు, అడుగబడకపోవుటయు ముఖ్యము కాదనియనుట. అట్లయినచో శరణాగతత్రాణ పరాయణత్వమనుట యేమి? ఇందుకుదాహరణముగా భారతమున శాంతిపర్వమున చెప్పబడిన కపోతకథలో బోయ "ఇచటి భూతాళిం గోలి చెదననుగాచుటకు" అని అనుట గాలిలో వన్నమాటలు. ఆ మాటనే గ్రహించి కపోతము వానినిరక్షించినదిగదా! అనగా స్పష్టముగా నడుగబడకపోయినను శరణమిచ్చుట సరమార్థము. వీటన్నిటికిని పరహితైకతత్యాగభావమే మూలము. అదే పరమధర్మము. మరియొకొక విషయము. దానమునకు బలిని నుదాహరింతురు. నిజమునకు బలి దానవీరుడా? సత్యవీరుడా? వామనుని విషయమున బలియొక్క సత్యసంధప్రమాణ తత్పరభావము యొక్క యాత్యంతిక్యము దానరూపమున వ్యక్తమైనది. సత్య వీరుడుగా హరిశ్చంద్రుడు చెప్పబడుచుండును. ఆ వాని సత్యవీరమునకు మూలము దానము. అనగా దానము మూలముగా సత్యము వెలికి వచ్చినది. బలివిషయమున సత్యసంధతమూలముగా దానమునకు ప్రాధాన్యము వచ్చినది. ఇంతకును చెప్పవచ్చినదేమనగా సత్యత్యాగ దానదయాదులన్నియు ధర్మ స్వరూపములు. అడుగబడుటయు, అడుగబడకపోవుటయు నాధారముగా స్థూలదృష్టిని దానదయా వీరములని పృథక్కరించి చూపుట యనవసరము. ధర్మ ప్రపంచము నానా ప్రకారమై చిత్రమైనది. దానదయాదులన్నియు ధర్మమునందలి యేకదేశములు. సత్యమునకు ధర్మముతో నభేదము భారతమున శాంతి పర్వమున చెప్పబడినది. సత్యము త్రయోదశలక్షణ

ములు కేవలిగా నందు చెప్పబడినవి. ఈ దానదయాదు లన్నియు నందు గ్రహింపబడినవి ధర్మ స్వరూపములైన సత్యక్షమాదానదయాదులను పృథక్కరించి ధర్మేతరములైన వీరరస ప్రభేదములుగా గుర్తింప నవసరము లేదు మరియు వీలు లేదు. అట్లు పేర్కొనుట ప్రారంభించినచో హ్రీవీరము, ధృతివీరము, దమవీరము ఈ మొదలుగా పది పదునాలుగు భేదములను సునాయాసముగా చెప్ప వచ్చును. కాని కూడదు. అందువలన ధర్మవీరమనియే మొత్తమును గ్రహింపవలయును కానియెడల ధర్మవీరములోని అవాంతర భేదములుగా సత్యక్షమా దానదయాదులను చెప్పవచ్చునుగాని, ధర్మేతరములుగా మాత్రము చెప్పరాదు.

ఇపు డిట్లు శంకింపవచ్చును వీరరస ప్రభేదములన్నింటిని ధర్మ వీరమున లీనమగునట్లు చెప్పినపుడు యుద్ధవీరమునగూడ అందే లీనము చేయరాదా? యుద్ధము కూడ యేదో ధర్మము కొరకే జరుగును గదా? అందువలన దీనినిగూడ ధర్మవీరమున సంతర్భవింపజేసిన సరిపోవును గదా? యని. అటు చేయుటకు వీలు లేదు. యుద్ధముకూడ ధర్మము కొరకే చేయబడినను అది విశేషధర్మము. దాన దయాగుణములవలె సామాన్య ధర్మము కాదు. సామాన్యధర్మమును ధర్మమనియు, విశేషధర్మమును ఆ విశేషణముతోను లోకమున వ్యవహారము. అదియునుగాక ప్రతినాయకుడు లేనంత యుద్ధవీరము పుటగు ధర్మవీరమునకు ప్రతినాయకుని ప్రసక్తి యక్కర లేదు. యుద్ధవీరము రజోగుణ ప్రాధాన్యము కలది. ధర్మవీరము సత్త్వగుణము నాశ్రయించినది యుద్ధవీరమున నాయకుని ప్రవృత్తి యధికముగా బహిర్ముఖముగా నుండును. ధర్మవీరుని ప్రవృత్తి అంతర్ముఖముగా నుండును. యుద్ధవీరమునకున్న బాహ్య డంబరము ధర్మవీరమునకు లేదు ధర్మవీరమునకు ఆదర్శ ప్రధానము. యుద్ధవీర మవసర ప్రధానము. ఇత్యాది భేదము లుండుటను బట్టియు ప్రధానముగా ప్రతినాయక ప్రసక్తి యుండుటయు, లేకపోవుటయు మూలముగా యుద్ధవీరము—ధర్మవీరము అను అవాంతర భేదములు వీరరసము విషయమున సమంజసములే యగుచున్నవి. మరియు నా ప్రభేదము లనివార్యములు. అందువలన యుద్ధవీరమును ధర్మవీరమున సంతర్భవింపజేయుటకు వీలుపడదు— ఇపుడు మరియు నిట్లనవచ్చును. ప్రతినాయకు డుండి విశేషధర్మమైన యుద్ధముండుట వలన యుద్ధవీరము పృథక్ప్రసిద్ధమగుచున్నట్లు చెప్పబడినది గదా! రౌద్రమునను ప్రతినాయకు డుండును యుద్ధ ముండును అపూర్వ యుద్ధవీరమును రౌద్రము సంతర్భవింప జేయుట కభ్యంతరమేమని— అభ్యంతర మేమనగా వీర ముత్తమప్రకృతికము రౌద్రము కాదు. సత్త్వరజస్సులు వీరమున ప్రవర్తించును. రౌద్రమున తమస్సు ప్రవర్తించును. తమః ప్రధానమై రౌద్రము అధమ ప్రకృతికమగుచున్నదని భరతముని నిష్కర్ష. వీరము నున్న లోక సంగ్రహైక తత్పరత రౌద్రమున లేదు. సత్త్వరజోగుణ ప్రధానమైనదియు, ఉత్తమ ప్రకృతికమైనదియునైన వీరము రౌద్రమున సంతర్భవింపదు.

వసగప గంగాధరమునందలి రసధ్వని ప్రకరణమును జాగ్రత్తగా పరిశీలించినచో శ్రీ జగన్నాథులవారికి రస విషయమున ప్రభేదముల నంతగా పృథక్కరించి చూపుట యిష్టము కానట్లు స్ఫురించును. శృంగారము విషయమున విప్రలంభమునందలి పంచవిధ భేదముల నంగీకరింపనక్కర లేదనియు, సంయోగవిప్రలంభము లన్న చాలుననియు సిద్ధాంతము చేసెను. హాస్యము విషయమున ప్రాచీనాచార్య చెప్పుచున్నారని భరతముని చెప్పిన ప్రభేదముల నట్లే చెప్పను కాదనుట లుచిత మగు. మరియు మహర్షి కరుణము విషయమున చూపిన మూడు భేదములను, భయానకమునకు చెప్పిన మూడు ములను బీభత్సమునందు నిరూపించిన రెండు భేదములను పండితరాయలవా రసలు పేర్కొనలేదు. పూర్వాచార్యు లిట్లు వ్యానిగూఢ అనలేదు. ఒక్క వీర రసమువిషయమునే కొంత చేసినది. అదియునుగాక భరతుడు చెప్పిన దానవీరమును గూర్చి తరువాతివారు కల్పించిన దయావీరమునుగూర్చియు ఇది ధర్మవీర సంతర్భవింప జేయవచ్చునుగదా? వీ విడిగా నుండవలయును? మరియు తాను కొన్నింటిని కల్పించెను ఆకల్పించుట యెట్లు దనిగా ఇట్లవాంతర భేదములను నింకను కల్పింపవచ్చును గాని మార్గమది కాదన్నట్లుగా నున్నది అందువలన రసవిషయ అవాంతర భేదములను సాధ్యమైనంతపరిమితము చేసి పరిష్కరించు రాయలవారి యుద్దేశ్యమని తోచుచున్నది. కనుకనే వీరరస ప్రభేదము లన్ని లేకనియు, కేవలము యుద్ధవీరము, ధర్మవీరము అను కలవనియు సిద్ధాంతము చేయబడినది. ఇది జగన్నాథుల వ్యా మున కనుగుణముగానే చేయబడినది. అది యెట్లో కొద్దిగా విరమింతును.

"పరపరాక్రమ దానాది స్మృతి —" యని స్వ భావమైన యుత్సాహమును నిర్వచించుచు రాయలవారు ప్ర తర్వాతి వీరరసమునుగూర్చి మాట్లాడునపుడు దానమును (దయ గూడ) ధర్మమున సంతర్భవింపజేయుటకు వీలున్నది గదా ప్రశ్నించిరి. దానము ధర్మమునందలి యేకదేశమని ఆయనకు యును. అందువల్లనే దానదయాదికమును ధర్మమున సంతర్భ చేయవచ్చుననుట. దానములో ధర్మవీరమును లీనము చేయవచ్చు లేదు. దానమే ధర్మము కాదు. ధర్మలక్షణములలో దాన మొక సాయిని నిర్వచించుచూ దానమును గ్రహించుట ధర్మ కుపలక్షకము. ధర్మశబ్దమునే యేల గ్రహింప లేదన్న పరుని యొక్క ధర్మమును స్మరించుట యన్నది పరుని యొ దానమును స్మరించుట యన్నంత స్పష్టము కాదు. పైగా ప్రపంచము చాల పెద్దది. పరుని యొక్క యెట్టి ధర్మమును స్మరించి యన్న ప్రశ్న పుట్టును. దానాది యని సమాధానము. నిర్వచ సందిగ్ధముగా నుండరాదు కనుక దానశబ్దము గ్రహింపబడినది. పరపరాక్రమ మన్నది యుద్ధ వీరమున కుపలక్షకము. పరపరాక్ర దికములు యుద్ధమునం దెట్లు పర్యవసించునో దానాదికములు ధర సందట్లు పర్యవసించును. మరియు నొక విశేష మేమనగా శబ్దము తన బహువిస్తృతమైన యర్థబోధక శక్తివలన ఒకప యుద్ధమునుగూడ బోధించిన బోధింపగలదు. అపుడు పరాక్రమ మక్కర లేక పోవలసివచ్చును కాని యుద్ధవీరమునకు పృథక్వ వార మభిప్రేతమగుటవలన పరాక్రమశబ్దమును రాయలవా రుప గించిరి. యుద్ధము రాజధర్మము దానాదికములు సర్వవర్ణ సామ ధర్మములు అందువలన విశేషధర్మమైన యుద్ధమున కుపల ముగా పరాక్రమ శబ్దమును, సామాన్య ధర్మమున కుపలక్షకమ దానాదికమును నిర్వచనమున జగన్నాథు లుపయోగించిరి. వలన వీరరసము, యుద్ధవీరము—ధర్మవీరము అని శ్రీ జగన్నాథ పండితరాయలవారి హృదయము

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S. Rao
at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras
Editor: S. Sambu Prasad